# ॥ ప్రజ్ఞా పురాణం ॥

## ప్రథమ ఖండం

# లోక కళ్యాణ జిజ్ఞాస
# ఆధ్యాత్మ దర్శన ప్రకరణములు


*హిందీ మూలం:*

వేదమూర్తి, తపోనిష్ఠ, యుగద్రష్ఠ

**పండిత శ్రీరామశర్మ ఆచార్య**

**గాయత్రీతీర్థ్, శాంతికుంజ్, హరిద్వార్ - 249411 (ఉ.ప్ర)**

*తెలుగు అనువాదం:*

**నేమాని గౌరీసావిత్రి**

సాహిత్య రత్న(హిందీ)



గాయత్రీ తీర్థ్, శాంతికుంజ్, హరిద్వార్.

గాయత్రీ చేతనా కేంద్రము, హైదరాబాదు.

ప్రజ్ఞా పురాణం - ప్రథమ ఖండం

## లోక కళ్యాణ జిజ్ఞాస -ఆధ్యాత్మ జ్ఞాన ప్రకరణములు

*ద్వితీయ ముద్రణ:*
సర్వజిత్ నామ సంవత్సర మార్గశిరం

**ప్రతులు : 5000**

**మూల్యము: రూ. 20 /- లు**

*డి.టి.పి., ముఖచిత్ర రూపకల్పన:*

**దేవీప్రసాద్**

**ప్రజ్ఞా గ్రాఫిక్స్, గుంటూరు.**

*ముద్రణ:*

**శ్రీదత్తసాయిగ్రాఫిక్స్, హైదరాబాదు.**

GAYATRI
CHETANA
KENDRA
& MEDITATION CENTRE

*ప్రతులకు:*

గాయత్రీ చేతనా కేంద్రము మరియు ధ్యాన మందిరం
అశ్వినిహౌస్ వద్ద, మూసాపేట, హైదరాబాదు -500 018

## ॥ తొలిపలుకు ॥

మానవుని ఎట్టెదుట సాక్షాత్కరించే అనేక సమస్యలకు పరిష్కారాన్ని తెలిపే కథలు, ప్రసంగాలు అనేకం భారతీయ ఇతిహాసాలలోను, పురాణాలలోను వ్రాయబడి ఉన్నాయి. కాలం యొక్క అవసరాన్ని, ఈనాటి పరిస్థితులను దృష్టిలో పెట్టుకొని, ఈ యుగ సమస్యలను పరిష్కరించగల కొన్ని ప్రసంగాలను, కథలను ఈ "ప్రజ్ఞాపురాణం"లో పొందుపరిచాము. యుగవేదాంతం నిండి ఉన్న ఈ పురాణంలోని శ్లోకాలు, సందర్భాలు నవీనమైనవిగా ఉన్నా, దీనిలో పొందు పరచిన సత్యాలు! సనాతమైనవి, శాశ్వతమైనవి. దీనిలో సమగ్ర మానవ ధర్మానికి వన్నె తెచ్చే అనేక ఇతిహాస పురాణ కథలే కాక ఇతర మతాలకు చెందిన వారికోసం ఇతర ధర్మావలంబులైన ప్రజల కోసం కూడా అనేక కథలు సేకరించటం జరిగింది.

కాలం ఒకేలా ఉండదు. మార్పు దాని సహజ లక్షణం, మారే కాలంతో పరిస్థితులు, సమస్యలు, సంప్రదాయాలు, విలువలు కూడా మారుతూనే ఉంటాయి. ఈ శాశ్వత సృష్టిని, మారేకాలాన్ని దృష్టిలో ఉంచుకొని కాలానుగుణంగా మార్గదర్శనాన్ని ఇవ్వగల సాహిత్యాన్ని సమాజానికి అందివ్వ వలసిన బాధ్యత ఎంతైనా ఉంది. అన్నిరకాల మానసిక స్థితి కలవారినీ, వారి వారి పరిస్థితులను దృష్టి యందుంచుకొని, వారికి సౌకర్యాన్ని ఇవ్వాలనే తలంపుతో ఈ గ్రంథ రచన సాగింది. దీనివలన నా ఏకాంత సాధనకు ఇబ్బంది కలిగినా ఒకేసారిగా ఈ పురాణం 4 ఖండాలుగా సృష్టించబడ్డాయి. ఈ యుగ పురాణాన్ని సనాతనమైన 18 పురాణాల వలెనే 18 ఖండాలుగ లిఖించాలనే కోరిక ఉన్నది. భవిష్యత్తు మన చేతుల్లో లేకపోయినా చేతిలోని కలం ఆగనంటూ పరిగెడుతూనే ఉంటుంది.

ప్రాచీన కాలంలో 18 పురాణాలు లిఖించబడ్డాయి. అవి చాలవంటూ మరో 18 ఉపపురాణాలు లిఖించ బడ్డాయి. వీటిలో మొత్తం 100,00,000 శ్లోకాలున్నాయి. అంతేకాక నాలుగు వేదాలలోను మొత్తం 20 వేల మంత్రాలున్నాయి. ఇంకా చాలా కథా సాహిత్యం లిఖించబడింది. ఈ కథాసాహిత్యం అంతా త్రాసులోని ఒక సిబ్బెలోను, మిగిలిన మొత్తం సాహిత్యం రెండవ సిబ్బెలోను పెడితే కథాసాహిత్యం పెట్టిన సిబ్బెవైపే మొగ్గు చూపుతుంది అంటే అతిశయోక్తికాదు. వేదాంతపరమైన ప్రవచనాలు, ప్రతిపాదనలు వికసించిన మనోభూమి కలవారికి మాత్రమే అవగతమవుతాయి. కానీ కథలు శిక్షితులను, అశిక్షితులను, బాలలను వృద్ధులను, స్త్రీలను, పురుషులను అందరినీ అలరిస్తాయి. కథాసాహిత్యం కేవలం లోకరంజనమే కాదు లోకమంగళం కూడా.

పర్వదినాలలో అనేక అనుష్ఠానాలు ఆచరిస్తూ ఉంటాం. అలాంటప్పుడు విధిగా ప్రజ్ఞాపురాణ ప్రవచనాలు వినిపించాలి. మొదటిరోజు దేవపూజ, వ్రతధారణ, మంగళాచరణ కావించి, ఉదయం ఒక గంట సాయంత్రం ఒక గంట. ఒక్కొక్క ఖండం ఒక్కొక్కరోజు సంక్షిప్త పరిచయం ద్వారా వినిపించవచ్చు. ఆఖరు రోజు పాయసం, ఖిచిడీ వంటి పదార్థాలతో సామూహికంగా ప్రీతి భోజనాలు చేసి, ఆ తరువాత సంస్థయొక్క బ్యానర్స్‌తో శోభాయాత్ర (ఊరేగింపు) జరిపించాలి. ఈ ప్రీతి భోజనం, శోభాయాత్రల వల్ల వ్యక్తుల మధ్య కులమతాలు మొదలైన అనేక అడ్డుగోడలు తొలగి ప్రవచనాలు నూటికి నూరుపాళ్ళు ఫలించే అవకాశాలు ఉన్నాయి.

ఈ గ్రంథాలను వ్యక్తిగత స్వాధ్యాయానికి ఉపయోగిస్తే వ్యక్తి శక్తిగా మారగలడు. సామూహిక సత్సంగాలలో ఉపయోగిస్తే జనజాగృతి జరిగి తీరుతుంది. రాత్రి నిద్రించే ముందు కుటుంబ సభ్యులు అంతా కలిసి చదువుకొంటే నిద్రలో సూక్ష్మ శరీరాలకు సందేశాలు అందుతాయి. చిన్నపిల్లలకుఈ పురాణం అత్యంత ప్రీతికరమైనది. అలాగే వృద్ధులకు ఈ పురాణం ధర్మపరంపరను అవగతం చేయటానికి అత్యంత సహాయకారిగా తోడ్పడుతుంది. ఈ పురాణం రోజూ దేవాలయాల్లో వినిపిస్తే పలాయన వాదానికి అలవాటుపడ్డ ఆలయాలు జాగృతి కేంద్రాలుగా అనతికాలంలోనే మారిపోతాయి.

లోకశిక్షణకు గోష్ఠులు, సభలు, సమావేశాలు ఎంతో అవసరం, కానీ వేదాంతపరమైన ఉపన్యాసాలు అక్కడ వినిపించటం వల్ల సామాన్య జనులకు అర్థంకాక విసిగి పారిపోయి పలాయనవాదానికి అలవాటు పడతారు. కానీ ఈ పురాణంలోని కథలు, ప్రసంగాలు నెలల తరబడి వినిపించినా ఇంకా వినాలనిపించేటంత ఆసక్తికరంగా ఉంటాయి. హృదయానికి హత్తుకొంటాయి. యుగశిల్పులకు, ప్రజ్ఞాపరిజనులకు లోక శిక్షణార్థం ఒక అమూల్యమైన "నిధి" ప్రజ్ఞాపురాణ రూపంలో అందజేయబడింది. ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని ప్రతి ప్రజ్ఞాపీఠంలోను, ప్రశిక్షణా కేంద్రంలోను, ప్రతి సభలోను, ప్రతి సమావేశంలోను ప్రజలకు "యుగసందేశం" గా ప్రజ్ఞాపురాణం వినిపించండి.

ప్రథమఖండంలో యుగసమస్యల కారణంగా ఉద్భవించిన అవిశ్వాసం యొక్క వివరణ ఈయబడింది. దాని నుండి బయటపడి ఎలా ప్రజ్ఞాయుగాన్ని క్రియారూపంలో అవతార శక్తిద్వారా ప్రవేశ పెట్టగలమో సందేశ రూపంలో అందించబడింది. భ్రష్ట చింతనలు, దుష్ట ఆచరణల నుండి బయటపడి ఆధ్యాత్మ విలువలను వ్యవహారిక రూపంలో ఏ విధంగా ఉపయోగించుకోవచ్చో తెలియజేసే విస్తృత వివరణ దీనిలో ఇవ్వబడింది. చివరకు "మహాప్రజ్ఞ" యొక్క ఆలంబన ద్వారా లభింపగల సత్యయుగ వాతావరణ పరిస్థితుల వెలుగులు వెదజల్లబడ్డాయి.

ఈ నా రచనలో ఎక్కడైన అనుచితంగానీ, అసందర్భం గానీ, గోచరించినా, అక్షర తప్పులుగానీ, ముద్రణ లోపాలుగానీ ఉన్నా విజ్ఞులు నాకు తెలియజేయండి. ఆనందంగా స్వీకరించి తరువాత ప్రచురణలో అలా జరగకుండా చూసుకొంటాను.

**– శ్రీరామశర్మ ఆచార్య**

# || ప్రజ్ఞా పురాణం ||

## లోక కళ్యాణ జిజ్ఞాస ప్రకరణం

### నారద శ్రీకృష్ణ సంవాదము :

ఒకనాడు నారదమహర్షి కృష్ణ భగవానుని ఈ విధంగా ప్రార్థించాడు – "ఓ దేవా! ఈ కురీతియుక్త సమాజాన్ని నవనిర్మాణం కావించాలంటే ఏమి చేయాలి? వరిష్ఠాత్ములను వెదకి వారిచే ఏమేమి చేయించాలి? స్పష్టంగా శెలవివ్వు"మని కోరిన నారద మహర్షిని కృష్ణ భగవానుడు మందస్మిత వదనారవిందంతో వీక్షిస్తూ ఇలా అన్నాడు. "ఓ మహర్షీ! ఒకసారి ఉత్తరాఖండము యొక్క హిమాచ్ఛాదితమైన అరణ్య భాగంలో పిప్పిలాదమహర్షి యొక్క తత్వబోధలో 5 రోజులు ప్రజ్ఞాశిబిరం నిర్వహించబడింది. ఆ శిబిరంలో అష్టావక్రుడు, శ్వేతకేతు, శృంగి, ఉద్దాలకుడు, దుర్వాసుడు అను ఐదుగురు జిజ్ఞాసువులు పాల్గొన్నారు. **పిప్పలాదమహర్షి ఏ బ్రహ్మ విద్యాసారాన్ని వారి ముందు ఉంచటం జరిగిందో దానినే తిరిగి నీ ముందు ఉంచుతాను. ధ్యానమగ్నుడివై హృదయంలో నిలుపుకో" అని ఆదేశిస్తాడు.**

ఏదైనా తథ్యం యొక్క సమర్థన, ప్రతిపాదన ప్రత్యక్ష ఉదాహరణల ద్వారా చేయవలసి ఉంది. ఇది ఋషి ప్రణాళిక. ఆధ్యాత్మ విజ్ఞానపు వ్యవహారిక శిక్షణ యొక్క విస్తృత కార్యప్రణాళికను తెల్సుకోవాలని ఉత్సాహ పడుతున్న నారదమహర్షికి కృష్ణపరమాత్మ ఒక విశిష్ట ప్రజ్ఞా శిబిరాన్ని గుర్తుచేసి అక్కడ జరిగిన చర్చను విష్ణువు తన పరావాణి ద్వారా **"ప్రజ్ఞాపురాణం"** రూపంలో నారదునికి వినిపించి, దానిని అగ్రదూతలకు, వరిష్ఠాత్మలకు అటుపైన సర్వసాధారణులైన మానవాళికి కూడా అందించి వారిని ఆ జ్ఞాన ప్రకాశంలో ప్రకాశింపచేయుమని ఆదేశిస్తాడు.

సమాధి స్థితిలో నున్న నారదునికి భగవానుడు "ప్రజ్ఞా పురాణాన్ని" వినిపించి "నారదా! ఈ ప్రజ్ఞాపురాణ ప్రసంగాలను యుగచైతన్యాన్ని వర్షింపజేసే మేఘాలుగా సర్వత్ర వర్షింపచేయి. విశ్వాసరాహిత్యం అనే విపత్తులో ఎండి, మోడైన ధర్మాన్ని తిరిగి సస్యశ్యామలం కావించు. ఇదే నీ ప్రథమ కర్తవ్యం" అని ఆజ్ఞాపించాడు.

చైతన్యాన్ని జాగృతం చేసే కార్యభారాన్ని అవతారాలు. మహామానవులు, అగ్రదూతలు, జాగృతాత్మలు సునాయాసంగా నిర్వహించగలరు. వారు దిగిరావటంలో ఉద్దేశ్యమే ఇది. విశ్వాస రాహిత్యం యొక్క ఉద్భవస్థానం అంతఃకరణ కాబట్టి వీరు వ్యక్తియొక్క అంతఃకరణలోను అలజడిని సృష్టిస్తారు. మరుభూమిగా మారిన అంతః కరణలో సంవేదనలు పుట్టిస్తారు. ఆదర్శవంతమైన ఔన్నత్యం పట్ల సమర్పణాభావాన్ని మేల్కొల్పుతారు. అవతారాలయొక్క కార్యప్రణాళిక ఇదే. యుగపరివర్తనా ప్రక్రియలో మున్ముందు జరుగబోయే వాటికి మొదటి అడుగు ఇదేనంటూ భగవానుడు నారదునికి అదే కార్యభారాన్ని అప్పగించాడు.

**గాయత్రి కల్పవృక్షం. దానిని ఆశ్రయించిన వ్యక్తికి ఎన్నడూ ఎలాంటి కొరతా ఉండదు.**

**లోక కల్యాణకృద్ ధర్మధారణా సంప్రసారకః ।**
**ప్రతీ యా యావరోమాన్యో దేవర్షి ఋషిసత్తమః ॥**
**అవ్యాహత గతిం ప్రాప గంతుం విష్ణు పదం సదా ।**
**నారదో జ్ఞాన చర్చార్థం స్థిత్వా వైకుంఠ సన్నిధౌ ॥**

లోక కళ్యాణమే ఆత్మకళ్యాణంగా భావించటం వలన మాత్రమే నారద మహర్షికి ఏ అవరోధం లేకుండా విష్ణు లోకం ప్రవేశించి భగవంతునికి అతి సమీపంలో కూర్చొని కోరుకున్నంత వరకూ జ్ఞాన చర్చ జరుపగల సౌకర్యం లభించింది.

ధర్మరక్షణకై వ్యక్తి వ్యక్తికి ప్రేరణనిస్తూ నిరంతరం పయనించే నారద మహర్షి ఋషులలో సర్వశ్రేష్ఠుడు. కాలానుగుణంగా ఆనాటి సమస్యలను, పరిష్కార మార్గాలను భవిష్యత్ కార్యక్రమాలను భగవానునితో చర్చిస్తూ తదనుగుణంగా ఆ కార్యక్రమాలలో నిమగ్నమయ్యేవాడు.

పరుల క్షేమంలోనే మన క్షేమం మిళితమై ఉన్నదనే సత్యాన్ని గ్రహించిన వ్యక్తులందరూ నారద మహర్షిలా 4 లక్షణాలను అలవరచుకోవలసి ఉంది. అవి ఏమంటే : **1. జనజాగృతి 2. నిరంతరం పరిభ్రమించటం 3. సత్పరామర్శ 4. దారితప్పినవారికి సన్మార్గం చూపటం.**

పరుల క్షేమానికి పాటుపడే ప్రతివ్యక్తి పుణ్యాన్ని ఆర్జించటమే కాక, తనని తను సర్వవిధాల ఉద్ధరించు కోగలడు. ఇతరుల్ని సాగరం దాటించే నావికుడు తాను ప్రత్యేకంగా దాటవల్సిన పని ఉండదు. పరమార్థ పరాయణులకు గౌరవమర్యాదలకు కూడా కొరత ఉండదు అని తెలిపే కొన్ని కథలు తెల్సుకొందాం.

**కథ -1** : ఒకసారి బ్రహ్మసరోవరం దైవంతో ఏమన్నదంటే, "దేవా! గంగామాతని ప్రజలు వేయినోళ్ళ కొనియాడుతూ ఉంటారు. ఆమె అందరిచేత అనేక విధాలుగా పూజలు అందుకొంటోంది. గంగ వలెనే నేను కూడా ప్రజలకు శీతలత్వం, సద్గతి లభింపచేస్తున్నా ఆమెకు దక్కే పూజలు, ప్రశంసలు నాకు బొత్తిగా లభించటం లేదు కారణం ఏమిటని?" ప్రశ్నిస్తుంది.

బ్రహ్మసరోవరంతో విష్ణువిలా అన్నాడు : "గంగ సకలజీవులను, జంగమ స్థావరాలను పునీతంచేస్తూ ఎల్లలు లేకుండా ప్రవహిస్తోంది. ఇంటింటికీ వెళ్ళి దాహం తీర్చి వారిని పునీతం చేస్తోంది. నీవలాకాదు, నీ దగ్గరకు వచ్చినవారికి మాత్రమే సద్గతి నిస్తున్నావు. అందుకే ఆమెకు దక్కిన పూజలు, ప్రశంసలు నీకు దక్కటము లేదు" అంటాడు.

విష్ణువు వాక్కు ద్వారా గంగ యొక్క ఔన్నత్యాన్ని గురించి విన్న బ్రహ్మసరోవరం సిగ్గుతో తల వంచింది. ఆపైన ఆమె ఇటువంటి మనోవికారానికి ఎన్నడూ తావీయలేదు.

**కథ -2** : పర్వత శిఖరం మీద నెలవై ఉన్న దేవీ ప్రతిమ ఒకరోజు తన ఎదురుగా ఉన్న కాలిబాటను చూసి జాలిపడుతూ, "ఓ కాలిబాటా ! పాపం నీవు ప్రతిరోజూ నా వద్దకు వచ్చే భక్తుల భారాన్ని, కాలిదెబ్బలను

**భగవంతుని ఆహ్వానాన్ని అందుకున్న వ్యక్తి ఎన్నడూ నష్టపోరు.**

భరిస్తూ చాలా కష్టపడతావు. నిన్నుచూస్తే జాలివేస్తుంది." అంటూ సానుభూతి చూపిస్తుంది. ఆ సానుభూతిని తిరస్కరిస్తూ కాలిబాట దేవీ ప్రతిమను చూచి చిరునవ్వు నవ్వి, "ఓ పూజ్యురాలా ! భగవంతుని వద్దకు భక్తుని చేర్చటం అంటే అర్థం స్వయంగా తాను భగవంతుని చేరటమే కదమ్మా. నేను లేకుండా నీ వద్దకు నీ భక్తులను ఎవరు చేరుస్తారు? కాబట్టి నా బాధ్యత నాకు బరువు కాదు" అని బదులు పల్కుతుంది. కాలిబాట యొక్క ఈ ఔన్నత్యం ముందు దేవీప్రతిమ శిరస్సు వంచుతుంది.

**కథ –3** :ఒక వ్యక్తి తనతో కిరీటాన్ని, ఖడ్గాన్ని భగవంతుని కొరకు కానుకలుగా తీసుకొస్తాడు. పైగా వాటిని దైవానికి ఏకాంతంలో సమర్పించాలను కొంటాడు. కానీ దైవం దర్బారు ముందు నిలబడిన ద్వార పాలకులు అతన్ని వారిస్తూ, "ఓ సోదరుడా! దైవానికి నీ కానుకలు ఎందుకయ్యా ? ఆయనే బ్రహ్మాండానికంతకీ నాయకుడు. కిరీటము దేనికి ? ఖడ్గంతో బొత్తిగా ఆయనకు పనిలేదు. ఆయన స్వయంగా జ్ఞాన స్వరూపుడు. జ్ఞానంతోటే బంధనాలైన శత్రువుల్ని సంహరించి వేస్తాడు అంటూ ఉండగానే అటువైపుగా ఒక వృద్ధుడు వస్తూ పడిపోవడం ఈ వ్యక్తి చూస్తాడు. వడివడిగా వెళ్ళి ఆ వృద్ధుని రక్షించి, సేదతీర్చి తిరిగి వస్తాడు. వచ్చి చూసేసరికి ద్వారపాలకులు వినయంగా ప్రక్కకి తొలగి ప్రభుమందిర ప్రవేశానికి సునాయాసముగా దారి ఇస్తారు. సర్వం ఈయగల దైవానికి ఏవో కానుకలు ఇవ్వటం కాక ఆయన సృష్టించిన అన్ని జీవులలోను ఆయన్ని దర్శించాలని పై కథ మనకు తెలియజేస్తుంది.

**దేవర్షిః పరమ ప్రీతః ప్రవచ్ఛ వినయాన్వితః ।**
**నేతుం జీవన చర్యాం వై సాధనామయతాం ప్రభో ॥**
**ప్రాప్తుంచ పరమం లక్ష్య ముపాయం సరళం పద ।**
**సమా విష్ణోభవేద్యస్తు సామాన్యే జన జీవనే ॥**
**విహాయ స్వగృహం నైవగంతుం వివశతాభవేత్ ।**
**అసామాన్య జనార్హా చ తితీక్షా యత్ర నోతవ ॥**

దేవర్షి కృష్ణ భగవానునికి నమస్కరించి ఇలా అన్నాడు – **"దేవా ! జనమానవ స్థాయిని బట్టి జనులను రెండు వర్గాలుగా విభజించవలసి ఉన్నది. మొదటి స్థాయికి చెందినవారు సంచిత సంస్కారాల వల్ల యోగసాధనలు, తపస్సులు, అనుష్ఠానాలు, వ్రతదీక్షలు ఆచరిస్తూ, బ్రహ్మవిద్యను సునాయాసంగా అవగాహన చేసుకోగల్గుతారు.** తత్వదర్శనం, సాధన, తపశ్చర్య యొక్క మర్మాన్ని, అంతటి కఠోర పురుషార్థాన్ని ఆచరించగల పాత్రతను వీరు గత జన్మలో ఆర్జించిన సంస్కారాల కారణంగా కల్గివుంటారు. కానీ వీరి సంఖ్య చాలా తక్కువ. **రెండవ స్థాయికి చెందిన వ్యక్తులు అధిక సంఖ్యలో ఉంది ఏదో విధంగా జీవితాలను** ఈడుస్తూ, విపత్తులు, కష్టాలను పరిష్కరించుకొంటూ, సాధనా విజ్ఞానాన్ని గురించిన అవగాహన కూడా లేకుండా బ్రతికేస్తున్నారు. వీరు వీరి జీవితాలలో అమలుపరచ గల్గినది, తపోసాధనలకై ఇల్లు వదలిపోనక్కర లేనిది, **జీవనచర్యనే సాధనామయం కావించుకొని పరమ లక్ష్యాన్ని చేరగల తరుణోపాయం** ఏమైనా ఉంటే మార్గదర్శనం చేయుమని" ప్రార్థిస్తాడు.

**శిష్టాచారం కొనకుండా అలవడుతుంది. దానిద్వారా అన్నింటినీ కొనవచ్చు.**

దైవాన్ని నారదుడు అడిగిన ప్రశ్న సారగర్భితమైనది. సామాన్యజనులంతా భక్తి, వైరాగ్యం అంటే ఇల్లు, ఆలుబిడ్డలను వదిలివేసి తపస్సుకై తపోవనాలకు పోవటమో లేక భక్తి పేరిట బాధ్యతలు, కర్తవ్యాలను ఉపేక్షించి రామాయణ, భాగవతాలను పఠిస్తూ పూజలు చేయటమో అని భావిస్తారు. కానీ **ఈ ఉన్నత స్థాయికి చెందిన తపోసాధనకు మొదటి అడుగు జీవన సాధన** అనే మర్మాన్ని గుర్తించరు. దైవం తమకు ప్రసాదించిన జీవితం ద్వారా చేసే సాధన మహోన్నతమైనది. తమకు లభించిన వృత్తి విద్యయే దైవపూజగా భావించి నిజాయితీగా నిర్వర్తించటం కంటే గొప్పదైన ధార్మిక కర్మకాండ వేరేదిలేదు.

దైవం ద్వారా ప్రసాదించబడిన జీవితం ద్వారా చేసే సాధన ప్రభు పరాయణ జీవితం యొక్క విధి విధానాలను అవగతం చేసుకోవటాన్ని, దాన్ని ఆచరణలో పెట్టటానికి, మార్గాన్ని కోరుతూ దరఖాస్తు పెడుతుంది. (రామాయణంలో కాకాభుసుండి గరుడునికి ఇదే విధమయిన మార్గదర్శనం ఇవ్వటం జరిగింది.)

## *మార్గదర్శనాన్ని తెలిపే కొన్ని కథలు తెల్సుకొందాం :*

**కథ -4** : **శు**కమహర్షి సభలో నున్న జనక మహారాజుకు ప్రణామం చేస్తాడు. సర్వం త్యజించిన సన్యాసి, గృహస్థుడైన మహారాజుకు నమస్కరించటం సభలోని వారికి ఆశ్చర్యాన్ని కల్గిస్తుంది. వారి ఆశ్చర్యాన్ని గమనించి సభాసదులతో శుకుడు ఇలా అన్నాడు – "ఓ విద్వాంసులారా ! జనక మహారాజు తన జీవితాన్నే యోగమయం కావించుకొన్న ధన్యుడు. అతని ప్రతి పనినీ భగవంతునికి, ఆదర్శాలకు సమర్పణ కావించిన మహనీయుడు. కాబట్టి యోగులలోకెల్ల సర్వశ్రేష్ఠుడు" అని ఆనందంతో అక్కున చేర్చుకొంటాడు.

**కథ -5** : **శు**కమహర్షి పుట్టగానే ఇల్లు వదలిపోతూ ఉంటాడు. తండ్రి అయిన వ్యాసమహర్షి శుకుని పిలిచి, నాయనా! కనీసం కన్నతల్లి పాలైనా త్రాగి వెళ్లుమని అంటారు. కానీ శుకుడు ఆగక వెళుతూనే సంసార బంధనాలలో ఇరికించవద్దనీ, తనకింకా పూర్వజన్మ స్మృతి వున్నది కాబట్టి, తన లక్ష్యాన్ని సాధించటానికి తపోభూమికి త్వరగా వెళ్ళనీయుమని కోరుతూ వ్యాసునికి నమస్కరిస్తాడు.

**కథ -6** : **అలాగే నానక్** పిల్లవాడుగా వున్నపుడు తండ్రి కొంత డబ్బు ఇచ్చి ఏదైనా వ్యాపారం చేసుకొని జీవించుమని పంపిస్తాడు. బాలుడైన నానక్ తండ్రి ఇచ్చిన ధనాన్ని ఆకలితో వున్న అంగ విహీనులకు పంచివేసి అసలైన వ్యాపారం ఏమిటో తెల్సుకోవాలని అన్వేషిస్తూ మహాత్ములను దర్శిస్తూ విశ్వమంతా తిరగసాగాడు. ఇవి సంచిత సంస్కారాల ఫలంగా ప్రాప్తించిన జీవితాల గురించి తెలిపే కథలు. కానీ ప్రాప్తించిన జీవితాన్నే సాధనామయం కావించుకొన్న మరొక కథ చూద్దాం.

**కథ -7** : **రైదాస్** అనే వ్యక్తి చెప్పులు కుట్టి జీవయాత్ర సాగించేవాడు. **తాను చేసే పని దైవ పూజగా భావించి** పరిపూర్ణమైన భక్తిశ్రద్ధలతో పని చేసుకొంటూ ఉండేవాడు. నిత్యం జప తపాలలో లీనమై వుండే ఒక సాధువు ఒక పర్వదినాన గంగా స్నానానికి వెళుతూ రైదాస్‌ను కూడా గంగా స్నానానికి రమ్మని పిలుస్తాడు. కానీ రైదాస్ తన అసహాయతకు చింతిస్తూ కొందరు గ్రామవాసులకు మర్నాటికి చెప్పులు కుట్టి ఇవ్వవలసి వున్నదనీ, ఇస్తానన్న సమయానికి వారి చెప్పులు వారికీయక వారికి ఇబ్బందికి గురి చేయలేనని, గంగాస్నానం

**కర్మయొక్క సహకారం లేని జ్ఞానం నిరర్థకం.**

చేసే భాగ్యం తనకింకా కలగలేదనీ బాధతో తెలియజేస్తూ, తన సంపాదనలోని కొన్ని పైసలు సాధువుకి ఇచ్చి గంగామాతకి సమర్పించుమని కోరతాడు.

సాధువు స్నానం, ధ్యానం వగైరా పూర్తి చేసుకొని తిరిగివచ్చే సమయంలో రైదాస్ ఇచ్చిన పైసలు తీసి గంగలో వేస్తాడు. రెండు అందమైన హస్తాలు నీటిలో నుండి చేయిజాచి ఆ పైసలను స్వీకరిస్తాయి. సాధువు ఆశ్చర్యభరితుడై ఈ సంగతి రైదాస్‌కి తెలియజేస్తూ నీ పైసల్ని దైవం చేయిజాచి స్వీకరించిందంటే నీవేదో నాకంటే విశేషమైన సాధనలు చేసే ఉండి ఉంటావు. అదేమిటో తెలియజేయుమని ఒత్తిడి చేస్తాడు. దానికి రైదాస్ వినయంతో ఇలా అన్నాడు. "ఓ మహాత్మా ! ఇది కర్తవ్య ధర్మ నిర్వహణ యొక్క ప్రతిఫలమేగానీ వేరేదీకాదు. ఏ తపో సాధనలు ఎరుగని వాడిని నేనంటూ" చేతులు జోడించి నమస్కరిస్తాడు.

**జీవితంలో తమకు ప్రాప్తించిన విధులను సక్రమంగా నిర్వర్తించటమనేది అతి మహత్వపూర్ణ సాధన అని పై కథ తెలియజేస్తోంది.**

సురదుర్లభమైన మానవ జన్మయందు ప్రవేశించికూడా సాధారణ జీవితం గడిపేస్తూ కాలాన్ని దుర్వినియోగం చేస్తూ హీనంగా బ్రతికే వ్యక్తులకు, అంతకంటే హేయమైన జీవితాన్ని గడిపేవారికి ఏదైనా ఆధ్యాత్మిక మార్గదర్శనం చూపాలని ఆరాటపడే నారద మహర్షిలాగే మనువును శతరూపుడు కూడా పరస్పర చర్చలో ఒకసారి ఇలాంటి ప్రశ్ననే వేయటం జరిగింది.

ప్రశ్న : "ఓ భగవానుడా! మానవుడు ఇతర యోనులలో ఎందుకు పరిభ్రమించవలసి వస్తుంది. ఎన్నోసార్లు మానవ జన్మము పొందికూడా ముక్తికి బదులు పద భ్రష్టుడు కావటానికి కారణం ఏమిటి? అని ప్రశ్నిస్తాడు. దానికి మను విలా అన్నాడు :

**శ్లో॥ శరీరజైః కర్మదోషైర్యాతి స్థావరతాం నరః**
**వాచికైః పక్షి మృగతాం మానసైరస్యజాతి తామ్**
**ఇహ దుశ్చరితైః కేచిత్ కేచిత్ పూర్వ కృతై స్తథా**
**ప్రాప్నువంతి దురాత్మానో నరారూపం విపర్యయమ్ ॥**

***భావం :*** శారీరిక పాపకర్మలవల్ల జడయోనుల్లో జన్మిస్తాడు. వాక్కుద్వారా పాపంచేస్తే పశుపక్షులై పుడతారు. ఎవరికీ తెలియకుండా జరిగే మానసిక దోషాలవల్ల మానవ యోనినుండి బహిష్కరించబడతారు. అలాగే గతజన్మలో పాపాలవల్ల నైతేనేమి, ఈ జన్మలో పాపాలవల్ల నైతేనేమి, చేసిన పాపకర్మల ఫలితంగానే మానవుడు తన సహజ స్వభావాన్ని మరచి పదభ్రష్టుడై నరపశువుగా మాయలో పడి కొట్టుకొంటూ జీవించటం జరుగుతున్నదని మనువు తెలియజేస్తాడు.

సాధారణమైన వ్యక్తి సంసారమనే మాయలో చిక్కుకొని ఎలాంటి జీవితం జీవిస్తూ ఉంటాడో ఒక కథ చూద్దాం.

**కథ -8** : ఒకసారి ఒక సేఠ్ గృహం అగ్నిలో ఆహుతి కాసాగింది. సేఠ్ ఆజ్ఞ మేరకు నౌకర్లు విలువైన వెండి, బంగారు నగలు పెట్టెలు, ధనం, పట్టు వస్త్రాలు అన్నీ బయటకు తెచ్చి అగ్నికి ఆహుతి కాకుండా కాపాడారు. తరువాత మంటలు తీవ్రంగా చుట్టుముట్టి ఇల్లు పూర్తిగా దగ్ధమైంది. ఇంతలో సేఠ్‌కి గుర్తుకొచ్చింది. తన ఏకైక సంతానం తన వారసుడు మాత్రం దగ్ధమైన ఇంటిలో వదిలివేయబడ్డాడని. సేఠ్ గుండె బాదుకొని రోదించసాగాడు.

ఇలాగే మానవుడు ప్రాపంచిక సుఖాలు, సంపదలు, పదవులు శాశ్వతమని నమ్మి వాటి వ్యామోహంలో పడి అసలైన ఆత్మని మరిచిపోతూ ఉంటాడు.

లోక సేవకుల ప్రముఖ కర్తవ్యమేమంటే సామాన్య జనులకు ఆధ్యాత్మ విద్యయొక్క ఆవశ్యకతను తెలియజేస్తూ ఆత్మతత్వం యొక్క ప్రాముఖ్యతను అవగతం చేసుకొనేలా చేయాలి. ఏ ఏ స్థాయికి చెందిన వ్యక్తులకు ఆయావిధంగా, ఆ కాలమానస్థితి కనుగుణ్యంగా ప్రేరణ, శిక్షణ, ప్రోత్సాహాన్ని ఇవ్వాలి. అందరకూ ఒకే నీతి వర్తించదు. మానసిక కక్ష్యలో మార్పుతీసుకొస్తే చాలు. సామాన్య వ్యక్తులు కూడా ఉన్నతస్థితికి చేరగలరు. జన మానస స్థాయిని బట్టి శిక్షణ, ప్రేరణ నీయవలసి ఉన్నది అనే విషయం ఒక కథ ద్వారా తెల్సుకొందాం.

**కథ -9** : ఒక అడవి గుండా ఒక గొర్రెల కాపరి గొర్రెలను కాస్తూ తీసుకొస్తున్నాడు. ఒక చిన్న పిల్లని మాత్రం చంకన పెట్టుకొని పదిలంగా వెంట తేవటం చూసి, ఒక జిజ్ఞాసువు, "ఏమయ్యా, ఆ గొర్రెను కూడా అన్నిటితోపాటు నడిపించవచ్చుగా! పక్షపాతం చూపటం దేనికి? అన్ని గొర్రెలు నీకు సమానం కాదా?" అని ప్రశ్నిస్తాడు. "అయ్యా ఇది ఇప్పుడే జన్మించిన అభం శుభం ఎరుగని చిన్నపిల్ల. అడవిలో క్రింద వదలివేస్తే ఏ పులి అయినా నోట కరుచుకొని పోతుంది. అందుకే దాన్ని ప్రత్యేక శ్రద్ధతో చంకన పెట్టుకొని తెస్తున్నాను" అన్ని వేళల, అన్నిటి పట్ల ఒకే నియమం వర్తించదు అంటూ ఒక సత్యాన్ని తెలియజేస్తాడు.

నారదుని జిజ్ఞాసను గ్రహించి భగవానుడు అతి ప్రసన్నుడై ఇంకా ఇలా అన్నాడు "ఓ మహర్షీ ! నా మనసులో ఏదైతే ఉన్నదో అదే నీ జిజ్ఞాస ద్వారా వ్యక్తమవుతుంది. భక్తుడు ఎల్లప్పుడు భగవంతుని ఆకాంక్షకి తగినట్లే ఆలోచనలు సాగిస్తూ తన గమనాన్ని దానికి తగినట్లే తీవ్రతరం చేస్తాడు. కాలదేవత యొక్క అవసరాన్ని గుర్తించి తన ప్రభువు యొక్క కోరికను గమనించి ఆ దైవీప్రణాళికను వ్యక్తి, వ్యక్తికీ అందించి, నిద్రాణమై ఉన్న వారిని జాగృతం చేసి, వారిలో ప్రేరణ నింపే మహత్కార్యాన్ని చేపట్టిన నిన్ను మించిన ఋషిశ్రేష్ఠుడు ముల్లోకాలలో వేరెవరున్నారయ్యా!" అంటూ హృదయానికి హత్తుకొంటాడు.

**అథు నాస్తిహి సర్వత్ర అనాస్థా క్రమ పరంపరా ।**
**అదూర దర్శితాగ్రస్తా జనా విస్మృత్య గౌరవం ॥**
**అచింత్య చింతనా జాతా అయోగ్యాఽచరణా స్తథా ॥**
**ఫలతః రోగ శోకార్తీ కతా క్లేశ నాశజిమ్ ।**
**వాతావరణ ముత్పన్నం భీషణాశ్చ విభీషికాః ।**
**అస్తిత్వంచ ధరిత్ర్యాస్తు సందిగ్ధం కుర్వతే ఽనిశమ్ ॥**

**దుఃఖంలో కలతచెందడం మానవీయందుఃఖాన్ని దూరంచేయడం దేవతాతుల్యం.**

**భావం** : ఈనాడు సర్వత్రా **"విశ్వాసరాహిత్యం"** వ్యాపించి ఉన్నది. ప్రజలు మానవీయ విలువలను మరిచి, తమ స్థాయినుండి క్రిందకు దిగజారి, కూడని ఆలోచనలు, చెడుకర్మలలో మునిగి ఉన్నారు. ఈ రెండింటి కారణంగానే ఈనాడు రోగాలు, శోకాలు, కలహాలు, విలయ తాండవం చేస్తూ, భయం, వినాశనంతో కూడిన వాతావరణం చుట్టూ ఏర్పడింది. భూమియొక్క అస్తిత్వాన్నే లేకుండా చేసే అత్యంత భీతావహ పరిస్థితులీనాడు అలుముకోవటానికి కారణం, దుష్టచింతనలు, భ్రష్టాచరణలు –ఈ రెండింటి వల్లనే.

మానవుని ఆలోచనలు, ఆకాంక్షలే ఆచరణగా రూపు ధరిస్తాయి. మనం సృష్టించిన వాతావరణం వల్ల పరిస్థితులు ఏర్పడతాయి. ఆ పరిస్థితులే సుఖ, దుఃఖాలు, ఉన్నతి, పతనాలను నిర్ధారిస్తాయి. భాగ్యరేఖ బాగులేదని, అదృష్టం కలిసి రాలేదని, కలి ప్రభావం అనీ, పరిస్థితులు ప్రతికూలంగా ఉన్నాయని, సమాజం బాగులేదని ఇలా అనుకొని ప్రజలు మనస్సును తేలిక పరచుకొంటారే గాని, దీనివల్ల గోరంత ప్రయోజనంలేదు. ఒక మరువరాని సత్యం ఏమంటే, ఈ అన్నిటికి ఉద్భవస్థానం మానవుని అంతఃకరణే. కాబట్టి అంతఃకరణలో మార్పు రానంత వరకు పరిస్థితులు మారవు. ఈనాటి పరిస్థితులకు కారణం పట్టుకోకుండా పరిస్థితులు ఎలా మార్చగలం? చెట్టుని పెంచటానికి వ్రేళ్ళలో పట్టిన దోషాన్ని తొలగించకుండా ఆకు తడపటానికి ప్రయత్నించినట్లే, ఈనాడు పరిస్థితులు మార్చటానికి చేసే ప్రయత్నాలు జరుగుతున్నాయి.

వ్యక్తిత్వాన్ని, పరిస్థితుల్ని నిర్మించే శక్తి యొక్క స్థాయి ఈనాడు జారి జారి ఇంక జారలేనంతగా దిగజారి పోయింది. మానవుడు స్వార్థం సంకుచితత్వంతో విలాసమయ జీవితం గడుపుతూ, అదే తన జీవిత లక్ష్యం అనుకొంటున్నాడు. వైభవం, సంపద, గొప్పదనాన్ని ప్రదర్శించడం, హద్దులేని ఆడంబరం– ఇవే వ్యక్తితో పోటీపడి పెరుగుతున్నాయి. ప్రతిభావంతులకి కొరత లేదు, కానీ వారి వారి ప్రతిభను శ్రేష్టతను, వృద్ధి పరచటానికో, నికృష్టతని నాశనం చేయటానికి, ఆ ప్రతిభ ఉపయోగపడటంలేదు. ప్రజలలో పశుప్రవృత్తుల ఆధిపత్యం హెచ్చుగా ఉంది. ఆదర్శాలపట్ల మనుషులకు ఏ మాత్రం ఆసక్తి, ఉత్సాహం లేవు. ఈనాడు కరువు **సంపదకి కాదు - సద్భావాలకు, సదాలోచనలకు పట్టిన క్షామం.** ఆరోగ్యానికి పతనస్థితి, మనోరోగాల అభివృద్ధి, అపరాధాలు, అన్యాయాల విజృంభణ, వాతావరణం అంతా వ్యాపించి, ఇవే అదృశ్య జగత్తులో విశ్వ వినాశనం అతి సమీపంలో ఉండేలాంటి పరిస్థితుల్ని నిర్మిస్తున్నాయి.

**భగవానుడు విశ్వాసరాహిత్యాన్ని, ప్రేమరాహిత్యాన్ని, యుగ సమస్యలకు మూలకారణంగా పేర్కొనటం జరిగింది.** ఈనాటి పరిస్థితులను భగవానుడు శివపార్వతుల కథ ద్వారా తెలియజేస్తున్నాడు.

**కథ –10** : **ఒ**కనాడు పార్వతి పరమేశ్వరునితో "నాథా! ప్రజలు ఎన్నో విధాలైన కర్మకాండలు, పూజలు, నోములు వ్రతాలు ఆచరిస్తున్నా, వారికి సత్ఫలితాలు ఎందుకు రావటం లేద"ని ప్రశ్నించింది. పరమేశ్వరుడు నిట్టూర్పు విడచి, "దేవీ! ప్రజలు ఎంతో వ్యయ ప్రయాసలకు ఓర్చి ఇన్ని విధాలైన ధార్మిక కర్మకాండలు ఆచరిస్తున్నారేగానీ **– ఆ కర్మకాండల వెనుక భావన లేదు, హృదయాలలో సంవేదన లేదు. కర్మ కాండల కళేబరాన్ని పట్టుకొని వ్రేలాడుతున్నారేగానీ ఆత్మని పట్టుకోవటానికి ప్రయత్నించటం లేదు - కావాలంటే నీ**

**బిడ్డలను నీవే పరీక్షించి చూడు**. నాకు వారిపై కోపమేమీలేదు. వారు చేసుకొన్న దానికి చేసుకొన్నంత గాను ఫలితాలను ప్రసాదిస్తూ ఉన్నాను. నీ బిడ్డలకు తగిన న్యాయం నేను చేయటం లేదని నీకు నామీద అనుమానమైతే నీ కళ్ళతో నీవే చూద్దువుగాని పద"మంటూ పరమశివుడు సతీసమేతంగా భూమి పైకి దిగివస్తాడు. పార్వతి సౌందర్యరాశి అయిన సాధ్వీరూపాన్ని, శివుడు అసహ్యకరమైన కుష్టురోగి రూపాన్ని ధరిస్తారు. ఒక దేవాలయం ముందు మెట్లవద్ద పార్వతి భర్తను ఒడిలో పెట్టుకొని కూర్చొని ఉన్నది. కార్తీక మాస పర్వదినం. భక్తులు దైవదర్శనానికి దేవాలయంలోనికి ఆత్రంగా, హడావుడిగా ప్రవేశిస్తూ వడివడిగా పని ముగించుకొని తిరిగి వెళ్ళిపోతూ ఉన్నారు. కొందరు ఈ జంటవైపు అసలు కన్నెత్తి చూడలేదు. కొందరు భక్తాగ్రేసరులు ఇలాంటి రోగితో ఏమి కాపురం చేస్తావు? వదలి వేయుమని పార్వతికి సలహాలిచ్చారు. కొందరు కొద్దిపాటి పైసల్ని దూరంగా నిలబడి రోగిమీదకు విసిరారు. జగన్మాత పార్వతి తన బిడ్డల ఈ ఆగడాలు ఇంక భరించలేక పోయింది "ప్రభూ! ఇక తిరిగి కైలాసం వెళ్ళిపోదాం. నా బిడ్డల కుత్సిత స్వరూపాల్ని నేనింక చూడలేనంటూ" భర్త ఒడిలోపడి భోరుమని ఏడ్చింది.

సంధ్య వేళ కావస్తోంది. ఇంతలో ఒక భక్తుడు అటువైపుగా వస్తాడు. వారి స్థితికి కన్నీరు కారుస్తాడు. పార్వతి పాదాలకు నమస్కరించి. "తల్లీ! పతిభక్తి పరాయణురాలివైన నీదర్శన భాగ్యం వల్ల నాజన్మ ధన్యమైనదమ్మా. నీ భర్తగాయాలు తుడిచి నన్ను కూడా సేవ చేయనీయి. నా దగ్గరనున్నదేదో మీతో కలిసి పంచుకొని తింటాను. నా వెంట నా గుడిసెకు రమ్మ"ని ప్రేమతో ఆహ్వానిస్తాడు. గాయాలను తుడిచి మందురాసి కట్లు కడతాడు. పరమేశ్వరుడు పార్వతి వంక తిరిగి, "దేవీ! **మందిర ప్రవేశానికి ముందు,సేవా ధర్మానికి ప్రాధాన్యతనిచ్చిన ఇతడే అసలైన భక్తుడు**. నీ నిజ స్వరూపముతో దర్శనం ఇవ్వు"మంటాడు. ఆ భక్తునికి తమ నిజాస్వరూపాలతో దర్శనం ఇచ్చి పార్వతీ పరమేశ్వరులతనికి పరమపదాన్ని ప్రసాదిస్తారు.

శ్లో॥ **వరిష్ఠతా నరాణాంతు శ్రద్ధా ప్రజ్ఞావ లంబితా ।**
**నిష్ఠా శ్రితాచ వ్యక్తిత్వం సర్వేషామత్ర సంస్థితమ్ ॥**
**న్యూనాధికతా హేతోః క్షీయతే వర్ధనేచ తత్ ।**
**ఉత్థాన సుఖజం పాతదుఃఖజం జాయతే వృతిః ॥**
**అధునా మానవైస్త్యక్తా శ్రేష్ఠతాభ్యంతర స్థితా ।**
**ఫలత ఆత్మనే అన్యేభ్యః సంకటాన్ భావయంతితే ॥**

**భావం** : మానవుని యొక్క శ్రేష్టత **(1)** శ్రద్ధ అనగా సద్భావనలు **(2)** ప్రజ్ఞ అనగా జ్ఞానం **(3)** నిష్ఠ అనగా సత్కర్మలు, ఈ మూడింటిపైన ఆధారపడి ఉంది. ఈ మూడూ జీవితంలో పెరిగితే సుఖాలు, తరిగితే దుఃఖాలు సంభవిస్తూ ఉంటాయి. ఈనాటి మానవుల అంతరంగాలు పరిశుద్ధంగా లేవు. అందుకే ఎటుచూసినా విపత్తులు, క్లేశాలు తాండవిస్తున్నాయి.

**చెడ్డవాణ్ణి ద్వేషించకు, చెడుకు సహాయ నిరాకరణ చెయ్యి.**

వ్యక్తిత్వం అంటే శ్రద్ధ, ప్రజ్ఞ, నిష్ఠల సమన్వయమే. అంతరంగం నుండి ప్రస్ఫుటితమయ్యే ఆదర్శాల పట్ల ప్రేమయే శ్రద్ధ. ఈ గంగోత్రి ద్వారా ప్రవహించే, పవిత్ర ధారలే సత్ జ్ఞానం, సత్ కర్మతో కలిసి పతితపావని గంగయొక్క రూపాన్ని ధరిస్తోంది. ఈ మూడూ కలిసి వికసించినపుడే మానవుడు మహామానవు డవుతాడు. ఈ కలయికలో పతనం సంభవిస్తే నికృష్ట జీవితం గడపక తప్పదు. మానవుడు తన వైభవానికి కారణం పురుషార్థం, బుద్ధిబలం, డబ్బు, కీర్తి, వగైరా మాత్రమేనని భావిస్తాడు. కానీ ఇది పూర్తిగా మిథ్య. వ్యక్తిత్వం యొక్క నిర్ధారణను అంతఃకరణ మాత్రమే నిర్ణయిస్తుంది. మనస్సు, శరీరం స్వామిభక్తులైన సేవకుల్లాగ అంతఃకరణ యొక్క ఆజ్ఞాపాలనకు ఎదురుచూస్తూ ఉంటాయి.

**ఔన్నత్యం - పతనం యొక్క భాగ్యరేఖలు అంతఃకరణలో లభించబడేవేగానీ నుదుటి మీద, హస్తాలలోను కాదు.**

అంతఃకరణలో సద్భావాలు మొలకెత్తనిదే సత్ జ్ఞానం, సదాచరణ ఎలా లభిస్తాయి? ఈ మూడు ఒకదానికి ఒకటి ముడిపడి ఉంటాయి. "జీవితం" ఆరంభంలో బాగున్నా సద్భావాలు వృద్ధి చెందనినాడు సత్కర్మ భ్రష్టుపడుతుంది. అలా పతనం సంభవిస్తుంది. ఈనాడు చాలామంది ఈ స్థితిలోనే ఉన్నారు.

**కథ -11** : బలి చక్రవర్తి జన్మతః అసురుడే అయినా, అతని సదాచరణ, ధర్మపరాయణత కారణముగా ఎంతో వైభవాన్ని, కీర్తిని సంపాదించి, తన పదవి ఇంద్రపదవితో సమానం కావించుకొన్నాడు. కానీ పెరిగిన పదవి, కీర్తి, వైభవం అతనిలోని సహజ స్వభావమైన అహంకారాన్ని మేల్కొల్ప సాగింది. అసుర కులస్థునిలో నిద్రాణంగా ఉన్న డంభం, దర్పం, అహంకారం మొదలైన ఆసురీ ప్రవృత్తులు విజృంభించి, ధార్మిక ప్రవృత్తుల్ని క్షీణింపజేయ సాగాయి. ఒకనాడు ఇంద్రుడు బలిని కలుసుకోవటం సంభవిస్తుంది. చుట్టు ప్రక్కల అందరూ చూస్తూ ఉండగానే బలి శరీరం నుండి ఒక ప్రచండమైన తేజస్సు బయటకు వచ్చి ఇంద్రుని దేహంలో లీనమైంది. బలి శక్తిహీనుడైపోయాడు.

ఆ తేజస్సుని "నీ వెవరివమ్మా?" ఎందుకు బలిని వదలిపోతున్నావని ప్రశ్నించగా – నేను '**సదాచరణను**'. నేను ఎక్కడ ఉంటే అక్కడ సర్వసంపదలు ఉంటాయి. బలి చక్రవర్తి తన కీర్తి, వైభవం పెరిగేంతవరకే నన్ను గౌరవించాడు. తరువాత నన్ను నిర్లక్ష్యం చేయసాగాడు. అందుకే అతన్ని వదలి వెళ్ళిపోతున్నాని బదులు పలికింది. **'సదాచరణ' రూపంలో నున్న తేజస్సు తొలగిపోయేసరికి 'బలి' నుండి సౌభాగ్యం దూరమైంది.**

## అవతార ప్రక్రియ యొక్క లీలా సందోహం

**మా**నవుడు భగవంతునిచే నిర్మింపబడిన సర్వోత్కృష్టమైన కళాకృతి. సర్వనాశనం అయ్యే పరిస్థితులు తనకి తానే సృష్టించుకొంటున్నాడుగానీ అతనికి దైవం ప్రసాదించిన వేవీకూడా దుఃఖాన్నిచ్చేవి, విపత్తులు కల్పించేవి కావు.

అయినా దైవం తన అపారమైన కరుణతో ధర్మాన్ని కాపాడటం కోసం, పెరిగిన అధర్మాన్ని నశింపచేయటం కోసం అవతారమెత్తి దిగివస్తానని వాగ్దానం చేశాడు.

**పంచిన కొలదీ పెరిగేది మంచితనం ఒక్కటే.**

భక్తకవి తులసీదాసు ఇలా అన్నాడు –

**అసురమారి ధాపహిసురన్హ రాఖహి నిజశృతి సేతు ।**
**జగవిస్తారహి విశదయత రామజనమ కరహేతు ॥**

దుష్టశిక్షణ, శిష్టరక్షణ అవతార ప్రక్రియ యొక్క మూల ఉద్దేశ్యం. ఈ సంకల్పం శాశ్వతమైనది. అనాదిగా జరుగుతున్నది. మార్పుచెందే పరిస్థితులలో మార్పు చెందే ఆధారాలనే దైవంకూడా స్వీకరించక తప్పదు. విశ్వవికాసాన్ని బట్టి అవతారం యొక్క స్థాయి, కర్మక్షేత్రం కూడా వ్యాప్తి చెందుతూ ఉంటాయి. మానవుడు సాధన ప్రధానంగాను, కర్మ ప్రధానంగాను ఉన్నంతవరకు శాస్త్రాలు, సాధనాల ద్వారా పని జరిగిపోయేది. **కానీ నేటి పరిస్థితులలో 'బుద్ధి' ప్రాముఖ్యం వహించటమే కాక** మనస్సు సర్వత్ర వ్యాపించి ఉన్నది. మహత్వాకాంక్షల క్షేత్రంలో అనాత్మక తత్వం బలంగా వ్యాపించటం వల్ల సంపదలు, సామర్థ్యం దురుపయోగ మవుతున్నాయి. విజ్ఞానం విశ్వాన్ని చాలా చిన్నదిగా చేసి తన గమనాన్ని అనేకరెట్లు పెంచింది. **ఇటువంటి స్థితిలో భగవంతుని యొక్క అవతారం యుగాంతర చైతన్యం** రూపంలోనే సంభవించవలసి ఉన్నది. జన మానసక్షేత్రంలో తన పుణ్య ప్రవాహాన్ని ప్రవహింప చేయటం యుగాంతర చైతన్య రూపంలోనే సాధ్యమవుతుంది. దిగిరాబోయే ప్రజ్ఞావతారం అన్ని అవతారాల యొక్క ఉత్తరార్థభాగం. ఈ అవతారం యొక్క కర్మక్షేత్రం అత్యంత విస్తృతమైనది. కఠినమైనది కూడా. అధర్మాన్ని నశింపచేయటమే కాక, జనమానసాలలో ఉన్నత ఆదర్శాల బీజారోపణ చేసి, వృద్ధిపరచి, కార్యరూపంలో పెట్టి సత్యయుగ నిర్మాణం, రామరాజ్య స్థాపనకు అంతఃప్రేరణను ఉత్పన్నం చేయవలసి వున్నది. లక్ష్యం, కర్మయొక్క స్థాయి, వ్యాపకత్వం వీటినిబట్టి చూస్తే, ప్రజ్ఞావతారం యొక్క కళలు 24 ఉండితీరాలి అని అర్థమవుతుంది. ప్రజ్ఞావతార ఉద్భవం గురించిన సూచన, సంభావన ఎట్టెదుటనే ఉన్నది.

పురుషార్థం, మానవశక్తి అతి మహత్తరమైనవే. ఎవరు కాదనేది లేదు. కానీ దుర్బుద్ధి వలన మనిషి విపత్తుల ఎదుట అసహాయుడుగా వివశుడై నిలబడినపుడు మాత్రమే **"అవతార ప్రకటీకరణ"ను పరిస్థితులు తప్పనిసరి కావిస్తున్నాయి. సంతులనం తప్పిన "విశ్వనౌకను" ఒడ్డుకుచేర్చి, తన అద్భుతమైన కళాకృతి విశ్వవసుధను, అగాధంలో పడిపోక పూర్వమే వినాశనం నుండి కాపాడు సృష్టికర్త తన ఉనికిని గుర్తు చేస్తూ ఉంటాడు. అవతారం అంటే ఇదే!**

సాధారణ స్థాయికి చెందిన విపత్తుల నుండి మానవుడే ఏదోలాగ బయటపడగలడు. కానీ అసాధారణమైన ఆపదలు సంభవించినపుడు, సృష్టికర్తకు స్వయంగా తన ఆయుధాన్ని సంధించక తప్పదు. పతనస్థితి వైపు వేగంగా జారిపోతున్న జనుల హృదయాలను సన్మార్గం వైపు మరల్చి, విపత్కర పరిస్థితుల నుండి బయటకు చేర్చటం కోసం ఈనాడు కూడా అవతార పరంపర తన లీలా సందోహాన్ని వ్యక్తం చేయబోతోంది. సావధానులైన ప్రజ్ఞావంతులు తప్పక ఈ ప్రకటీకరణను చర్మచక్షువులతో దర్శించగలుగుతారు.

అవతార ప్రక్రియ క్రొత్తదేమీ కాదు. అనాదిగా నడుస్తూ వున్నదే. నాటినుండి నేటివరకు మనుష్య జాతి అనేక పతనాలను, ఉన్నతిని చూసింది. వివిధ కాలాలలో వివిధ సమస్యలు ఏర్పడటం సర్వసాధారణమైన

**కష్టాన్ని మించిన పాఠశాల లేదు.**

విషయం. ఎపుడు ఎలాంటి సమస్య ఉత్పన్నమైతే, అపుడు అలాంటి పరిష్కారాన్ని చేపట్టి, దివ్య చైతన్యం అవతారంగా ఆవిర్భవిస్తుంది.

సృష్టి ప్రారంభంలో అంతా జలమయంగా వుండేది. ప్రాణి జగత్తులో జలచరాలకు ప్రాధాన్యత వుండేది. అపుడు ఏర్పడిన అస్తవ్యస్త పరిస్థితులను "మత్స్యావతారం" చక్కబరచింది. నీటిలోను, నీటిపైన గల ప్రాణుల అలజడి పెరగడం మొదలవగానే దానికి తగిన విధంగా క్షమాసంపన్నమైన తాబేలు శరీరంతో కూర్మావతారం దిగి వచ్చి సంతులనాన్ని ఏర్పరచింది. కూర్మావతార నాయకత్వంలోనే సాగర మర్ధన రూపంలో ప్రకృతి – పురుషార్థ సంపన్నమై ఆవిర్భవించి, హిరణ్యాక్షుడు సముద్రంలో దాగిన సంపదని వెదకి, దానిపై తన ఏకాధిపత్యాన్ని చెలాయించినపుడు, భగవంతుని యొక్క వరాహావతారానికి హిరణ్యాక్షుని అహంకారాన్ని అణచవలసిన పరిస్థితి ఏర్పడింది. మానవుడు తన అవసరానికి మించి ఆర్జించటంలో సామర్థ్యం చూపుతున్నపుడు క్షుద్రమైన స్వార్థ ప్రవృత్తి పెరిగి, కూడగట్టటం–అనుభవించటం అనే పశుప్రవృత్తిని ఔదార్యంగా మార్చటం కోసం భగవానుడు వామనుడుగా పొట్టి రూపంలో, వెనుకబడిన యాచక వేషం ధరించి, ఎదుట నిలబడి, బలివంటి సంపన్నుడిని సహితం, స్వేచ్ఛా పూర్వకంగా ఔదార్యాన్ని ఆశ్రయించేందుకు వివశుడిని చేయవలసి వచ్చింది.

**ఎటుచూచినా అవినీతి, అక్రమం స్వైరవిహారం చేసేటపుడు సౌజన్యం వాటిని అణచలేదు. ప్రత్యాక్రమణ ద్వారానే దానిని అణగద్రొక్కాలి. ఇటువంటపుడు నరసింహుల అవసరం ఎర్పడుతుంది.** వారి పరాక్రమం సర్వోత్కృష్టమైనది. ఆనాటి ఆదికాలంలో భగవానుడు నరవ్యాఘ్రాల సమన్వయం అత్యంత ఆవశ్యకమైనదిగా భావించి నృసింహావతారం ఎత్తి దుష్టశిక్షణ, శిష్ట రక్షణను గావించాడు. దీని తరువాత పరశురాముడు, రాముడు, కృష్ణుడు మరియు బుద్ధుని అవతారాలు వస్తాయి. ఈ అన్ని అవతారాల మౌలిక ఉద్దేశ్యం, పెరిగే అనాచారాలను రూపుమాపి, 'సదాచరణ'ను రక్షించి పెంచి పోషించడమే. పరశురాముడు శస్త్రబలంతో సామంతవాద నిరంకుశ పరిపాలనను సమాప్తం చేశాడు. రాముడు మర్యాదాపాలనకు ప్రాధాన్యత నిచ్చాడు. కృష్ణభగవానుడు ఆనాటి కాలానికి అనుగుణంగా మోసం, కపటం, దౌర్జన్యంతో చుట్టుముట్టబడిన పరిస్థితుల్ని అణచి విషానికి విషమే ఔషధం, ముల్లుని ముల్లుతోనే తీయాలి అనే నీతిని స్వీకరించాడు. కృష్ణ చరిత్రలో కూటనీతి, దూరదృష్టికి ప్రాధాన్యత ఎందుకు ఇవ్వబడిందంటే – ఆ పరిస్థితిలో తిన్ననైన వేలితో నేయి బయటకు తీయలేము. కాబట్టి ఆ నీతిని స్వీకరించి అవతార ప్రయోజనాన్ని పూర్తి చేయవలసి వచ్చింది.

బుద్ధుని బుద్ధవాదం యొక్క స్వరూపం "విచారక్రాంతి" పూర్వార్థ భాగంలో ధర్మచక్ర ప్రవర్తనతో జరిగింది. ధర్మధారణను గౌరవిస్తూ లక్షల సంఖ్యలో వ్యక్తులు దానిలో భావపూరితమైన త్యాగాన్ని చూపించారు. ఆనందుని వంటి మనీషులు, హర్షవర్ధనుని వంటి శ్రీమంతులు, ఆమ్రపాలివంటి కళాకారులు, అంగుళిమాల వంటి ప్రతిభాసంపన్నులు ఈ ఉద్యమంలో లీనమయ్యారు. బుద్ధావతారం కంటె ముందు అవతారాల యొక్క కర్మభూమి పరిమితమైనది. ఎందుకంటే అప్పటి సమస్యలు చిన్నవి స్థానికమైనవి. బుద్ధభగవానుని కాలానికి సమాజ విస్తీర్ణం హద్దులేనంతగా పెరిగింది. అందువలన బుద్ధుని ఉద్యమం భారతీయ సీమకే పరిమితంకాక ఎంతవరకూ

సాధ్యమో అంతవరకూ వ్యాపించి, ఇంకా ముందుకు వెళ్ళి ఇతర మహాద్వీపాల వరకు దాని వెలుగును ప్రసరింపచేసింది.

**ప్రజ్ఞావతారం :** బుద్ధభగవానుని ఉత్తరార్ధభాగం ఈ ప్రజ్ఞావతారం. బుద్ధి ప్రధానమైన యుగ సమస్యలు ఆలోచనా ప్రధానంగా వుంటాయి. ఆలోచనలు, కోర్కెలే ప్రేరణా కేంద్రాలు అవుతాయి. వాటి ప్రవాహంలోనే విశ్వం కొట్టుకొని పోతూ ఉంటుంది. ఇటువంటపుడు అవతార స్వరూపం దీనికి తగినట్లే వుండటం తప్పనిసరి. లోక మానసాన్ని అవినీతి, అవాంఛనీయత, మూఢాచారాల నుంచి బయటపడ వేయగల 'ఆలోచనా క్రాంతి' ఒక్కటి మాత్రమే నేటి సమస్యలకు పరిష్కారం చూపగల సత్తా కలిగి వుంటుంది.

పరస్పర సంవాదంలో భగవానుడు వర్తమాన పరిస్థితిని విశ్లేషణ చేసి, ప్రజ్ఞావతారం ఆవిర్భావం జరగవలసిన పరిస్థితులను దేవర్షి నారదునికి బోధపరుస్తాడు. వెనుకటి తన అవతారాలను జ్ఞప్తికి తెస్తూ, ఇప్పుడు కూడా విపత్కర పరిస్థితుల నుంచి విశ్వాన్ని రక్షించటానికి తన శక్తి యొక్క అవసరాన్ని ఎరుక పరుస్తున్నాడు.

**శ్లో॥ నిరాకారత్వ హేతోశ్చ ప్రేరణాం కర్తృమీశ్వరః ॥**
**శరీరిణశ్చ గృహ్ణామి గతి సంచాలనే తతః ॥**
**అపేక్ష్యంతే పరిష్కోశ్చ ఆత్మనః కార్యసిద్ధయే ।**
**అసదూతాని మామ్ కర్తృం పుష్టామ్యన్విష్య సర్వథా ॥**
**తతో నిజ ప్రభావేణ వర్చస్వేనచ తే సమమ్ ।**
**సముదాయం దిశాంనేతుం భిన్నాం కుర్యుర్వ్యర్తింపరాం ॥**

**భావం :** ప్రజ్ఞావతారంగా నేను నిరాకారుడిని కావటం వలన వ్యక్తులలో ప్రేరణను మాత్రమే నింపగలను. కార్యనిర్వహణకు నేను శరీరధారులను ఆశ్రయిస్తాను. శ్రేష్ఠులు, ఉన్నతులు అయిన శరీరధారులను వెదకి, వారికి ప్రేరణనిచ్చి, వారిలో సర్వ సమర్థతలను నింపి మానవ సముదాయాల లోనికి పంపాలి. వారే వాతావరణంలో మహా పరివర్తన తీసుకొని వస్తారు. ఈ కార్యభారాన్ని మోయగల జాగృతాత్మలు, అగ్రదూతలకు ఈ పుణ్యభూమిలో కొరత ఏమీలేదు. అనాదిగా జరుగుతూ వస్తున్న అవతార ప్రకటీకరణ యొక్క స్వరూప స్వభావాలు ఇవే. దైవం ప్రేరణనిస్తే శరీరధారులు దానిని ఆచరణలో పెట్టేవారు – ఈశ్వరీయ శక్తి అవతార రూపంలో దిగివచ్చినపుడు, ఆ శక్తితోపాటు జిజ్ఞాసకల, దివ్యాత్మలు కూడా దిగి వచ్చేవి. ఇపుడు కూడా జరిగినది అదే. కాబట్టి వారిని వెదకి పట్టుకొని, వారు దిగివచ్చిన ఉద్దేశ్యాన్ని గుర్తుచేసి, వారి కర్తవ్యాన్ని వారికి తెలియజేస్తే సరిపోతుంది.

దశదిశలా రావణుడి దౌర్జన్యం వ్యాప్తి చెందసాగింది. ఎవరూ అతన్ని అడ్డుకోగల సాహసాన్ని గానీ, విరోధించగల ధైర్యాన్నిగానీ చూపలేక పోయారు. అవినీతి చరమస్థాయికి చేరగానే రామజననానికి ఏర్పాట్లు కావించబడ్డాయి. భగవంతుడైన రామునికి సహాయం చేయటానికి బ్రహ్మ, దేవతలందర్నీ సమావేశ పరచి పక్షులుగాను, కోతులుగాను, ఉడుతలుగాను, భిన్న భిన్న రూపాలతో అవతార ప్రయోజనానికి సహాయపడేలా అతని వెంట పంపటం జరిగింది.

**అందరినీ సంతోషపెట్టాలని అనుకునేవాడు ఎవరినీ సంతోషపెట్టలేడు.**

అలాగే కృష్ణావతారంతో పాటు, గోపబాలలు ఉద్భవించి, కంసుని అవినీతికి వ్యతిరేకంగా సంఘశక్తి రూపంలో పోరాడారు. అవతారమూర్తుల వలన కాకపోతే మరెవరివల్ల ప్రజలు తమ ప్రాణాలను పణంగా పెట్టి ఇంత సాహసం చూపగలరు? దైవం యొక్క ప్రేరణను తమలో ధరించిన ప్రజలు అర్జునుని వంటివారు. వారి జీవితరథానికి దైవం సారధ్యం వహిస్తాడు. భగవంతుని ప్రేరణను అందుకోక, నిర్లక్ష్యం చేసినవారు దుర్యోధనుని వంటివారు. ఎన్ని యుక్తులు, శక్తులు ఉన్నా ఓటమికి లొంగిపోక తప్పదు.

**కథ -12: గురు గోవింద సింహ్** అనే ఆయన నరమేధ యజ్ఞంలో పాల్గొన్న సోదరులందరినీ ఉద్దేశించి ఇలా అన్నాడు – "అవినీతి నుండి ముక్తిపొంది, దేశ స్వాతంత్ర్యాన్ని సంపాదించాలి. దీనికై నిర్వహించే ఈ యజ్ఞంలో మీలో ఎవరైనా మీ శిరస్సు ఖండించి చండీమాతకు బలి ఇవ్వగలరా?" అని కోరతాడు. అంతపెద్ద సభ నుండి కేవలం దయారామ్ అనే ఒక్క వ్యక్తి మాత్రం ముందుకి వస్తాడు. గురుగోవింద సింహ్ అతన్ని తెర వెనక్కి తీసికెళతాడు. రక్తధారలు ప్రవహిస్తాయి. ప్రజలు భయకంపితులవుతారు. రక్తధారలు ప్రవహించటం చూసి కూడా మరో నలుగురు వ్యక్తులు రాష్ట్రశ్రేయస్సుకు తమ జీవితాలు బలి ఇస్తామని ముందుకొస్తారు. వారిని కూడా తెర వెనక్కి తీసికెళ్ళటం జరిగింది. తరువాత సభ నిశ్శబ్దంగా ఉండిపోతుంది. గురుగోవింద సింహ్ తెరవెనుకనుండి ఐదురుగు వ్యక్తులను సజీవంగా సభముందుకు తీసుకొస్తాడు. ప్రజలు ఆశ్చర్యంగా చూస్తూ ఉంటారు. గోవిందసింహ్ ప్రజల నుద్దేశించి – సోదరులారా ! ఇది భక్తి శ్రద్ధలకు, సాహసానికి పరీక్ష మాత్రమే. నిజానికి వీరి తలలు ఖండించ బడలేదు అని తెలియజేస్తాడు. ఆ మాటవిని అనేక మంది బలికి సిద్ధమంటూ గోవింద సింహ్ ముందుకి ఉరుకుతారు. గోవింద సింహ్ నవ్వి, ఈ ఐదురుగు వ్యక్తులే ఐదువేల మందికి సమానం. ఇక మీ అవసరం లేదని వారిస్తాడు.

అవతారం దిగి వచ్చే సమయంలో పరిస్థితిని, ప్రయోజనాన్ని గుర్తించి ముందుకి ఉరికేవారు తక్కువ సంఖ్యలో ఉన్నా చింతలేదు. విపత్తుల విషవలయం నుండి లోకాన్ని ఉద్ధరించగల సాహసం, సమర్పణ చూపగల వ్యక్తులు శ్రేయసౌభాగ్యాలకు అధికారులై, అగ్రగాములుగా చిరస్థాయిగా చరిత్రలో నిలచిపోతారు.

"ఓ నారదా! ప్రజలలో ప్రేరణను నింపి, వారితో సంపర్కం పెట్టుకొని, వారిని ముందుకు ఉరికేలా చేసే బాధ్యత స్వీకరించాలి. ప్రజలతో కలిసి పనిచేయకుండా అవతార ప్రయోజనం సిద్ధించదు. వరిష్ఠాత్మలు నిద్రమత్తు వదలి, యుగ పురుషుల పాత్ర నిర్వహణకు సామర్థ్యం చూపేలా ప్రయత్నాలు సాగించాలి. దీనివలన మాత్రమే నా పిలుపు, నీరాక రెండింటి ఉద్దేశ్యం నెరవేరుతుంది" అని కృష్ణభగవానుడు నారదునికి తెలియజేస్తాడు.

**రామకృష్ణ పరమహంస - వివేకానందుడు, సమర్థ గురురామదాసు - శివాజీ, కృష్ణుడు - అర్జునుడు, రాముడు - హనుమంతుడు,** వీరంతా సంయుక్త ప్రయత్నాల ఉదాహరణ, ప్రేరణ నిచ్చేవారు ఎదుటకు రావటం, ప్రేరణను పొందిన దివ్యాత్మలు కార్యరూపంలో పెట్టటం జరుగుతూ ఉన్నదే.

భగవానుని ప్రేరణ, జాగృతాత్మలకు నారదుని మేలుకొలుపు ఈ రెండూ "దైవం – పురుషార్థం" యొక్క సమన్వయం. ఈ రెండు, యుగాంతర కార్యక్రమ నిర్వహణను సంభవింపచేయగల సామర్థ్యం కలిగి ఉంటాయి అనే తథ్యాన్ని స్పష్టం చేస్తూ వరిష్ఠాత్మల జాగృతి అనివార్యమని ఘోషించటం జరిగింది.

**సమాజసేవలో గంధపు చెక్కలా అరిగిపో; ఇనుములా త్రుప్పుపట్టకు.**

**కథ -13** : **రా**ముడు సీతను వెదకి తీసుకొని రమ్మనే కార్యభారాన్ని అప్పగించినపుడు హనుమంతునికి తనపై తనకు విశ్వాసం లేదు. తనశక్తి గురించి కూడా తనకు తెలియదు. జాంబవంతుని ప్రేరణావచనాలు అతనికి, అతని గురించిన జ్ఞానాన్ని కలిగించాయి. ఆ ప్రేరణయే పవనపుత్రుని ఆకాశ మార్గాన లంకకు చేర్చింది. తన సామర్థ్యాన్ని గుర్తించిన తక్షణమే ఒక సాధారణ వానరుడు అసామాన్యుడుగా, వీరభక్త హనుమాన్‌గా పరిణతి చెందాడు.

**కథ -14** : **మ**హాభారత యుద్ధంలో రెండు సేనల మధ్య రథం మీద అస్త్రశస్త్రాలతో అన్ని విధాల సామర్థ్యం కల్గి శోభించే అర్జునుని అంతర్వ్యథ – సూత్ర సంచాలకుని కూడా తికమక పెట్టేటంత తీవ్రస్థాయిలో ఉంది. అట్టి స్థితిలో కృష్ణ పరమాత్మ మహాపరాక్రమవంతుడు, గాండీవధారి అయిన అర్జునినిలో ప్రేరణనింపి, అతని రథసారథిగా మారి – అర్జునునికి తానేమిటో తెలియ జేశాడు. అంతేకాక భక్తుని హృదయములోని అంధకారాన్ని శాశ్వతంగా తొలగించి, దివ్యతేజస్సును దర్శింప చేసి, భక్తుని భగవానునంతటి వాడుగా మార్చి వేసిన దివ్యసందేశం **"భగవద్గీత"** రూపంలో అందజేశాడు.

దైవం యొక్క పిలుపు విన్న తరువాత కూడా హాయిగా భవనాలలో విశ్రమించగల వ్యక్తి వ్యక్తికాడు. వ్యక్తి అయినవాడు శక్తిగా మారి, లోక కళ్యాణ భారాన్ని స్వీకరిస్తానంటూ సమాజ నవనిర్మాణం కోసం పరిగెట్టి ముందుకొస్తాడు. బుద్ధుడు, గాంధీ వీరంతా ఆయా కాలాలలో ఎంతో నిరాశా జనకమైన పరిస్థితులు చుట్టూ వ్యాపించి ఉన్నా అధిగమించి, విజయం సాధించిన వారే.

**కథ -15** : **ఒ**క సన్యాసి కాలం పిలుపు విని అవహేళన చేసి, సమూహాలతో కలియక, ఏకాంత సాధన అన్ని విధాల లాభదాయకంగా భావించి జీవయాత్ర సాగించేవాడు. ఒకనాడు గురుగోవింద్ సింహ్ అతనిని కలిసి, ఆపత్కాలంలో ఏకాంత సాధన ఎంత హానికరమో వివరిస్తూ ఇలా అన్నాడు – "అయ్యా! దేశం, ధర్మం, సంస్కృతి యొక్క విలువలు మంట కలిసి పోతూ, వ్యక్తి బానిస బ్రతుకు బ్రతుకుతూ, ఆగంతకుల అత్యాచారాలకు తామూ, తమ ఆలుబిడ్డలు బలి అయిపోతూ ఉన్నపుడు ఈ భజనలు, పూజలు, సమాధి ఎందుకయ్యా? ఏమి ఉద్ధరిస్తాయని వీటిని పట్టుకొని వ్రేలాడుతున్నావ"ని ప్రశ్నిస్తాడు. కాలానుగుణంగా ఉన్న అతని వాక్కులు బైరాగికి ప్రేరణనిస్తాయి. అతను గోవింద సింహ్ అనుయాయిగా మారిపోతాడు. అతని వెంట తిరుగుతూ జీవితాంతం కృషిచేస్తాడు. చివరకు ముసల్మానులు అతన్ని బంధించి, ధర్మాన్ని మార్చుకొంటావా? మరణ దండన విధించమంటావా? అని అడిగితే చెక్కు చెదరక ధర్మమార్గంలో స్థిరంగా నిలబడతాడు. వారి చిత్రహింసలు చిరునవ్వుతో భరిస్తాడు. ప్రాణం ఏదో ఒకనాడు పోయేదే కానీ ఇటువంటివారి కీర్తి ప్రతిష్టలు ఆచంద్రార్కం చిరస్థాయిగా నిలచిపోతాయి.

## యుగసంధి వేళలో కర్తవ్యం

ఈ యుగ సంధి కాలంలో తమ పాత్రపోషణ ద్వారా మూర్ధన్య ఆత్మలు తాము ధన్యమై, కాలాన్ని ధన్యం చేయాలంటే ఏమి చేయాలని ఆర్తితో ప్రశ్నించిన నారదునితో కృష్ణుడు ఇంకా ఇలా అన్నాడు – "ఓ నారదా! నవయుగ నిర్మాణం జరగబోతోంది, అనే విషయం ఒక ఉద్యమంలాగ ఆరంభించి వ్యక్తి వ్యక్తికీ

**చొక్కాలకన్న సులువుగా తన అభిప్రాయాలను మార్చుకునేవాడు చపలచిత్తుడు.**

తెలిసేలా చేయాలి. ఇది అత్యంత ఆవశ్యకం. పూర్వజన్మల సంచిత సంస్కారాలు ఎవరిలో ఉంటాయో వారు యుగ పురుషుని పిలుపు విని మౌనంగా ఎంత మాత్రం కూర్చోలేరు. ఉత్సాహంతో ముందుకు ఉరికి, పరస్పర సంబంధాలు ఏర్పరచుకొని కార్యోన్ముఖులవుతారు.

**కథ –16** : రెక్కలు తెగిన జటాయువుని ఒడిలో పెట్టుకొని శ్రీరాముడు తన కన్నీటితో జటాయువుని అభిషేకిస్తూ, "అయ్యా! రావణుడు మహాబలవంతుడు, మొండివాడు అని తెలిసి కూడా నీ వెందుకు యుద్ధానికి తలపడ్డావయ్యా!" అని ప్రశ్నిస్తాడు.

జటాయువు కన్నులవెంట ఆనంద భాష్పాలు రాలుస్తూ, "రామా! ఏదో ఒకనాడు ఏదో విధముగా తప్పని సరి అయిన మృత్యువుకి భయపడి దాగి బ్రతకటం ఎందుకు స్వామీ! **అన్యాయాన్ని ఎదుర్కొనే శక్తి నాలో జాగృతం కాని నాడు** పిరికివానిలా తప్పకుండా భయపడి ఉండే వాడిని, దుఃఖించేవాడిని. అవసరానికి, సమయానికి అన్యాయాన్ని ఎదుర్కొనేశక్తి నాలో మేల్కొంది. ఆ శక్తికి నా కోటి కోట్ల ధన్యవాదాలు" అంటూ రాముని ఒడిలో ఒరిగి కన్నులు మూసింది.

"నీవంటి ఉత్కృష్టమైన ఆత్మల ద్వారా, లోక కళ్యాణానికి మార్గదర్శనం లభిస్తుంది. నీవు ధన్యుడివయ్యా!" అంటూ రాముడు జటాయువుకి నమస్కరిస్తాడు.

**కథ –17** : ఉడుత తోకతో ఇసుక రేణువులు తెచ్చి వారధి కట్టటానికి సహకరిస్తూంటే, "నీ కెందుకీ శ్రమ? ఈ మాత్రానికి ఏమవుతుందిలే" అంటూ వానరులు వారిస్తారు. శ్రీరామచంద్రుడు అదిచూచి, ఈమె తోకతో తెచ్చిన ఇసుక రేణువులు ఒక బొట్టు నీటిని ఇంకించడానికి తోడ్పడతాయి. సత్కర్మాచరణలో ఈ మాత్రం సహకారం ఇవ్వగల సంస్కారం తక్కువేమీ కాదంటూ రాముడు ఉడుతని తన ఒడిలోనికి తీసుకుంటాడు.

**కథ –16** : సూర్యభగవానుడు అస్తమించటానికి ఉద్యుక్తుడవుతున్నాడు. చుట్టూ చీకట్లు వ్యాపిస్తున్నాయి. ఒక చిన్న చిరుదివ్వె సూర్యభగవానునికి ఎదురుగా వచ్చి, "స్వామీ! మరల నీవు ఉదయించేవరకు లోకానికి నీలోటు కనపడకుండా, నీబాధ్యత నేను తీసుకొంటాను. చీకట్లను పారద్రోలి వెలుగునీయటానికి నా శాయశక్తులా ప్రయత్నిస్తాను" అంటూ అభయమిస్తుంది. చిరుదీపం చూపిన ఆ సాహసానికి సూర్యభగవానుడు అత్యంత ఆనంద భరితుడై, ఆమెను ప్రశంసిస్తూ నిశ్చింతగా అస్త్రాద్రికి చేరుకొంటాడు.

**చేసే ప్రయత్నం స్వల్పంగా కనిపించవచ్చు. కానీ సత్ సాహసం అనేక మందిని ప్రాణవంతుల్ని చేస్తుంది. ఇటువంటి చిన్నచిన్న కర్మలన్నీ కలిసి యుగపరివర్తనను తెచ్చి చూపగల సామర్థ్యం కల్గి ఉంటాయి.**

**శ్లో ॥ సత్ పాత్రతాం గతాస్తేచ తత్వ జ్ఞానేన బోధితాః ।**
**కార్యాః సంక్షిప్త సారేణ యదమృత మితి స్మృతమ్ ॥**

సత్ పాత్రత గల వ్యక్తులకు తత్వజ్ఞానం యొక్క సారాన్ని హృదయానికి హత్తుకొనేలా చేయాలి. ఆ తత్వజ్ఞానమే అమృతం. తత్వచింతన వలన ప్రజ్ఞ మేల్కొంటుంది. ప్రజ్ఞావంతులు ఆత్మనిర్మాణంలో

**ఉన్నత స్థానాలవైపు నడిచేకొలది మన నడతలో ఉదాత్తత పెరగాలి.**

నిమగ్నమవుతారు. ఆత్మనిర్మాణాన్ని సాధించిన వ్యక్తులకు విశ్వనిర్మాణ కార్యక్రమాలు చాలా సరళమవుతాయి. జ్ఞానమే కర్మగా మారుతుంది. నీలో ఏ బాపతు జ్ఞానముంటే ఆబాపతు కర్మలే చేస్తూ ఉంటావు. సత్ జ్ఞానం యొక్క అధిష్ఠాత్రి "మహాప్రజ్ఞ". సత్పాత్రతగల వ్యక్తులకు "అమృతం"గా గాయత్రీ మహావిద్యను, "పారసమణి" "కల్పవృక్షంగా" తత్వజ్ఞానాన్ని అందజేయటం ఈనాడు అనివార్యమని గుర్తించండి. ఎందుకంటే నిద్రించే ఆత్మలు మేల్కొని గాయత్రీ ద్వారా ముందు తేజోవంతం కావాలి. వ్యక్తి ముందుగా తాను తేజోవంతుడైతేనే అనేక మందికి వెలుగును అందివ్వ గల్గుతాడు.

ఒక మహాప్రజ్ఞ 3 పవిత్ర ధారలుగా ప్రవహిస్తోంది. వేదమాత ప్రవాహం ద్వారా బ్రహ్మజ్ఞానాన్ని, విశ్వమాతా ప్రవాహం ద్వారా భావసంవేదనలను, దేవమాత ప్రవాహం ద్వారా దేవత్వ ప్రాప్తిని (తపోబలాన్ని) ప్రాప్తింపచేసుకొని, అజ్ఞానం, అభావం, అశక్తి నివారణ కావించుకోవచ్చు.

గాయత్రీ కామధేనువు. స్వర్గంలోని దేవతలు ఈ పాలనే త్రాగి అమృతులు, పరిపూర్ణులు అయ్యేరు. గాయత్రీ కల్పవృక్షం. దీనిని ఆశ్రయించిన వారికి "లోటు" అనేదే ఉండదు (తెలియదు). గాయత్రీ పారసమణి. దీని ఆశ్రయం వలన మరియు సాన్నిధ్యం వల్ల వ్యక్తి లోహం వంటి కాఠిన్యతను వదలి బంగారు కాంతులు వెదజల్లుతాడు. గాయత్రీ అమృతం. దీనిని హృదయంలో ధరించిన అజరత్వం, అమరత్వం లభిస్తుంది.

**"స్వర్గం-ముక్తి" జీవితం యొక్క పరమ లక్ష్యంగా నిర్ధారించ బడ్డాయి. ఈ రెండు కూడా గాయత్రీ సాధనవల్ల సునాయాసంగా లభిస్తాయి. నిర్మల హృదయంతో గాయత్రీమాత పైటచెంగు పట్టుకొని ఆడుకొనే ఏ బిడ్డనైనా సరే ఆ తల్లి అన్ని కష్టాల నుంచి రక్షించి, తీరం చేరుస్తుంది. దారితోచక తిరిగి తిరిగి అయినసరే, ఆమెను ఆశ్రయించిన తక్షణం ఆమె వారికి సన్మార్గం చూపి ప్రగతి పథంలో చివరిమెట్టు వరకూ చేర్చే బాధ్యతను తానే స్వీకరిస్తుంది. ఇది కేవలం ఆ తల్లి కరుణ. మహాప్రజ్ఞ రూపంలో గాయత్రీ శక్తి బ్రహ్మాండం అంతటా వ్యాపించి ఉంది.** ఆ మహాప్రజ్ఞ ప్రాణులపై న్యాయనిష్ట, సద్భావం, ఉదారత్వం, వివేకం, దూరదృష్టి మొదలైన రూపాలతో అనుగ్రహాన్ని కురిపిస్తోంది. పదార్థాలను ప్రాణపరంగా, సౌందర్య యుక్తంగాను, సువ్యవస్థితంగాను ఆశక్తే మారుస్తోంది. లెక్కపెట్టనలవి కానన్ని ప్రత్యేకతలు, సిద్ధులు, దైవీశక్తులతో ప్రాణిజగత్తు, పదార్థ జగత్తు ప్రాణవంతమవుతున్నాయి. మానవుని ఊర్ధ్వ గమనానికి తోడ్పడుతూ, పరమలక్ష్యం వరకూ చేరుకోగల అవకాశాన్ని కల్పించే శక్తి ఏదైతే ఉన్నదో అది- "మహాప్రజ్ఞయే". ఈ మహాప్రజ్ఞ ఎవరికి ఎంతవరకు చేరుతుందో వారు అంతవరకు కృతకృత్యులు కాగల్గుతున్నారు. దైవత్వం, దైవీశక్తుల ఉద్భవం మానవునిలో మహాప్రజ్ఞ ఎంత శాతం దిగివస్తే అంతశాతమే ఉద్భవిస్తాయి.

మహాప్రజ్ఞ యొక్క మొదటి బ్రహ్మవిద్యాపక్షం వ్యక్తియొక్క అంతఃకరణను ఉన్నతమైన కోర్కెలతో ఆనందమయం కావిస్తుంది. ఇంక మహాప్రజ్ఞయొక్క రెండవపక్షం సాధనాజ్ఞానంగా చెప్పవచ్చు. కేవలం జ్ఞానం ఉంటే ఉపయోగంలేదు. ఆ జ్ఞానాన్ని కర్మద్వారా అభ్యాసస్థాయికి చేర్చి సంస్కారయుక్తంగాను, స్వాభావికంగాను ఆచరణకు తీసుకొనిరావాలి. సాధన యొక్క ప్రయోజనం శ్రద్ధను నిష్టగా మార్చి అభ్యాసస్థాయికి చేర్చటమే. అందుకే తత్వజ్ఞానులకు, జీవన్ముక్తులకు, జాగృతాత్మలకు కూడా సాధన యొక్క అభ్యాసక్రమం నిత్యనియమిత రూపంలో అవసరమై ఉన్నది.

**కోపాన్ని జయిస్తే - అన్నింటినీ జయించినట్లే.**

**కథ -19** : పరివ్రాజకుడైన జగద్గురు శంకరాచార్యుని మాంధాత–"ఓ భగవానుడా! ఇహపరాలు రెండు కూడా తరింపచేయగల ఉపాసన ఏది? సర్వోత్కృష్టుడైన దైవమెవ్వరు?" అని ప్రశ్నిస్తాడు.

దానికి శంకరాచార్య ఏమన్నారంటే – "ఆత్మజ్ఞానాన్ని ప్రసాదించే దివ్యదృష్టి ఏ బుద్ధి ద్వారా అయితే ప్రాప్తిస్తోందో ఆ బుద్ధిని ప్రచోదన చేసేది గాయత్రి మాత్రమే. గాయత్రి సర్వశక్తి కల్గినట్టిది. గాయత్రీ మహిమ వర్ణించనలవికానిది" అని మాంధాతకు తెలియజేయటం జరిగింది.

సృష్టి నిర్మాణం జరిగిన తరువాత 'మనువు' ప్రజలతో ఇలా అన్నాడు

**శ్లో॥ అష్టాదశసు విద్యాసు మీ మాంస ఇతిగద్యతే ।**
**తతోపి తర్కశాస్త్రాణి పురాణాస్తేభ్య ఏవచ ॥**
**తతోపి ధర్మశాస్త్రాణి తేభ్యో గుర్వీశ్రుతిర్ద్విజ ।**
**తతోప్యుపనిష త్స్మేష్టా గాయత్రీచ తతోధికా ॥**
**దుర్లభా స్వరమంత్రేషు గాయత్రీ ప్రణవాన్వితా ।**
**న గాయత్ర్యాధికం కించిన్మహీషు పరిగీయతే ॥**

***భావం :*** 18 విద్యలలో మీమాంస గొప్పది. దీనికంటే గురు తర్కశాస్త్రం గొప్పది. దీనికంటే కూడా ధర్మశాస్త్రం ఉన్నతమైనది. స్మృతి అంతకంటే శ్రేష్టమైనది. కానీ ఈ అన్నిటికంటే మహోత్కృష్టమైనది "గాయత్రి." దీనికంటే గొప్పదిగానీ, దీనిని మించినది గానీ వేరేది లేదు. ఇది వేదాలసారం. వేదాలను మించిన వేదం.

ఇదే విధంగా శ్రీరామకృష్ణ పరమహంస శిష్యులను సంబోధించి ఇలా అన్నాడు – **"గాయత్రీ ఉపాసన ఎంత ఎక్కువగా వికసించి, విస్తరిస్తే అంత ఎక్కువగాను దేశం శక్తివంతమై వృద్ధి చెందగలదు. ఈ చిన్న మహామంత్రంలో పరిపూర్ణ విశ్వం యొక్క శక్తి నిండి ఉన్నది.** బ్రహ్మ, విశ్వామిత్రుడు, రాముడు, కృష్ణుడుతో సహా ఎందరో దివ్యపురుషులు ఈ ఆదిశక్తిని శరణుజొచ్చి, సృష్టిరచన అవతార ప్రయోజనాలను పూర్తిచేశారు. రాబోయే కాలంలో కూడా ఇదే జరిగి తీరుతుంది. ప్రతీ వ్యక్తి గాయత్రిని ఆశ్రయిస్తార"ని శిష్యులకు తెలియజేశారు.

నారద మహర్షి కృష్ణపరమాత్మను తిరిగి ఇలా ప్రశ్నించాడు :

"ఓ దేవా ! మీ కోరిక, నా జిజ్ఞాస రెండింటి సమన్వయం మీరు చాలా అద్భుతంగా వ్యక్తీకరించారు. నా అంతరాత్మ ఎంతగానో పులకిస్తోంది. మరి మీ ప్రయోజనం పూర్తి అయిన తరువాత తిరిగి వెళ్ళి నేనేమి చేయాలి? నా భవిష్యత్ కార్యక్రమం ఏమిటో విశదంగా సెలవీయు"మంటాడు.

దానికి కృష్ణపరమాత్మ చిరుదరహాసంతో నారదుని వీక్షిస్తూ...

**"ఓ నారదా! భ్రాంతులతో ఉన్న వారికి యదార్థం యొక్క వెలుగుని చూపటమే అసలైన గాయత్రీ సాధన.** వారు సన్మార్గాన్ని స్వీకరించటానికి వారికి తథ్య తర్క సహితంగా మార్గదర్శనం చేయాలి. ఆ విధంగా

వారిలో ఉప్పొంగిన ఉత్సాహాన్ని సరళమైన ఏదో ఒక కార్యక్రమంలో లగ్నం చేయించటంవలన వారు యుగధర్మాన్ని అవగతం చేసుకోగలుగుతారు. ఈ రెండు అడుగులు వారు ముందుకు వేసేసరికి, ప్రగతికి ఆధార భూతమైన నా అవతార ప్రక్రియ యుగచైతన్య రూపంలో దానంతట అదే ఆరంభమవుతుంది".

యుగ పరివర్తనకు కావలసిన కార్యక్రమాలు ప్రణాళికా బద్ధంగానే చేయవలసి ఉంది. ముందుగా సంస్కర్తలు, అగ్రదూతలు తమ తమ సహకారులను వెదకటానికి బయలుదేరాలి. వారి చేయిపట్టుకొని వారికి నడక స్వయంగా నేర్పించాలి. వారు వారి దిశను అవగతం చేసుకున్న తక్షణం వారి పయనం ఉన్నత పథంలోనే సాగిపోతుంది. వారికి ఒక సునియోజిత కార్యప్రణాళికను అవగతం చేసి, వారి ఉత్సాహాన్ని క్రియారూపంలో పెట్టాలి. ఈ నీతి అన్ని అవతారాలకు వర్తిస్తుంది. ఇంతవరకు మనం చేస్తే, మిగిలిన పనిని ఆ చైతన్యశక్తి స్వయంగా చేసుకొంటుంది.

కానీ ఇబ్బంది ఎక్కడ వస్తోంది అంటే, వ్యక్తి ఈశ్వరీయ శక్తియొక్క ఇష్టాన్ని, ఆకాంక్షను తెలిసిఉండి కూడా వ్యామోహంలో ఇరుక్కొని, దారి తప్పిన వానిలా జీవితం గడిపేస్తున్నాడు. దైవీ ప్రణాళికను గమనించి కూడా ఏమాత్రం పట్టనట్లు ప్రవర్తిస్తూ, పవిత్ర కర్తవ్యాలను ఎగవేస్తున్నాడు. తన ఉత్సాహాన్ని పురుషార్థాన్ని సద్వినియోగం చేయలేక పోతున్నాడు.

**కథ -20 : యు**ద్ధం మధ్యలో అర్జునుని చేతి నుండి జారిన గాండీవాన్ని, శుష్కించిన ముఖాన్ని చూచి కృష్ణపరమాత్మ సందిగ్ధంలో పడ్డాడు. చేప్పేదానికి చేస్తున్నదానికి ఏ మాత్రం పొంతన లేదు. ఆ స్థితిలో అర్జునుని కర్తవ్య విమూఢునిచేస్తూ కృష్ణుడిలా అన్నాడు – "ఓ అభాగ్యుడా! ఇంతటి విషమవేళలో నీ మస్తిష్కం లోనికి ఇంతటి పిరికితనం, వ్యామోహం ఎలా చొరబడ్డాయయ్యా? లే! లేచి, కాలం యొక్క విలువను, అవసరాన్ని గుర్తించు. **ఈ కాలం నీ ఒక్కడిది కాదు, నీవంటి వారెందరిదో! కాబట్టి ఈ కాలం వ్యక్తిగత వ్యామోహానికి స్వార్థానికి విలువనీయవలసిన కాలం కాదని గ్రహించు"** అంటూ కాలం యొక్క విలువను గుర్తుచేయగానే అర్జునుని కన్నులు తెరుచుకున్నాయి. రెట్టించిన ఉత్సాహంతో లేచి గాండీవాన్ని ధరించాడు. కృష్ణ భగవానుని ప్రేరణాత్మకమైన ఈ పలుకులే, అర్జునుని మహాభారత విజేతగా అతనికి శ్రేయస్సుని అందజేశాయి. ఎప్పుడూ చివరి భాగాన్ని ఈశ్వరీయ శక్తే పూర్తి చేస్తుంది. కానీ మొదటి భాగాన్ని మాత్రం జాగృతాత్మలు సత్‌సాహసంతో పూర్తి చేసినపుడు మాత్రమే, రెండవ భాగం విజయవంతం కాగలదనే సత్యాన్ని జాగ్రత్తగా గమనించాలి.

భగవంతుడు సముద్రుడైతే, సజ్జనులు మేఘాలు. చందన వృక్షం భగవంతుడైతే, సత్పురుషులు సుగంధాన్ని వ్యాపింపచేసే మలయ మారుతాలు. "భగవంతుడు" అంటే ఆదర్శవాదం యొక్క సంపుటి.

**కథ -21 : బుద్ధ** భగవానునికి ఆత్మబోధ కల్గింది. కఠోర తపస్సు చేసి లభించిన తపోనిధితో ఆయన ముక్తి – మోక్షం కోరుకోలేదు. ఎందుకంటే ఆయన లక్ష్యం కేవలం తాను తరించడమే కాదు, కురీతియుక్త సమాజాన్ని ఉద్ధరించటం. కాబట్టి ఆయన వివేకమనే అస్త్రంతో జనుల మానసాలను మార్చగల్గేడు. ఆత్మబోధ ద్వారా లభించిన ఈశ్వర సందేశాన్ని వ్యక్తి వ్యక్తికి చేర్చి, **"విచార క్రాంతి"** ద్వారా సామాజిక పరివర్తన తీసుకొని

**క్రోధ, అవమానాలను ఎదుర్కోనగలిగే ఒకే ఒక ఆయుధం చిరునవ్వు.**

రావటంలో కృతకృత్యుడయ్యేడు. సిద్ధార్థుని హృదయంలో నాటుకొన్న విశ్వకళ్యాణ కాంక్షాబీజాలు గౌతమ బుద్ధుని రూపంలో మొలకెత్తి, వికసించి, వ్యాపించి మొత్తం మానవత్వాన్నే ధన్యం చేశాయి.

మానవీయ పురుషార్థం సరిఅయిన మార్గంలో తన పనిలో నిమగ్నమైతే యుగపరివర్తనకి కావలసిన పరిస్థితులు వాటంతట అవే ఏర్పడతాయి. గాంధీజీని ఉదాహరణగా తీసికుంటే, ఉప్పు సత్యాగ్రహ ఆందోళన, ఖాదీ ఉద్యమం, విదేశీ వస్తు బహిష్కరణ ఇలా చిన్నచిన్న కార్యక్రమాలలో ఉత్సాహవంతులకు ప్రవేశాన్ని కల్పించారు. పైకి చిన్నవిగా కన్పించిన ఈ కార్యక్రమాలే, ఆఖరుకు దేశ స్వాతంత్ర్యంగా రూపు ధరించాయి. ఇదే మహామానవుల కార్యప్రణాళిక. సూక్ష్మశక్తి ద్వారా ప్రేరేపించబడి జరిపిస్తూ ఉంటాయి.

నారద మహర్షి తిరిగి ఇలా అన్నాడు.

**శ్లో॥ ఉవాచ నారదో దేవ! వాచ్యః శ్రావ్యస్త్వయం మతః ।**
**జ్ఞాన పక్షం పూరకం తం కర్మ పక్షం విశదయ ॥**
**కర్తవ్యం యద్య దైన్యశ్చాప్యనుష్ఠేయం సమగ్రతా ।**
**ఉత్పద్యతే ధ్వయోజ్ఞానికర్మణోస్తు సమన్వయాత్ ॥**

**భావం : వినేది, వినిపించేది అయిన "జ్ఞాన పక్షం" పూర్తి అయింది. ఆచరించవలసిన "కర్మపక్షం" గురించి శెలవివ్వండి. జ్ఞాన కర్మల సమన్వయం వల్లనే పూర్ణత్వం సిద్ధిస్తుంది. దైవం గురించి అనేకమంది బ్రహ్మాండంగా ఉపన్యాసాలు చెప్పేస్తూ ఉంటారు. అతి గంభీరంగా వీటి మీద చర్చలు జరుపుతూ ఉంటారు. కాని చెప్పేవాటిని ఆచరణలో పెట్టటం, వాటిని జీవితంలో అభిన్న అంగంగా చేసుకోవటం అనేది చాలా తక్కువ మందిలో జరుగుతూ ఉంటుంది. ఇది ఆధ్యాత్మ క్షేత్రంలో అతి విస్తృతంగా కనిపిస్తూ ఉంటుంది. ధర్మాన్ని జిహ్వాకే పరిమితం చేయక జీవితం ద్వారా వ్యక్తం చేయాలి. సత్కర్మని బోధనలలోకాక, కర్తవ్యం ద్వారా చూపించాలి.** కాబట్టి కర్మపక్షం విశదంగా తెలియజేయుమని కోరిన నారద మహర్షితో విష్ణువిలా అన్నాడు–

జ్ఞానాన్ని అందించటానికి ప్రజ్ఞాపురాణ ప్రవచనాలు, కథలకు మించినవి మరేవీలేవు. అలాగే కర్మ మార్గంలో పయనింపచేయటానికి ప్రజ్ఞా ప్రశిక్షణ కేంద్రాలు నెలకొల్పబడాలి. ఈ కేంద్రాలు బహుముఖమైన గతి విధులద్వారా నిరంతరం శిక్షణ, ప్రేరణలను కలిగిస్తాయి. అలాగే యుగనిర్మాణంలో పాలుపంచుకోవటాన్ని భావనాశీలురందరిలో సమయదాన, అంశదాన కెరటాలు ఉప్పొంగేలా చేయాలి. వీరి సమిష్టి శక్తే మహాశక్తిగా ఆవిర్భవించి యుగసమస్యలను సంహారం చేస్తుంది.

**కథ –22** : అసుర నాశనానికి ఋషిగణాలు తమ రక్తాన్ని సమీకరించి కుండలో నింపి, సీత ఉద్భవానికి నాంది పలికారు. ఆ సీతా ఉద్భవమే రామావతారం దిగిరావటానికి, రామరాజ్య స్థాపనకి నిమిత్త మాత్రమైంది. ఇది సంఘటిత శక్తి యొక్క చమత్కారమే. దేవతల సంఘటిత శక్తే మహాదుర్గగా దిగి వచ్చి, దానవులను వధించి దేవతలను ఉద్ధరించినట్లు పురాణాలు ఘోషిస్తున్నాయి. వానరుల సమిష్టి ప్రయత్నంతో సేతు బంధనం,

గోపబాలల సహకారంతో గోవర్ధనోద్ధరణ – ఇటువంటి సంఘటనలన్నీ తెలియచెప్పే తథ్యమేమంటే– సాహసవంతులు, పురుషార్థ పరాయణుల స్నేహ సహకారాలతో అతి కఠిన కార్యాలు అత్యంత సరళవంతంగా నెరవేర్చటం సాధ్యమేనని ప్రకటిస్తున్నాయి.

గాలికి ఎగిరిపోయే గడ్డిపోచలు కూడా త్రాడుగా కలిసి ఒకటైతే ఏనుగును బంధించగలిగినట్టు సాధారణ మానవులు కూడా సమూహాలుగా కలిస్తే విశిష్ట కార్యక్రమాలను సైతం సరళంగా నెరవేర్చగలరు.

**కథ –23** : పాండవులు అజ్ఞాతవాసం ముగించి వచ్చిన తరువాత కృష్ణుడు వారి మానసిక స్థితిని పరిశీలించి, 'కౌరవులతో యుద్ధం అనివార్యం' అనే సంగతిని వివరిస్తూ, విజయం కూడా మీదేనని హామీ ఇస్తాడు. దానికి కారణం ఏమిటంటే, ఐదు రూపాలతో కనిపించే ఒకే వ్యక్తి పాండవులంటే – కానీ కౌరవులు అలాకాదు. నూరుగురు నూరు విధాలు. **సంఘటిత శక్తి మాత్రమే విజయలక్ష్మిని వరిస్తుంది** అని సంఘటిత శక్తి యొక్క గొప్పతనాన్ని వివరిస్తాడు. చివరకు కృష్ణుడు చెప్పినట్లే అక్షరాలా జరిగిన సంగతి మనమంతా భారతం ద్వారా తెల్సుకొన్నాం. పాండవులలో ఏ ఒక్కరూ సేనాపతి పదవి నాశించక ఏకమాత్రంగా దృష్టద్యుమ్నునికి సేనాధిపతి పదవిని ఇస్తారు. కౌరవులు సేనాధిపతి పదవి కోసం పరస్పరం పోట్లాడుకొంటారు. ఈ విధముగా పరస్పరం విరోధం వలన నూరుగురు కలిసి ఐదుగురిని గెలవలేక ఓడిపోవటం సంభవించింది. పాండవుల ఐక్యతే వారి విజయానికి, దైవకృప లభించటానికి మూలకారణమయింది.

**శ్లో॥ ధర్మస్య చేతనాం భూయో జీవితాం కర్తుమద్యతు ।**
**అధిష్ఠాత్రీం యుగస్యాస్య మహాప్రజ్ఞా ఉ మృతంభరామ్ ॥**
**గాయత్రీ లోక చిత్తేతాం కురుపూర్ణ ప్రతిష్ఠితామ్ ।**
**పరాక్రమంచ ప్రఖరంకర్తుం సర్వత్ర నారద ॥**

**భావం** : ఈనాడు ధార్మిక చైతన్యాన్ని పునర్జీవింప చేయటానికి ఈ యుగం యొక్క అధిష్ఠాన దేవత గాయత్రీ మాతను లోకుల మనస్సులలో ప్రతిష్ఠింపచేయాలి. అలాగే పరాక్రమం యొక్క ప్రఖరత కోసం సర్వత్ర యజ్ఞమయ వాతావరణాన్ని నెలకొల్పాలి.

**మహాప్రజ్ఞను ఆధ్యాత్మ పరమైన భాషలో "గాయత్రి" అంటారు. ఈ మహాప్రజ్ఞకు రెండు పక్షాలు ఉన్నాయి. 1. వేదాంతపరం 2. వ్యవహారికం. ఆధ్యాత్మికత యొక్క తత్వచింతన వేదాంత పరంగాను, పవిత్రాచరణ వ్యావహారిక పక్షంగాను పేర్కొనబడింది.**

మహాప్రజ్ఞ అంతఃక్షేత్రంలో ప్రతిష్ఠింపబడేసరికి సాధకుని వ్యక్తిత్వంలో అమోఘమైన పరివర్తన వస్తుంది. ఆత్మ విభూతులు, బుద్ధి, సిద్ధులు, లౌకిక సంపదలు ఇవన్నీ ఈ తత్వచింతన యొక్క ప్రతిఫలమే. ఈ మహాప్రజ్ఞ యొక్క వైశిష్ట్యాన్ని శాస్త్రాలలో అనేకులు అనేక రీతుల స్తుతించారు.

**బలవంతులు కృషినీ, బలహీనులు అదృష్టాన్నీ నమ్ముకుంటారు.**

దేవీ భాగవతంలోని వ్యాస, జనమేజయ సంవాదం –

**శ్లో॥ భగవాన్ సర్వధర్మజ్ఞ ! సర్వశాస్త్ర విశారద ।**
**కలావధర్మ బహుతే నరాణాం కాగతిర్భవేత్ ।**
**యద్యస్తి తరుణోపాయశ్చేద్ధయయా తం వదస్వమే ॥**
**ఏక ఏవ మహారాజ తత్రో పాయస్తు నాపరః ।**
**సర్వదోష నిరాసార్థం ధ్యాయేద్దేవీ పదాంబుజమ్ ॥**

**భావం :** ఓ సంపూర్ణ జ్ఞానం యొక్క తత్వజ్ఞానీ! యుగధర్మం యొక్క కటుకాలం నుండి సద్గతి పొందే ఉపాయం ఏమిటి? పూర్తిగా అధర్మంతో మునిగియున్న ఈ కలియుగంలో మనుష్యుల స్థితిగతులెలా ఉంటాయి? దయయుంచి ఈ ఆపద నుండి ప్రజలను గట్టుకు చేర్చేదారి ఏదైనా చూపుమని జనమేజయుడు వ్యాసుని ప్రార్థిస్తాడు.

వ్యాసుడు కొంత తడవ ధ్యానమగ్నుడై పిదప కన్నులు తెరచి, ఓ జనమేజయా! కలియుగం యొక్క భయంకరమైన పరిస్థితులలో "గాయత్రీ ఉపాసన" అనే ఆలంబన లేకుండా, వేరే ఏదారి వ్యక్తిని దరిచేర్చజాలదు. ఆ ఏకైక శక్తి ఒకటే వివేకాన్ని మేల్కొలిపి, విభేదాలను, దుర్భావనలను నశింపచేసి సమస్త మానవ సమాజాన్ని, ఐక్యత అనే త్రాటితో గట్టిగా కట్టివేయగలదు. కేవలం భగవతిని శరణు వేడటం తప్ప వేరు గత్యంతరం లేదని, ఆమెను శరణన్న వారిని దుష్కర్మలు, దుర్భావనల బారినుండి రక్షించకుండా ఆమె ఊరుకోజాలదనీ, ఉద్ధరించి తీరుతుందని వ్యాస భగవానుడు హామీ ఇస్తాడు.

మానవుడు వాతావరణ ప్రభావానికి లొంగి, చెడు కర్మలకు బానిసయై వాటివైపు పరుగు పెట్టే కాలాన్నే "కలియుగం"గా పేర్కొనటం జరిగింది. బుద్ధి హీనుడై వ్యక్తి కుకర్మలకు బానిసయై, నికృష్టంగా జీవించే ఈ కాలంలో మానవుల్ని ఉద్ధరించే శక్తి కేవలం గాయత్రీ శక్తికే ఉన్నదనే సత్యాన్ని తెల్సుకొన్న జనమేజయుని హృదయం తేలికపడింది.

ఇలాగే అత్రిమహర్షి **"గాయత్రీ మంత్ర జపాన్ని మించిన జపం మరేదీ లేదు. న భూతో న భవిష్యతి"** అని తెలియచేయటం జరిగింది.

వశిష్ఠ విశ్వామిత్ర సంవాదంలో విశ్వామిత్రుడు మహాప్రజ్ఞ యొక్క శ్రేష్టతను గురించి ప్రశ్నించినపుడు వశిష్ఠ మహర్షి ఇలా అన్నాడు– "గాయత్రి యొక్క సారమంతా 'ధీమహి' శబ్దంలో నిండి ఉన్నది. ఆ శ్రేష్టతను మనం మన అంతరంగంలో ధరించాలి. ప్రజలు ఆ శ్రేష్టతను, సత్ప్రవృత్తులను సంపాదించిననాడు వారిని ఏ విపత్తులు, శాపాలు దరిచేరవు.

సంపూర్ణ వేదాలు, యజ్ఞం, దానం, తపస్సు ఇవన్నీ కలసి గాయత్రి యొక్క కళల్లో ఒక్క కళకు సరితూగవు. గాయత్రితో సమానమైన మంత్రం 4 వేదాలలో లేదని విశ్వామిత్రుడు పేర్కొంటాడు. దేవీ భాగవతంలో

**ఇతరుల స్వేచ్ఛను హరించేవారు స్వేచ్ఛకు అనర్హులు.**

గాయత్రీ ఉపాసన మహత్యం గురించిన ఒక కథ ఉన్నది. ఈ కథ వ్యాసుడు జనమేజయునికి వినిపిస్తాడు.

**కథ -24** : ఒకసారి 15 సంగులు వర్షం లేక క్షామంతో భయంకరమైన పరిస్థితి ఏర్పడుతుంది. అసంఖ్యాకులు ఆకలితో మాడి మరణిస్తారు. శవాలు ఇళ్ళలోనే కుళ్ళిపోతున్నాయి. హాహాకారాలతో ప్రాణులు అల్లాడిపోయే ఆ సమయంలో కొందరు సత్పురుషులు ఆలోచనచేసి గౌతమమహర్షిని శరణువేడటం తప్ప గత్యంతరం లేదని నిర్ధారణ చేస్తారు. అందరూ కలిసి గౌతముని వద్దకు వెళ్ళి నమస్కరించి విపత్తు గురించి విన్నవిస్తారు.

గాయత్రీ ఉపాసకుడైన గౌతమ మహర్షి వచ్చినవారిని ఆదరించి, సర్వశక్తిమయి గాయత్రీ మాతను స్తోత్రం చేస్తాడు. విపత్తునుండి ప్రజల్ని రక్షించుమని ప్రార్థిస్తాడు. గాయత్రీమాత ప్రత్యక్షమై సమస్త ప్రాణుల ఆకలిని తీర్చగల ఒక పాత్రను ప్రసాదిస్తుంది. దీనితో సమస్త కోరికలు తీరగలవని చెప్పి గౌతముని ఆశీర్వదించి అంతర్థానమవుతుంది. ఆ పాత్ర అన్నరాసుల్ని వర్షింప చేసి, ఆకలి బాధ నుంచి అందర్నీ రక్షిస్తుంది. ఆశ్రయం కోరి వచ్చిన అందరికోసం గౌతముడు ఒక గాయత్రీ తీర్థాన్ని నిర్మిస్తాడు. అందరూ గాయత్రీ మహా పునశ్చరణలు చేసుకొంటూ ఆనందంగా ఉంటారు.

ఈ యుగం బుద్ధివాదం, తర్కం యొక్క ప్రత్యక్షవాద యుగం. అయినా ఈ శతాబ్దంలోని మహా పురుషులు కూడా గాయత్రి యొక్క విశిష్టతను ప్రాచీన కాలంలోని తత్వజ్ఞానులు, ఋషులు, అంగీకరించినట్లే అంగీకరించారు. మహాత్మాగాంధీ, తిలక్, మాలవీయ, రవీంద్రనాథ్, అరవిందుడు, వివేకానంద, రామతీర్థ, రామకృష్ణ పరమహంస, సి.వి.వి., ఇ.కె. వీరంతా జనుల మానసాలను ఉత్కృష్ట దిశగా గొనిపోవటానికి గాయత్రి శక్తిని అభ్యర్థన చేయుమని సూచించారు.

## యజ్ఞం – జీవితం :

గాయత్రిని విశ్వమాతగాను, యజ్ఞాన్ని తండ్రిగాను పేర్కొనటం జరిగింది. ఈ ఇద్దరి సమన్వయం, సహయోగం వల్లనే దేవసంస్కృతి ఉద్భవించి, వికసించబడి, "పూర్ణత్వం" అనేది సిద్ధించింది. యజ్ఞానికి యజ్ఞీయ భావనలకు అత్యంత ప్రాధాన్యత నీయవలసి ఉన్నది. యజ్ఞం యొక్క శ్రేష్టత బాహ్య స్వరూపాన్ని బట్టి నిర్ణయించేదికాదు. అంతరంగంలోని ఉత్కృష్ట త్యాగనిరతిపై ఆధారపడి ఉంది. యజ్ఞంతో పాటు త్యాగం బలిదానం యొక్క అభూతపూర్ణ పరంపర జోడించబడి ఉంది. ఇదే సంస్కృతిని ధన్యం చేస్తుంది. **యజ్ఞం అనే శబ్దానికి అర్థం అగ్నిహోత్రం ఎంతమాత్రం కాదు. శాస్త్రాలలో జీవన అగ్ని రెండు శక్తులుగా చెప్పబడింది. (1) స్వాహా (2) స్వధా. "స్వాహా" అంటే ఆత్మత్యాగం. తనతో తాను యుద్ధం చేసుకోగల శక్తి "స్వధా" అంటే జీవితంలో ఆత్మజ్ఞానాన్ని ధారణ చేసుకోగల సాహసం.**

**కథ -25** : కృష్ణ భగవానుడు ప్రక్కనే ఉండి చేయించిన యుధిష్ఠిరుని రాజసూయయాగం పూర్తి అయ్యేసరికి ఒక విచిత్రం జరిగింది. ఒక ముంగిస ఎదురుగా వచ్చి రోదించసాగింది. పాండవులతో సహా అందరూ ఆశ్చర్యంతో కారణం ఏమిటని ప్రశ్నించారు. రోదిస్తూ ముంగిస ఇలా బదులు పల్కింది.

**ఉన్నత మనస్కుడు ఎవరినీ అవమానించడు. ఎలాంటి అవమానాన్నీ సహించడు.**

కొంతకాలం క్రితం ఒక దేశంలో దుర్భిక్షం ఏర్పడింది. ప్రజలు ఆకలితో మరణించసాగారు. ఒక బ్రాహ్మణ కుటుంబం చాలా రోజులుగా పస్తులు ఉంటోంది. ఒక రోజు అతికష్టంమీద లభించిన కాస్త పిండితో నాలుగు రొట్టెలు తయారు చేసుకొన్నారు. తయారయిన తరువాత ఆ బ్రాహ్మణుడు తన అలవాటు ప్రకారం తనకంటే ఆకలిగా ఉన్న వారెవరైనా ఉంటే వచ్చి, ఈ రొట్టెలు స్వీకరించండి. వీటిపైన అధికారం మీకే ఉన్నదని గొంతెత్తి పిలుస్తాడు. ఒక ఛండాలుడు ఆవురుమంటూ వచ్చి "ఆకలి అంటాడు" అతను తృప్తి చెందే వరకూ కుటుంబ సభ్యులు అందరూ అన్నార్తియై వచ్చిన అతిథికి రొట్టెలు అన్నీ వడ్డిస్తారు. రొట్టెలన్నీ తృప్తిగా తిని, నీరు త్రాగి ఛండాలుడు మిగిలిన నీటితో చేయి కడుగు కొంటాడు. ఆ సమయానికి అటుగా వెళుతూ నేను ఆ ఛండాలుడు చేయికడిగిన నీటితో తడిసాను. తడసిన సగభాగం సువర్ణ వర్ణంతో మెరుస్తూ తయారైంది. మిగతాసగం యుధిష్ఠిరుడు చేసిన ఈ మహాయజ్ఞంలో భుజించి చేయికడిగిన నీటితో బంగారువర్ణం ధరిస్తుందని ఆశతో వచ్చాను. కానీ నా ఆశ నిరాశ అయిందని ముంగిస మరింత రోదిస్తుంది.

ఈ కథనుబట్టి యజ్ఞం యొక్క స్వరూపం బాహ్యస్వరూపాన్ని బట్టి నిర్ణయించేది కాదని అర్థమవుతుంది.

**కథ -26** : విదర్భదేశంలో క్షామం ఏర్పడింది. అందరూ ఆకలితో మరణిస్తున్నారు. ఒక్క రైతువద్ద మాత్రం కొంత ధాన్యం దాచబడి ఉంది. దానితో అతను అతని కుటుంబం సంవత్సరకాలం హాయిగా తిని బ్రతకవచ్చు. కానీ అతను అలాచేయక ఆకలిబాధతో కుటుంబంతో సహా మరణించాడు. "ఇంటినిండా ధాన్యం ఉండికూడా అలా ఎందుకు రైతు కుటుంబం మరణించిందో తెల్సుకోవాలని ప్రజలు ఇల్లంతా గాలించగా ఒక వీలునామా లభిస్తుంది. ఎవరివద్దా ధాన్యంలేని సమయంలో నేను కూడా నా ధాన్యం తినివేస్తే రాబోయే వర్షాకాలంలో విత్తనాలు ఉండవు. కాబట్టి వీటిని విత్తనాలుగా ఉపయోగించి అనేక కుటుంబాలకు ఆహార కొరత తీర్చుమని రైతు వీలునామాలో వ్రాస్తాడు. అతని త్యాగనిరతికి అందరి కళ్ళల్లో ఆనందబాష్పాలు వర్షిస్తాయి. అతని కోరిక మేరకు తరువాత వర్షాకాలంలో ఆ ధాన్యం విత్తనాలుగా అందరికీ పంచుతారు. అనతికాలంలోనే నాల్గుదిశలా పచ్చని పైరు సయ్యాటలాడుతుంటే, "రైతు చనిపోలేదు, అసంఖ్యాకులైన జీవధారులుగా మనమధ్యనే ఉన్నాడనే" ఆనందం అందరిలోనూ కల్గుతుంది.

**కథ -27** : విధాత తన సేవకులను పిలచి, భూలోకం అంతా తిరిగి ఒక్కొక్కరు ఒక్కొక్క అమూల్యమైన వస్తువు తీసుకొని రమ్మని, ఎవరి కానుక విలువైనదైతే వారికి ఉన్నత పదవిని ఇస్తానని భూలోకానికి పంపిస్తాడు. ఎంతో ప్రయాసపడి భూలోకం అంతా గాలించి తలొకరు తలొక వస్తువు తెచ్చి బ్రహ్మదేవునికి సమర్పిస్తారు. వెళ్ళిన వారిలో ఒక్కడు మాత్రం వెదకి అలసిపోయి చివరకు ఆలస్యంగా చిన్న మట్టి పొట్లంతో దైవం దర్బారులో ప్రవేశిస్తాడు. దానిని చూచి మిగిలినవారంతా విరగబడి నవ్వుతారు.

బ్రహ్మ అతని వంక "ఇది ఏమిటని" ప్రశ్నార్థకంగా చూస్తాడు. అతను చేతులు జోడించి, ఓ భగవానుడా! భూలోకం అంతా గాలించి చాలా ప్రయత్నించాను. ఇంతకంటే విలువైన దేదీ కనుపించలేదు. ఎందుకంటే ఈ మట్టి మామూలు మట్టికాదు. **ధర్మాన్ని, మానవత్వాన్ని రక్షించటానికి వీరులు ఆనందంతో తమ ప్రాణాలను సమర్పణ చేసిన ప్రదేశంలోని మట్టి** అని వినయంగా మట్టి పొట్లాన్ని బ్రహ్మపాదాల ముందు ఉంచుతాడు.

**ప్రతిఘటన కార్యసాధకుని పట్టుదలను పెంచుతుంది.**

విధాత ఆ పొట్లంలోని మట్టిని తీసి భక్తి శ్రద్ధలతో తన శిరస్సుపైన జల్లుకొంటాడు. ఆ వ్యక్తికి తన దర్బారులో అత్యంత ఉన్నతమైన పదవిని ఇచ్చి సత్కరిస్తాడు.

కర్మకాండల కళేబరాన్ని పట్టుకొని వ్రేలాడటం కాక కర్మకాండలలో దాగి ఉన్న ఆత్మని తెల్సుకొన్న వ్యక్తులు యజ్ఞాలను **జీవితాల ద్వారా నిర్వహిస్తారు. కర్మకాండలు వ్యక్తిని ఉత్కృష్ట స్థితికి చేర్చే సాధనాలు మాత్రమే. యజ్ఞమంటే త్యాగం, యజ్ఞాలు చేయటమంటే జీవితాన్ని యజ్ఞమయం కావించుకోవటం.**

**శ్లో॥ ప్రజ్ఞా పీఠ స్వరూపేషు యుగదేవాలయా భువి ।**
**భవంతు తత ఏతాసాం సృజ్యానామథ నారద ॥**

**భావం : నారదా !** ఇంకా ఏమి చేయాలంటే యుగ దేవాలయాలుగా ప్రజ్ఞాపీఠాలు తయారుకావాలి. వీటి ద్వారా ప్రజలు, వారి స్వభావాలు సంస్కరించబడి, భవిష్యత్తు ఉద్ధరించబడాలి. ఆ విధంగా మహా పరివర్తనకి కావలసిన పునాది తయారవుతుంది. క్రొత్త యుగంలో గాయత్రీ మందిరాలు, యజ్ఞశాలలు సర్వత్రా నిర్మాణం కావించబడతాయి. "మందిరాలు" అంటే ఈనాడు ఉన్నటువంటి, పలాయన వాదంతో వ్యక్త పరుస్తున్న భక్తిశ్రద్ధలకు పరిమితమైనవి ఎంతమాత్రం కాదు సుమా. కర్మ, నిష్ఠలను మేల్కొల్పితేనే మందిరం అనేది సార్థకమైనట్లు. **దేవాలయాలు జాగృతి కేంద్రాలు కావాలి**. వ్యక్తిని కర్మమార్గం నుండి వంచించి పలాయన వాదాన్ని ప్రోత్సహిస్తే అది దేవాలయం అనిపించుకోదు.

ప్రస్తుతం యుగం యొక్క సంధ్యా సమయం. విశ్వంలోని వేదాంతులు, విద్వాంసులు, భవిష్యత్తు తెల్సినవారు అనేకులు ఏకకంఠంతో యుగపరివర్తన అతిసమీపంలో ఉన్నదని ఎలుగెత్తి చెప్తున్నారు. పరిస్థితులు చాలా విపత్కర స్థితిలో ఆఖరు చరణంలో ఉన్నాయి. ఇలాంటి స్థితిలో యుగ దేవాలయాల జాగృతి కేంద్రాలు అవసరం ఎంతైనా ఉంది.

భక్త కవి తులసీదాసు ఇలా అన్నారు :

**శ్లో ॥ ఏక్ సహస్ర నౌ సౌకె ఊపర్ ఏసీ యోగ్ పరై ।**
**సహస్రవర్షతౌ సత్ యుగ్‌బీతే ధర్మకీ బేలిచఢె ॥**

**భావం :** 19వ శతాబ్దం అంతంలో జరిగే మహాపరివర్తన తరువాత వేల సంవత్సరాల వరకు ధర్మం, సుఖశాంతులు నిండిన రాజ్యం స్థాపించబడుతుంది. సత్యయుగ నిర్మాణం జరుగుతుంది. అని తులసీదాసు తెలియచెప్పటం జరిగింది.

మహాభారత వనపర్వంలో ఈ క్రింది విధంగా ఉన్నది :

**శ్లో॥ తతస్తు మూలే సంఘాతే వర్తమాన యుగక్షయే ।**
**యదా చంద్రస్య సూర్యస్య తథాతస్య బృహస్పతిః ॥**
**ఏకరాశౌ సమేష్యంతి ప్రయత్స్యతి తదాకృతమ్ ।**

**పంచిన కొలదీ రాణిస్తుంది విద్య.**

**కాలవర్షీచ పర్జన్యో నక్షత్రాణి శుభానిచ ॥**

**క్షేమం సుభిక్షమారోగ్యం భవిష్యతి నిరామయమ్ ॥**

**భావం :** యుగం సమాప్తమై మరోయుగం ఆరంభమయ్యేటపుడు, దారుణమైన సంఘర్షణలు, తీవ్ర ఆందోళనలు ఉత్పన్నమవుతాయి. **చంద్రుడు, సూర్యుడు, బృహస్పతి పుష్య నక్షత్రం ఒకే రాశిమీద ఎప్పుడు ప్రవేశిస్తాయో అపుడు సత్యయుగం యొక్క శుభారంభం జరుగుతుంది.** తరువాత శుభ నక్షత్రాల కృపావర్షం వర్షించి పదార్థాలు వృద్ధి చెందటం, సుఖశాంతులు నెలకొనటం ఇవన్నీ జరిగి ప్రజలు ఆనందోత్సాహాలతో ఆరోగ్యంగా జీవిస్తారు. ఈ విధమైన గ్రహయోగం కొద్దికాలం క్రితమే ఏర్పడి ఉన్నది. ఇతర లెక్కల ఆధారంగా కూడా ఇదే సరి అయిన సమయం.

విశ్వ వినాశకర శక్తులను, ప్రకృతి ప్రకోపాలను క్షీణింపజేసి భూమిపైన తిరిగి స్వర్గీయ వాతావరణాన్ని నెలకొల్పగల దేవ మానవుల్ని సృష్టించే కష్టతరమైన కార్యభారాన్ని స్వీకరించి, ఆ బాధ్యతలో భాగస్వామ్యం వహించే వారికి లభించే శ్రేయోసౌభాగ్యాలు అనంతమైనవి, అసాధారణమైనవి అంటూ కృష్ణ పరమాత్మ నారదునికి తెలియచెప్పాడు. ప్రకృతి ప్రకోపాలు, విశ్వవినాశకర శక్తులు వీటి మూలంలో అధికంగా చోటు చేసుకొన్నవి **మానవుని నికృష్ట కర్మలు, భ్రష్ట చింతనలే.** వీటి వల్లనే ఈనాడు ప్రకృతి సమూహాలుగా కబళించి వేస్తోంది. "రాక్షసత్వం" జీవన్మరణాల మధ్య పోరాడుతోంది. "దేవత్వం" రాక్షసుల్ని పదవీచ్యుతుల్ని చేసి, భూమిపైన స్వర్గావతరణ కావించాలనే అచంచల దీక్షతో అనేక అవరోధాలను ఎదుర్కొంటోంది. ఇది ఈనాడు మనకు కష్టంగా కనిపిస్తున్నా అసంభవం ఎంతమాత్రం కాదు, చాలా సంభవం. గడచిన కాలంలో కూడా ఈనాడు మన ఎట్టెదుట ఉన్న పరిస్థితులకంటే చాలా దారుణమైన పరిస్థితులు సంభవించాయి. ఆనాడు ఆ పరిస్థితులకు ఎదురు నిలబడిన దేవమానవులు తాము ధన్యులై సమస్త మానవజాతిని చరితార్థం చేశారు.

ఈనాడు ప్రజ్ఞావతారం యొక్క దివ్యశక్తి ప్రముఖ పాత్ర వహించి, ఈ యుగ పరివర్తనా శుభఘడియలలో అవసరమైన సరంజామాను సమీకరిస్తోంది. కానీ పూర్తి కర్తృత్వ భారాన్ని ప్రజ్ఞావతార శక్తి తానే ఒంటరిగా భరించబోవటం లేదు. మిగిలిన అవతారాలలో కూడా అనుయాయులు మరువనంతగా అవతారాలకు సహకరించి చిరస్థాయిగా నిలచిపోయారు. రామావతారం చూస్తే, లక్ష్మణుడు, హనుమంతుడు, విభీషణుడు సుగ్రీవుడు, నలుడు, నీలుడు మొదలైన వరిష్ట ఆత్మలనించి వానరులు, పక్షులు వంటి కనిష్ట ఆత్మల వరకు సహకారాన్ని అందించాయి. కృష్ణావతారం చూస్తే, పాండవులు మొదలు గోప బాలకుల వరకు వెంట ఉండి పనిచేశారు. **భగవంతుడు సర్వసమర్థుడే, చిటికెన వ్రేలుతో పర్వతాన్ని ఎత్తగలడు. బ్రహ్మాండాన్నే కిరీటంగా ధరించనూగలడు.** ప్రియ పరిజనులకు శ్రేయస్సుని దక్కించటం అవతారం యొక్క ఔదార్యం. శబరి, కుబ్జ, గుహుడు, సుధాముడు వంటి వారికి లభించింది అవతార పురుషుల అపార కరుణ కాక మరేమిటి ?

**సహకారం, సంఘటిత శక్తి సర్వశ్రేష్ఠమైనవిగా ప్రతిపాదించటానికే మహాశక్తులు మనకు ఇలాంటి అవకాశాలను ప్రసాదిస్తూ ఉంటాయి.**

**పాలకుల దుర్మార్గం కన్న మంచివాళ్ళ మౌనం మరింత విషాదకరం.**

**శ్లో॥ జాగృ తాత్మవతా మేతం సందేశం ప్రావయాస్తుమే !**
**నోపేక్ష్యో ఽసమః కాలః క్రియతాం సాహసం మహత్ ॥**

ఓ నారదా! జాగృతాత్మలకు ఈ నా సందేశాన్ని తప్పక అందించు. ఆ అమూల్యమైన అవకాశాన్ని ఉపేక్షించవద్దని నామాటగా చెప్పు. ఎందుకంటే ఈనాడు ఈ పరిస్థితులలో ఇక్కడే ఇప్పుడే వారు జన్మించారంటే అది సాధారణమైన విషయం కాదు. వారి జన్మ యొక్క ఉద్దేశ్యం ఎంతో విశిష్టమైనది. అందుకే వారు ఈ విశిష్ట కాలంలో జీవధారులుగా, మానవులుగా దిగిరావటం సంభవించింది. అదృశ్య జగత్తులో ప్రవహించే ప్రకృతి ప్రవాహాన్ని వారు గుర్తించి, యుగ పరివర్తన కార్య ప్రణాళికను అవగతం చేసికొని, వారి జీవిత ఉద్దేశ్యాన్ని నెరవేర్చజాలని పక్షంలో ముందు ముందు వారు పశ్చాత్తాపంతో కుమిలి పోవలసి వస్తుందని ప్రజలను హెచ్చరించవలసినదిగా కృష్ణ పరమాత్మ నారదునికి తెలియచేస్తాడు.

**కథ -28** : రెండు విత్తనాలు భూమిలో నాటబడ్డాయి. రాత్రి హాయిగా రెండూ నిద్రపోయాయి. మర్నాడు ఉదయానికి ఒక విత్తనం భూమిని బ్రద్దలు చేసికొని బయటకు రాబోతోంది. రెండవ విత్తనం దాన్ని వారిస్తూ – "బయటకు పోవద్దు. బయట ప్రజలు నిన్ను, నీ సంతానాన్ని అనేక విధాలుగా బాధిస్తారని" హెచ్చరిస్తుంది. అయినా వినకుండా విత్తనం బయటకు వచ్చి, బయట సౌందర్యాన్ని చూచి పులకించి పోతుంది. సూర్యుని వెచ్చదనం, వాయుదేవుని మలయమారుతం, చల్లని జలం ఇవన్నీ తనివితీరా గ్రోలి వృక్షంగా మారి భూమాత ఒడిలో ఉయ్యాలూగుతూ అనేక మందికి అనేక సౌకర్యాలు కల్గించి తాను తరించటమే కాక తన జీవితాన్ని చాలించే నాటికి తనలాంటి అనేక విత్తనాలను వెదజల్లి ఆత్మతృప్తితో నిష్క్రమిస్తుంది. మట్టిలోపలే భయంతో స్వార్థంతో దాగిఉన్న విత్తనం ఇదంతా చూచి పశ్చాత్తాపంతో లోపలే కుమిలి శిథిలమై నశిస్తుంది.

**కథ -29** : హనుమంతుడు ఎప్పుడూ సుగ్రీవుని సేవకుడే. అయినప్పటికీ సుగ్రీవుని భార్యను వాలి అపహరించినపుడు, తన పురుషార్థంతో తన రాజుకి ఏ విధంగాను సహాయం చేయలేక పోయాడు. సుగ్రీవుని భార్యని రక్షించి తీసుకురాలేక పోయాడు. తనని తాను అసమర్థుడుగానే భావించి, ఎక్కడో అక్కడ దాగి బ్రతకటానికి నిర్ణయించుకొన్నాడు. కానీ ఎప్పుడైతే అవతారమూర్తి శ్రీరాముని కార్యభారాన్ని స్వీకరించాడో అప్పుడు సాగరాన్ని లంఘించాడు. పర్వతాలని ఎత్తాడు. అశోకవనాన్ని నాశనం చేశాడు. లంకని తగలేశాడు. ఇలాంటి అసాధ్యాలను సాధించగలిగాడు. ఒకప్పుడు సుగ్రీవుని భార్యని రక్షించలేని వానరుడు అవతారమూర్తి అండతో అభేద్యమైన లంకలో ఉన్న సీతమ్మవారికి ముక్తి లభింపచేయటంలో సఫలీకృతుడయ్యేడు.

యుగం యొక్క అవసరానికి తగిన గొప్ప వ్యక్తులను నిర్మించటం, వారికి యుగ చైతన్య సందేశాన్ని వినిపించి, జన్మయొక్క ఉద్దేశాన్ని తెలియచెప్పటం ఒక విధంగా నవనిర్మాణమే. నవసృష్టి కార్యనిర్వహణలో తమ సర్వస్వం అర్పించిన వారెన్నడూ నష్టపోరు. ఈ దైవీ కార్యక్రమాలలో నిష్టతో, నిజాయితీతో నిమగ్నమైన వ్యక్తులు 3 అసాధారణమైన లాభాలను పొందుతారు. 1) ఆత్మసంతోషం. 2) దైవీ అనుగ్రహం 3) లోకసన్మానం. వీటితో వారు ధన్యులై కాలాన్ని యుగాన్ని ధన్యం చేస్తారు. చరిత్ర పుటల్లో సువర్ణాక్షరాలతో లిఖించబడిన

మహామానవులంతా పరమార్థ పరాయణులుగా తమ జీవితాలను మలచుకొని, లోక కళ్యాణమే ఆత్మకళ్యాణంగా భావించి తరించారు. "ఈనాడు సంచిత సంస్కారాలను పశు ప్రవృత్తులను విడనాడి, లోక కళ్యాణం కోసం శాయశక్తులా కృషిచేయాలి. సంకీర్ణ స్వార్థపరత్వం నుంచి ఔన్నత్యం వైపు కన్నెత్తి చూచి, ఆదర్శవంతమైన పారమార్థికమైన మార్గంలో ముందుకు దూకాలి. త్యాగం, సాహసం, బలిదానాన్ని ఆశ్రయించి చరిత్రలో చిరస్థాయిగా మిగలాలి" అంటూ భగవానుడు ఇచ్చిన పిలుపు విని నారద మహర్షి ఏమి చేశాడంటే :-

**శ్లో॥ భగవంతం తతో నత్వా వాంఛా సామ్యం విచార్య చ ।**
**ప్రజ్ఞా పురాణ సందేశ ముపదేష్టుం జనం జనమ్ ॥**

భగవానునికి నమస్కరించి, ఆయన కోర్కెలో తన కోర్కెను విలీనం చేశాడు. వ్యక్తి వ్యక్తికీ ప్రజ్ఞా పురాణాన్ని వినిపించటం, జాగృతాత్మలను ప్రజాహిత కార్యక్రమాలలో భాగం పంచుకొనేలా చేయటం అనేటటువంటి సంకల్పాలను తీసికొని, ప్రసన్న చిత్తంతో భూమిపైకి దిగివచ్చాడు. సప్తఋషుల తపోభూమిలో కాస్త విశ్రాంతి తీసికొని, తరువాత యుగాంతర చైతన్య రూపంలో విశ్వమంతా వ్యాపించాడు.

**ఇతి శ్రీ మత్ప్రజ్ఞా పురాణే "లోక కళ్యాణ జిజ్ఞాసే"**
**ఇతి ప్రకరణో నామ ప్రథమోధ్యాయః**

# ప్రజ్ఞా పురాణం

## అధ్యాత్మ దర్శన ప్రకరణం

హిమాచ్ఛాదితమైన ఉత్తరాఖండము యొక్క అభయారణ్యంలో ఒకసారి శమీకుడు, ఉద్దాలకుడు, ఏతరీయుడు, తాండ్యుడు మొదలైన ఋషిపుంగవులు బ్రహ్మవిద్యయొక్క గూఢ తత్వాన్ని గురించి విచారణ జరిపే సంకల్పంతో సమావేశమయ్యారు. అనేక ప్రసంగాలపై చర్చ సాగిన పిదప ఒక మహత్వ పూర్ణమైన ప్రశ్న ఉద్భవించింది. ప్రజ్ఞా పురుషుడైన పిప్పలాద మహర్షిని, బ్రహ్మజ్ఞాని అయిన అష్టావక్రుడు ఈ విధంగా ప్రశ్నించాడు.

**శ్లో॥ ఈశ్వరః భూపతిః సాక్షాత్ బ్రహ్మాండస్య మహామునే ।**
**మానవం రాజపుత్రం స్వ కర్తుం సర్వగుణాన్వితమ్ ॥**
**విభూతీః స్వా అదాత్ బీజరూపే సర్వా ముదాన్వితః ॥**
**సృష్టి సంచాలకో ప్యేష శ్రేయసా రహితః కథమ్? ॥**

"బ్రహ్మాండానికంతకీ ఈశ్వరుడే సామ్రాట్ అయినా ఆయన మానవునికి తన సర్వగుణ సంపదలను ఇచ్చి తన ఉత్తరాధికారిగా, యువరాజుగా జన్మను ప్రసాదించాడు. సృష్టిని పాలించుటలో తనకు భాగస్వామిగా ఉండుమని సమస్త యోగ్యతలనూ, బీజరూపంలో తన సమస్త శక్తులనూ మాధవుడు మానవునికి ధారపోశాడు. అయినా మానవుడు ఆ పదవి, ఆ గౌరవం, అర్హతల నుండి ఎందుకు వంచించబడుతున్నాడు?"

బ్రహ్మజ్ఞాని అయిన అష్టావక్రుడు ఆర్తితో ప్రశ్నించిన ప్రశ్న మానవ మాత్రులంతా ప్రశ్నించుకోవలసిన అత్యంత ఆవశ్యకమైన ప్రశ్న. సురదుర్లభమైన మానవ జన్మను పొంది, ఈశ్వరుని కిరీటంలో మణిగా భాసించవలసిన సౌభాగ్యవంతుడైన జీవునికి అసలు దౌర్భాగ్యం ఎక్కడిది?

1) బీజరూపంలో సమస్త ఈశ్వరీయ శక్తులు ఉన్నాయి.

2) బ్రహ్మాండాన్ని సువ్యవస్థితంగా ఉంచి కాపాడవలసిన ఉన్నతమైన పదవి వుంది.

ఈ రెండు విభూతులను కల్గివుండి కూడా మానవుడు దీనంగా హీనంగా ఎందుకు జీవించవలసి వస్తోంది. అనేది ప్రతి ఒక్కరు తెలుసుకోవలసిన విషయమే.

విత్తనం పగిలి వృక్షంగా మారుతుంది. పుష్పిస్తుంది, సుగంధాలు వెద జల్లుతుంది. ఫలిస్తుంది, వ్యాప్తి చెందుతుంది. ఇలా వృక్షం యొక్క బాహ్యస్వరూపం ఎంతగా మార్పు చెందినా విత్తనం ఏ జాతికి చెందినదైతే వృక్షం ఆ జాతికే వర్తించి తీరుతుంది. అల్పత్వం ఔన్నత్యంగాను, అణువు విభుడుగాను మారే ఈ మహా

**ఆదర్శం లేని వ్యక్తి చుక్కాని లేని పడవ.**

సామర్థ్యం ఒకే ఒక్క "అలభ్య అవకాశం" ద్వారా మాత్రమే అందుతూ ఉంటుంది. ఈ అవకాశం లభించటానికి మానవుడు ఎన్ని కష్టాలు అనుభవించాలో, ఎన్ని యోనులలో పరిభ్రమించాలో చెప్పనలవికాదు.

**శ్లో॥ సామధ్యన్యూన తాయాంతు సాధనా భావ ఏవవా ।**
**ప్రతికూల స్థితౌ వాపి నర స్త్వ సఫలో భవేత్ ॥**
**యత్రైతన్నాస్తి తన్నాపి సృష్టిరత్నం నరః కథమ్ ? ।**
**దైన్యేన గ్లాపితే నాథ జీవతీహా ఘృణాస్పదః ॥**

సామర్థ్యం లేకపోవటం, సాధనాల కొరత, ప్రతికూల పరిస్థితులు, వీటివల్ల, సృష్టి ప్రయోజనాలలో సాఫల్యం పొందలేక పోవటం, పోనీ ఒప్పుకొందాం. కానీ ఇలాంటి లోటుపాట్లు ఏమీ లేకుండా విధాత, తనకు వారసుడుగా జన్మను, జన్మతోబాటు సాధనాలు సామర్థ్యాన్ని, అసాధారణమైన సిద్ధులను, అత్యంత అనుకూలమైన పరిస్థితులను అనుగ్రహిస్తే కూడా, ఎప్పుడూ ఏడుస్తూ, మొత్తుకుంటూ, అడుక్కొంటూ హేయమైన స్థితికి దిగజారి ఎందుకు జీవించాలి? అనేది జిజ్ఞాసువుల సందేహం.

**ఈ సందర్భంగా మహర్షి జిజ్ఞాసువులకు వినిపించిన కథ చూద్దాం ...**

**కథ -1** : ఒక వ్యక్తి ఒక సాధువు వద్దకు వచ్చి ఎంతగానో దుఃఖిస్తూ తన దురదృష్టాన్ని నిందించుకొంటూ, తానిక 'లేమితో' జీవింపజాలననీ, ఈ జీవితాన్ని ముగించటాని కేదైనా దారి చూపుమని ప్రార్థిస్తాడు. సాధువు అతనివంక చూచి, "నాయనా! నిన్ను నేను క్షణంలో లక్షాధికారిని చేసి, నీ పేదరికాన్ని దూరం చేస్తాను. నీ ఒక్కొక్క అవయవానికి ఎన్ని లక్షలు కావాలో చెప్పు" అని ప్రశ్నిస్తాడు. చావటానికి దారి చూపమని కోరిన ఆ వ్యక్తి లక్షలిస్తానన్నా ఒక్క అవయవాన్ని ఖండించి అమ్మటానికి సాహసించలేక సాధువుకి తన వివశత్వాన్ని తెలుపుతూ చేతులు జోడిస్తాడు.

సాధువు అతని భుజం తట్టి, "చూశావా! నాయనా! ఎంత విలువైన సంపద నీ దగ్గర ఉన్నదో! వెలలేని జీవితాన్ని గుర్తించక సద్వినియోగం చేసుకోలేక నీలాగే ఎందరో ఇదే స్థితిలో జీవిస్తున్నారు. జీవితం ఒక వరం. నీ దగ్గరున్న దివ్యవిభూతుల్ని గుర్తించు" అని చెప్పి అతనికి తానేమిటో తెలియచేసి పంపిస్తాడు సాధువు.

**కథ -2** : ఒక వ్యక్తి ఒక మహాత్ముని వద్దకు వెళ్ళి "మహాత్మా!" జీవితం గురించి ఆలోచిస్తే భయం వేస్తోంది. జీవితం క్షణభంగురం. బాల్యం అంతా అజ్ఞానమే. వార్ధక్యం చాలా భయంకరమైనది. యవ్వనము బరువులు-బాధ్యతలు. ఇంక ఆధ్యాత్మ జ్ఞానాన్ని ఎప్పుడు తెల్సుకొంటాం? జ్ఞాన సముపార్జనకే తీరిక దొరక్క అవస్థపడుతూ, ఇంక లోకసేవ ఏమి చేయగలం? బొత్తిగా తీరిక లభించని యాంత్రిక జీవితం అయిపోయింది. అని రోదిస్తాడు.

అతన్ని చూచి మహాత్ముడు కూడా రోదించసాగాడు. వచ్చిన వ్యక్తి ఆశ్చర్యంతో "మీరెందుకు రోదిస్తార"ని ప్రశ్నించాడు. "ఏమి చేయనయ్యా! నీలాంటి బాధే నాకూ ఒకటుంది. తినడానికి తిండి కావాలి. కానీ పండించుకోవటానికి భూమిలేదు. భగవంతుని ఒక అంశలో మాయ నిండి ఉంది. మాయలోని ఒక అంశలో

త్రిగుణాలు, త్రిగుణాలలోని ఒక అంశలో ఆకాశం, ఆకాశంలో కొద్దిభాగం వాయువు, వాయువులో కూడా చాలా భాగం అగ్ని నిండి వున్నది. అగ్నిలో ఒక భాగం నీరు, నీటిలో నూరవ అంశ పృథ్వి, పృథ్విపైన సగభాగం పర్వతాలు ఆక్రమించు కొన్నాయి. ఇంకా నదులు, అడవులు చెదురు మదురుగా వ్యాపించి ఉన్నాయి. ఇక నేను ఎక్కడ పంట పండించుకోగలను. ఇంతో అంతో భూమి ఉన్నట్లు మనకు కనిపించినా, దానిమీద ఇప్పటికే ఇతరులు అధికారాన్ని చెలాయిస్తున్నారు. ఆకలితో చనిపోవటం తప్ప నాకింక వేరే దారి ఏది?" అంటూ మరింత రోదించ సాగాడు.

"ఎందుకు అనవసరంగా రోదిస్తావ్? నీకు లోటు ఏముంది? హాయిగా పండో ఫలమో తిని బాగానే ఉన్నావు కదా !" అన్నాడు వచ్చిన వ్యక్తి. మహాత్ముడు వెంటనే చిరునవ్వు నవ్వి, "నాయనా! నీ పరిస్థితి కూడా ఇలాంటిదే. నీకు ఏ లోటులేదు. అమూల్యమైన జీవితం లభించింది. ఆ జీవితం ద్వారా బోలెడు సమయమూ లభించింది. **జీవితం అంటేనే సమయం.** కానీ తీరిక దొరకటం లేదు, జీవితం మునిగిపోతోంది అంటూ చేతకాని వాడిలా రోదిస్తున్నావ్. ఇకపైన ఇలాంటి ఆలోచనలు కట్టిపెట్టి లభించిన కాలాన్ని సద్వినియోగం చేయి" అంటూ మహాత్ముడు కాలం యొక్క విలువను తెలియజేస్తాడు.

తన అపూర్ణత్వాన్ని పూర్ణత్వంగా మార్చుకోవాలనే ఆర్తి ఆత్మక్షేత్రంలో ఉద్భవిస్తే అది మానవ స్థాయికి తగినటువంటిది. మిగతా యాచనలన్ని పశుస్థాయికి చెందినవే. సృష్టి యొక్క ఉద్భవం, వికాసం జరిగి, జీవికి మానవ జన్మ లభించినప్పటినుండి కూడా హీనస్థాయికి చెందిన జీవితాన్నే గడుపుతూ ఉంటే అది వేరే విషయం. కానీ సత్యయుగంలో దేవతల స్థాయికి చెందిన జీవితాలు గడిపేరు. భూమిపైన స్వర్గీయ వాతావరణాన్ని నెలకొల్పేరు. సంస్కార వంతమైన జీవనాన్ని జీవించారు. ఇన్నీ చేసి ఆ ఉన్నత శిఖరాలనుండి జారి, క్రిందపడి పతనమవటాన్కి కారణం ఏమై ఉంటుంది? వాస్తవానికి ఈనాటి పరిస్థితులు కూడా సత్యయుగంలో పరిస్థితుల కంటే ఉత్కృష్టమైనవనే చెప్పాలి. మరి మనిషి దుఃఖించే దుర్భర పరిస్థితుల్ని ఎందుకు కల్పించుకొన్నట్లు ?

**శ్లో॥ ఉచ్చాదర్శాయ సంస్పృష్టో మానవోయది జీవతి ।**
**తిరశ్చాం ప్రాణినాం హేయ స్తరేణ మనసా తథా ॥**
**అనాత్మాచరణం కుర్యాత్సృష్టి సంతులనంతథా ।**
**వికుర్యాద్ మహదాశ్చర్యం చింతాయా విషయస్తథా ।**

ఉత్కృష్ట ప్రయోజనానికై సృష్టించబడిన మానవుడు నిమ్న యోనులలో తిరుగాడే ప్రాణులకంటే కూడా హీనస్థాయికి చెందిన మానసిక స్థితిని కల్గి, నికృష్ట ఆచరణలు ఆచరిస్తూ సృష్టి యెడల సంతులనాన్ని భంగం చేస్తున్నాడంటే నిజంగా ఇది అత్యంత దుఃఖదాయకమైన విషయం. ఇతర జీవధారులవలెనే మానవుడు కూడా కడుపే కైలాసంగా భావిస్తూ, దానికి తగినట్లే ఆలోచనలు ఆచరణలు సాగిస్తే, ఇంక భూమిపైన మానవ యోని యందు జన్మించికూడా ప్రయోజనమేముంది? ఈనాటి మానవుని భోగలాలస, సుఖసాధనాలు

**నిన్ను నిరుత్సాహపరచడానికి ఎవరికీ అవకాశం ఇవ్వకు.**

సమకూర్చకోవటానికి అతను పడుతున్న తాపత్రయం ఇవన్నీ చూస్తుంటే, సృష్టి సంతులనంపై, అతడనుకొనే సభ్యత, ప్రకృతి ఎంతటి దుష్ప్రభావాన్ని చూపుతాయో ఊహించటానికే భయంగా ఉంది. విచ్చలవిడిగా పెచ్చు పెరిగిన భౌతిక వాదం, రక్షించే వాడినే దానవునిలా భక్షించి వేస్తోంది. వాతావరణంలోని కాలుష్యం, అదృశ్యజగత్తులోని హాహాకారాలు ఇవన్నీ కేవలం మానవుని స్వయంకృతాలే తప్పించి వేరేమీ కాదు. ఆ స్వయంకృతాపరాధాలనే వ్యక్తి వివిధ విధాలుగా అనుభవించవలసి వస్తోంది. చరిత్ర పుటలు తిరగవేస్తే ఇలాంటి ఉదాహరణలు అనేకం ఉన్నాయి. కొన్ని ఉదాహరణలు చూద్దాం.

**కథ – 3** : రావణుడు విద్వాంసుడు, తపోబలసంపన్నుడు. అనేక శక్తుల్ని సామర్థ్యాన్ని సంపాదించి పెట్టుకొన్నవాడు. అయినా హీనమైన ఆలోచనలు, ఆచరణలు అతనిలో ప్రవేశించగానే సాక్షాత్తు భగవంతుడే అవతారం దాల్చి దిగివచ్చి అతన్ని సంహరించక తప్పలేదు. ఇలాగే భస్మాసురుడు, బాణాసురుడు, హిరణ్యాక్షుడు, హిరణ్య కశ్యపుడు లాంటి బలవంతులు తపోశక్తి సంపన్నులు కూడా తమ రాక్షస ప్రవృత్తుల కారణంగా మరణించారు.

శుంభ–నిశుంభులు, మధుకైటభ–మహిషాసురులు, దుర్గాదేవిచే చంప బడ్డారు. సహస్రబాహుడు పరశురాముని చేత, బాణాసురుడు శ్రీ కృష్ణుని చేత, జరాసంధుడు భీమునిచేత వధించబడ్డారు. ఋషులను వేధించే శూర్పణఖ, ఖర–దూషణాదులు, తాటకి, తమ్ముని రాజ్యభ్రష్టుని చేసి అతని భార్యని చేబట్టిన వాలి, వీరందరినీ సంహరించి రామలక్ష్మణులు రాక్షసత్వాన్ని హతమార్చారు.

ఉన్నత స్థితికి చేరిన మానవుడు కూడా దుర్బుద్ధికి వశమై తనకి తానే గొయ్యి తవ్వుకొంటాడు. అలా దుర్బుద్ధికి వశం కావటానికి కారణం ఏమిటి ? అనేది సాధారణమైన బుద్ధికి అందే విషయం కాదు. మానవుడు ఈ విధంగా దిగజారడం అనే విషయం వెనుక బలమైన కారణం ఉండితీరాలి. అదేమిటో తెలుసుకోవాలని మీ అందరకు చాలా కోరికగా ఉన్నది. త్రికాలజ్ఞులు, తత్వవేత్తలు అయిన మీరే ఈ తెలియని విషయాలను తెలియజేయగల సమర్థులు" అంటూ అష్టావక్రుడు పిప్పలాద మహర్షికి నమస్కరించగా, మహర్షి అతని జిజ్ఞాసతో పాటు ప్రశ్న యొక్క గంభీరతను కూడా గుర్తించాడు.

ఏదో కొద్దిపాటి సాధారణ చర్చతోనే జిజ్ఞాసువులను ఈ ప్రకరణం సమాధాన పరచగల్గి ఉన్నట్లయితే ప్రజ్ఞాశిబిరంలోని విద్వాంసులు ప్రశ్నలను లేవదీసే ప్రసక్తేలేదు. ఇది ఋషిపరంపర. **కాలానికి సంబంధించిన అసాధారణ మానవ స్థాయితో జోడింపబడి ఉన్న "ప్రశ్నలు", తత్వజ్ఞానం యొక్క మర్మాన్ని ఎరిగిన ప్రజ్ఞావంతుల ద్వారా, "ఆ ప్రశ్నలకు సమాధానాలు" ఈరెండు అదృశ్యజగత్తులో అనుకూల వాతావరణాన్ని నిర్మిస్తూ ఉంటాయి.** జనక–యాజ్ఞవల్క్య సంవాదం, గరుడుడు–కాకాభుశుండి సంవాదం, సూత–శౌనక సంవాదం ఇవన్నీ ఈ ప్రయోజనం కోసం ఏర్పాటు చేయబడినవే. ఇలానే ఆర్షగ్రంథకర్తలు పరస్పర వార్తాలాపాల ద్వారా అనేక సమస్యలకు పరిష్కారాలు అందజేశారు.

పిప్పలాద మహర్షి అష్టావక్రునితో ఇలా అన్నారు, "ఓ మహాభాగా! నీ ప్రశ్న కేవలం ఆధ్యాత్మ తత్వ జ్ఞానం యొక్క సత్యానికి, సారానికే పరిమితమైనది కాదు. లోక కల్యాణానికి కూడా సంబంధించిన ప్రశ్న.

**యుద్ధాలను మనం పాతిపెట్టాలి; లేకపోతే అవి మనల్ని పాతిపెడతాయి.**

ఈ నీ ప్రశ్న నా సమాధానం విన్న ప్రతివ్యక్తి విపత్తుల విషవలయం నుండి బయటపడి శ్రేయోమార్గంలో పయనించగల సామర్థ్యాన్ని పొందుతారు. సమస్త సత్యాన్ని అవగాహన చేసుకోగల్గుతారు. కాబట్టి సావధానులై వినండి. సాధక వృత్తి చేపట్టిన మీరు ఈ నా కథలను విన్నట్లైతే దీనిని నూటికి నూరుపాళ్ళు సార్థకం చేస్తారు."

**కథ -4**: వీతరాగుడైన శుకదేవుని వాణి ద్వారా భాగవత పురాణ కథలు విన్న పరీక్షిత్తు ముక్తి పొందిన విషయాన్ని విని, ఒక ధనవంతుడు తానుకూడా ముక్తి పొందాలని ఆశించి భాగవత శ్రవణానికి ఏర్పాట్లు ప్రారంభించాడు. ప్రయత్నించగా ఒక ఖ్యాతి చెందిన విద్వాంసుడు భాగవత పఠనానికి అంగీకరించాడు. ఇది కలియుగం కాబట్టి ప్రస్తుతం ధార్మిక కర్మకాండలవల్ల దక్కే పుణ్యం నాలుగో వంతుకి పడిపోయిందనీ కాబట్టి భాగవతం 4 సార్లు వినాలనీ, దానికి తగినట్లే తనకి దండిగా దానదక్షిణలు ఇవ్వాలనీ కూడా విద్వాంసుడు నిర్ణయిస్తాడు. ధనవంతుడు అంగీకరిస్తాడు. కానీ చివరకు ఫలితం శూన్యం కావటం వల్ల ధనవంతుడు చింతిస్తూ ఒక మహాత్మునికి విషయాన్ని వివరించి, 4 సార్లు భాగవతాన్ని విన్నా ఫలితం దక్కక పోవటానికి కారణం చెప్పుమని ప్రార్థిస్తాడు. విషయం విన్న మహాత్ముడు నిర్వికార భావంతో **"నాయనా, మృత్యుముఖంలో ఉన్న పరీక్షిత్తు ప్రపంచం పట్ల పూర్తి వైరాగ్యంతో ఉండి పురాణకథల్ని విన్నాడు. అలాగే వీతరాగుడైన శుకుడు ప్రతిఫలా పేక్ష లేకుండా భాగవత పారాయణ చేశాడు. అందుకే నూటికి నూరుపాళ్ళు ఫలించింది,"** అని చెప్పగానే ధనవంతుని అజ్ఞానం తొలగింది. మహాత్మునికి చేతులు జోడించాడు.

**కథ -5** : **దా**రిదోపిడి చేసే వాల్మీకిని, "నీ ఆర్జనతోపాటు నీ పాప ఫలం కూడా నీ భార్యాబిడ్డలు పంచుకొంటారా?" అడిగి రమ్మని సప్తమహర్షులు పంపినపుడు భార్యాబిడ్డలు నిరాకరిస్తారు. తక్షణం వాల్మీకి తన జీవితమార్గాన్ని మళ్ళిస్తాడు. ఆత్మప్రగతికి ఋషులు మంత్రోపదేశం చేస్తారు. దృష్టి కోణాన్ని మార్చుకొని, ఆత్మ ప్రగతికి ప్రయత్నించగానే నరక కూపంలోకి కూరుకుపోతున్న దోపిడి దొంగ మహర్షిగా మారి ఆదికవిగా చరిత్రలో చిరస్థాయిగా నిలిచిపోయాడు.

**కథ -6** : **ఒ**క మహాత్ముడు ఒక సభలో ప్రభువుని శరణన్న వారు పొందే సత్ఫలితాల గురించి, దుష్కర్మాచరణ వల్ల అనుభవించవలసిన దుష్ఫలితాల గురించి వివరిస్తూ ఉంటాడు. ప్రవచనం పూర్తి కాగానే అవకాశం చూసి అందర్నీ దోచుకోవాలనే సంకల్పంతో ఒక బందిపోటుకూడా ఆ సభలో వేచి ఉన్నాడు. కానీ మహాత్ముని నోటి ద్వారా విన్న ప్రవచనం అతన్ని కదలించివేసింది. అంగుళిమాల, అజామీలుడు, బిల్వ మంగళుడు మొదలైన వారి కథలు అతన్ని కలచివేశాయి. తన పాపకర్మల పట్ల పశ్చాత్తాపం చెందుతూ వెళ్ళి, ఆ మహాత్ముని పాదాలమీద వ్రాలిపోయాడు. అతను చేసిన పాపాలకు ప్రాయశ్చిత్తం జరిపించి, భవిష్యత్తులో మంచి మార్గాన్ని మహాత్ముడు అతనికి చూపిస్తాడు. ఈ విధంగా ఆ బందిపోటు ప్రభుభక్తి పరాయణుడుగా శేషజీవితాన్ని గడపటమే కాక, పాపకర్మల ద్వారా తాను తవ్వుకొన్న గోతిని కూడా **పరమార్థం, సేవ** – వీటి ద్వారా పూడ్చి వేసుకొంటాడు.

**కొండంత బోధన కన్న గోరంత సాధన మిన్న.**

**కథ -7** : హరిశ్చంద్ర నాటకం అనేకులు అనేకసార్లు చూసి ఉంటారు. అభినయించేవారు కూడా అనేకసార్లు అభినయించి ఉంటారు. కానీ ఒకనాడు అదే నాటకం **మోహన్‌దాస్ కరంచంద్ గాంధీ** అంతరంగాన్ని కదలించి వేసింది. సంఘటనలు, సంభాషణలు ఇలా అంతరంగాలను తాకినపుడు మాత్రమే వ్యక్తిని శ్రేయోమార్గం లోకి లాక్కొనిపోతాయి. ప్రగతిపథం వైపు పరుగులు పెట్టిస్తాయి. మోహన్‌దాస్ ఆ నాటకం ద్వారా పొందిన ప్రేరణవల్లనే చివరివరకు సత్యాన్ని ఆశ్రయించి, **"జాతిపిత మహాత్మాగాంధీ"** అనే పదవిని అధిరోహించ గలిగాడు.

**శ్లో॥ భగవాన్నిర్మమే నృన్యచ్ఛక్తి సౌ విధ్య సంయుతాన్ ।**
**సువిధాం తత్ర స్వాతంత్ర్యాచ్చ యనస్యద సందదౌ ॥**
**దిశాం ధారాం జీవనంచ ప్రాప్తుంగతివిధిం తథా ।**
**స్వతంత్ర మకరోదన్యే ప్రాణినః ప్రకృతిం శ్రితాః ॥**

భగవంతుడు మానవునికి సమస్త శక్తులు సౌకర్యాలు ఇచ్చి పరిపూర్ణుడుగా పుట్టించటమే కాక ఒక విశేష సౌకర్యాన్ని కూడా ప్రసాదించాడు. అది ఏమంటే **ప్రాణులన్నీ ప్రకృతిని అనుసరిస్తున్నా కేవలం మానవుడు మాత్రం పూర్తి స్వాతంత్ర్యంతో తన దారిని, జీవన క్రమాన్ని, కార్యక్రమాలను ఇష్టం వచ్చినట్లు నిర్ణయించు కోవటానికి సర్వాధికారాలు ఇచ్చాడు.** అతనిపై భగవంతుని ఆధిపత్యం ఏమీలేదు. ఈ సౌకర్యం కేవలం మానవునికే ప్రసాదించాడు పరమాత్ముడు.

**కథ -8** : సర్వ ప్రాణులను తన వశంలో ఉంచుకొంటాడు కాబట్టి మానవుడే శ్రేష్ఠుడని కొందరు, ఏ ప్రతిఫలం ఆశించకుండా మానవునికి సమస్త సేవలు చేస్తాయి కాబట్టి మిగతా ప్రాణులే శ్రేష్టమైనవని కొందరు, ఒక సభలో వాదించుకొంటున్నారు. ఇంతలో అక్కడ ఒక జ్ఞాని రావటం వీరందరూ చూస్తారు. న్యాయనిర్ణయం చేయుమంటూ అతని ముందుకు పరుగెడతారు.

జ్ఞాని ఇరుపక్షాల వాదన విని "ఓ సోదరులారా! మానవుని స్వాతంత్ర్యానికి ఒక హద్దు అనేది ఉన్నది. అతను సత్కార్మాచరణ చేస్తూ ఉన్నంతవరకు మాత్రమే శ్రేష్ఠుడు. సత్కర్మాచరణ కుంటుపడితే జంతువులకంటే కూడా హీనుడు. కాబట్టి మీరు ఇలాంటి చర్చ, సందేహం వచ్చినపుడు, న్యాయ నిర్ణయం చేయవలసి వచ్చినపుడు మానవుని బుద్ధిని పరీక్షించండి. జీవించే కళను అర్థం చేసుకున్న మానవుడు మాత్రమే శ్రేష్ఠుడ"ని చెప్పి జ్ఞాని ముందుకు సాగిపోతాడు.

**కథ -9** : **రా**వణుడు, విభీషణుడు ఒకే కులానికి చెందినవారు, సోదరులు, విద్వాంసులు, పరాక్రమవంతులు. కానీ ఒకరు తన మార్గాన్ని తనకు తోచినట్లు విపరీత దిశగా నిర్ణయించుకొంటే, మరొకరు ప్రవాహానికి ఎదురీది అవినీతిని ఎదుర్కొనటానికి సాహసిస్తారు. **"దిశాధారలను మళ్ళించగలిగే శక్తి సామర్థ్యాలను దైవం మనిషికి ఎందుకిచ్చాడంటే తనకు సహాయకారిగా ఉండటానికి మాత్రమే"** దీనితో పాటు దైవం మనిషిని తనకు కావలసినట్లు వరాలను కోరగల అధికారం అవకాశం కూడా ప్రసాదించాడు. ఏది అడిగినా కాదనకుండా

ప్రసాదించాడు. శివభక్తుడైన రావణుడు తన దైవాన్ని సమస్త సామర్థ్యాన్ని ఇవ్వుమని ఒకవైపు కోరుతూనే మానవుని చేతిలో చావాలని కూడా కోరుకుంటాడు. అతని కోరిక మేరకు భగవంతుడు రాముడుగా మానవుడుగా దిగివచ్చి అతని అవినీతిని, అహంకారాన్ని సంహరించాడు.

మహా విద్వాంసుడు, అసాధారణమైన అధికారాలు కల్గినవాడు అయినా వినాశనం తప్పదని తెల్సిన తరువాతకూడా తన ఇష్టదైవమైన పరమ శివుని సత్పరామర్శ చేయాలంటే అతనికి అహంకారం అడ్డు వచ్చింది. తరువాత పర్యవసానం తెలిసినదే. వ్యక్తి ఇష్టాలకు, కోర్కెలకు పరిపూర్ణమైన స్వాతంత్ర్యాన్ని ఇచ్చి వదలివేయటం దైవం యొక్క సహజ స్వభావం. కాబట్టి లభించే ఫలితాలు వ్యక్తి కోర్కెలకు, ఇష్టాలకు అనుగుణంగానే ఉంటాయని పై కథ తెలియజేస్తోంది.

వాస్తవానికి జీవుడు నీటి బిందువులాగ భూమిమీదకు వస్తాడు. నీటి బిందువు ధూళిలో పడినట్లు జీవుడు మాయలో పడతాడు. కానీ నీటిబిందువు సముద్రంలోపడి సముద్రంగా మారి, మేఘాలను చేరి సర్వత్రా వ్యాపించి, పరమార్థ పరాయణురాలిగా వర్షించినట్లే, జీవుడు కూడా మాయనుండి బయటపడి ఆత్మవిస్తరణ ద్వారా సర్వవ్యాపి కావాలి. మానవునికి విశిష్ట ఉపలబ్దిని ప్రసాదించి, మానవుడు వాటిద్వారా ఊర్ధ్వగామి కావాలని దైవం ఆశించాడే గాని, అథోమార్గాన్ని ఎంచుకొంటాడని దైవం అసలు ఊహించిఉండడు పాపం!

ఇతర జీవజంతువుల కార్యక్షేత్రం తినటం, కనటం, విసర్జించటం వరకే పరిమితమైనా, అవి దైవంయొక్క విధివిధానాల కనుగుణంగా ప్రాకృతిక జీవనాన్ని సక్రమంగానే నిర్వర్తిస్తున్నాయి. కానీ మానవులే దూరదృష్టి లేకుండా జీవితాలు గడిపేసి చివరకు పశ్చాత్తాపంతో తల బాదుకొంటున్నారు. మానవ జీవితం యొక్క "ముగింపు" పాకంలో పడిన ఈగలాగ, జాలరి గాలానికి తగులుకొన్న చేపలాగ అవటం అత్యంత శోచనీయం.

**శ్లో॥ అస్యాః స్వతంత్రతా యాస్తూపయోగం కః కథం మునే ।**
**కరోతి సంముఖే సేయం పరీక్షా పద్ధతిః స్థితా ॥**

**ఓ** మునీశ్వరా! మానవునికి ఇవ్వబడిన స్వాతంత్రాన్ని ఎవరు ఏ విధంగా ఉపయోగించుకొంటారనే పరీక్షా పద్ధతి ప్రతివ్యక్తి ముందు ఉన్నది. ఇచ్చిన అధికారాన్ని దుర్వినియోగం చేస్తే "జీవితంలో ఓడిపోవడం" అంటే దుర్గతి పొందటం, తప్పదు. అలాకాక తన లక్ష్యాన్ని తెల్సుకొని మనవోచిత స్థాయికి తగినట్లు నిశ్చితమైన ప్రణాళికను వేసుకొని, **ఆత్మకల్యాణం-పరమార్థ పరాయణత అనే రెండు ఎడ్లను జీవిత శకటానికి కట్టి లాగితే, ఆ బండి తప్పకుండా సద్గతిని ప్రాప్తింపచేసి, గమ్యాన్ని చేరుస్తుంది.** కాబట్టి ప్రతి వ్యక్తికి ఎట్టెదుట ఈ రెండు మార్గాలు ఉన్నాయి.

**కథ -10** : మహాభారత యుద్ధంలో కౌరవులు, పాండవులు కూడా కృష్ణుని సహాయాన్ని ఆశించారు. దుర్యోధనుడు, అర్జునుడు కృష్ణపరమాత్మ వద్దకు వెళతారు. ముందుగా వచ్చిన అహంకారం వల్ల దుర్యోధనుడు కృష్ణుని శిరస్సు వద్ద కూర్చుంటాడు. అర్జునునిలో గల శ్రద్ధా భక్తులు అతన్ని కృష్ణుని పాదాల వల్ల కూర్చోపెడతాయి.

మేల్కోన్న కృష్ణుని చూపు అర్జునునిపై పడింది. కానీ ముందుగా రావటం వల్ల నా మాట వినుమంటాడు దుర్యోధనుడు. కృష్ణుడు సందిగ్ధంలో పడి "చిన్నవాడు కాబట్టి ప్రాధాన్యత అర్జునుని కిచ్చి, కోరిక నీది తీరుస్తాను" అంటాడు. "ఒక సేనవైపు నేను, రెండవ సేనవైపు నా సమస్త చతురంగబలం ఉంటుంది. చెప్పు అర్జునా! నీకేది కావాలో" అని ప్రశ్నిస్తాడు. భగవంతుని కృప ఎవరు కోరుకోరు? వైభవం ఎవరు కోరుకుంటారు? అనేది మళ్ళీ వారి బుద్ధిమీద, వివేకం మీదనే ఆధారపడి ఉంటుంది.

"యుద్ధం చేయక పోయినా నీవే కావాలి కృష్ణా" అంటాడు అర్జునుడు. అర్జునుని మూర్ఖత్వానికి ఆనందించి, సమస్త సైన్యాన్ని తీసుకొని దుర్యోధనుడు పరమానంద భరితుడవుతాడు. కానీ అవినీతిని ఆశ్రయించిన దుర్యోధనుడు సమస్త సేనలతో తరలి వచ్చినా, ఈశ్వర శక్తిని గుర్తించిన పాండవుల చేతిలో బంధు మిత్ర సమేతంగా యుద్ధంలో మరణించాడు. దుర్యోధనుని వంటి నిర్ణయాలు తీసుకొనే శక్తి, అర్జునునిలా ఈశ్వరకృపను ఎన్ను కోవాలనే శక్తి, ఈ రెండు శక్తులు ప్రతి వ్యక్తిలోను ఉన్నాయి. **ఒకదాన్ని వివేకం లేక సద్బుద్ధి అంటారు. రెండవ దాన్ని అవివేకం లేక దుర్బుద్ధి అంటారు. ఎన్నుకొనే శక్తినే స్వాతంత్ర్యం అనవచ్చు.**

**కథ -11** : **నచికేతుని** శ్రద్ధకు నిష్టకు ప్రసన్నుడైన **యముడు** అతన్ని 3 వరాలు కోరుకోమంటాడు. మృత్యు భయంనుండి బయటపడవేయుమని కోరవలసిన పరిస్థితులో ఉండికూడా, నచికేతుడు తన తండ్రికోపం శాంతింప చేయుమని మొదటివరం కోరుకుంటాడు. ఆత్మయొక్క యదార్థ స్వరూపాన్ని తెలియజేసి, ఆత్మజ్ఞాన ప్రాప్తికి ఏదైనా ఉపాయం చెప్పుమని రెండవ వరం కోరతాడు. మూడవ వరానికి తనకి పాత్రత లేదని భావించి యముడు ఎన్ని ప్రలోభాలు చూపినా సరే నచికేతుడు "ఆత్మతత్వం", "మరణం తరువాత ఆత్మయొక్క అస్తిత్వం" వీటికి సంబంధించిన జ్ఞానం తప్పించి, వేరేది కోరడు. ఒకవైపు సుఖభోగాలు, ముక్తి పునర్జన్మ వంటి అనేక లాభాలు ఉన్నప్పటికి, ఆత్మవిద్య – బ్రహ్మ విద్యకు సంబంధించిన జ్ఞానాన్ని తెలుసుకోవటానికి నచికేతుడు ప్రాధాన్యత నిస్తాడు. పంచాగ్ని విద్యను సాధనా మార్గంలో మార్గదర్శనం చేయటంలో అతడు సఫలీకృతుడయ్యేడు. ఇలాంటి భాగ్యశాలురు చరిత్రలో చాలా అరుదుగా ఉంటారు.

**కథ -12** : **శృతాయుధుడు, భస్మాసురుడు** ఈ ఇద్దరు రాక్షసులకు తపస్సు ద్వారా ఇచ్ఛానుసారం కోరిన వరాలు ప్రసాదించబడ్డాయి. అవి ఎంత భయంకరమైనవి అంటే, చివరకు ఆ వరాలే వారి మృత్యువుకి కారణం అయినాయి. ఇది దుర్బుద్ధి కాక మరేమిటి? శృతాయుధుని వద్ద శంకరుని ద్వారా పొందిన గద ఉన్నది. కానీ దానిని అతడు అవినీతిగా ఉపయోగించరాదు. మహాభారత యుద్ధంలో అతడు కోపం పట్టలేక ఆ గదను సారధిగా ఉన్న కృష్ణునిపై ప్రయోగిస్తాడు. గద మధ్యలోనే వెనక్కి తిరిగివచ్చి శృతాయుధుణ్ణి సంహరించింది. భస్మాసురుడు కూడా తాను ఎవరి తలపై చేయివేస్తే వారు భస్మం కావాలని కోరతాడు. ఈ వరాన్ని దురుపయోగం చేయటం మొదలిడగానే భగవంతుడు మాయపన్ని అతన్నే భస్మం చేస్తాడు.

**ఇది ఎన్నికల దిశాధార. ఇదే మానవుని ఉన్నతిని, పతనాన్ని, ఓటమిని, గెలుపునూ నిర్ధారణ చేస్తుంది.**

**కథ -13** : ఒక రాజ్యంలోని ప్రజలు తాము ఎన్నుకొన్న వ్యక్తినే రాజసింహాసనం అధిరోహింప చేస్తారు. 10 సంవత్సరాల కాలం అతడు రాజ్యాన్ని పాలించిన తరువాత అతడిని అన్నం, నీరు లభించని ఒక భయంకరమైన

శూన్యద్వీపంలో వదిలివేస్తారు. ఈ నియమం ప్రకారం ఎందరో రాజులు తమ ప్రాణాలు కోల్పోయేవారు. రాజ్యాన్ని పాలించే కాలంలోకూడా వారికి తమ భవిష్యత్తు గురించిన చింత వేధిస్తూ ఉండేది. ఇలాంటి పరిస్థితులలో ఒక తెలివైన వ్యక్తి రాజుగా ఎన్నుకోబడ్డాడు. అతడు రాజ్యాన్ని పాలించే 10 సంవత్సరాల కాలంలోనే ఇటు రాచకార్యాలతో బాటు ఆ భయంకర ద్వీపాన్ని కూడా సాగుచేయించి, జలాశయాలు త్రవ్వించి నివాస యోగ్యంగా తయారుచేయించాడు. ఆ ద్వీపం అత్యంత రమణీయంగా రూపుదిద్దుకొన్నది. తన రాజ్య పరిపాలనాకాలం పూర్తికాగానే రాజు ఈ ద్వీపానికిపోయి సుఖంగా జీవించసాగాడు.

జీవితంలో కొంతకాలం స్వేచ్ఛగా నిర్ణయాలు తీసుకొనే అవకాశం ప్రతివ్యక్తికీ లభిస్తుంది. ఆ కాలాన్ని సద్వినియోగం చేసుకొని ఎవరైతే భవిష్యత్తును కూడా ఆనందదాయకంగా గడపటానికి ఏర్పాట్లు చేసుకొంటారో వారు దూరదృష్టికల రాజులా సుఖశాంతులతో జీవిస్తారు.

**శ్లో॥ విస్మరంతి స్వరూపం యేత్యక్త్వాచోత్తర దాయితాం ।**
**యైః పతన్తితు పాతస్యగర్తే తే నిశ్చితం నరాః ॥**

"ఆత్మస్వరూపాన్ని, వ్యక్తిగత బాధ్యతలను విస్మరించిన వ్యక్తులు పతనం కాకుండా తప్పించుకోలేరు". ఆత్మయొక్క స్థాయిని, తమలో దాగియున్న శక్తులను అందరూ గుర్తించలేరు. ఆత్మబోధ కలిగిన వ్యక్తులు మాత్రమే తమ స్వరూపాన్ని అర్థం చేసుకొని, దానికి తగినట్లు తమ జీవిత ప్రణాళికను తయారు చేసుకొని కృత కృత్యులవుతారు.

**కథ -14** : ఒక నక్క అప్పుడే పుట్టిన సింహం పిల్లను తెచ్చి తన పిల్లలతో కలిపి పెంచసాగింది. అలా వాటితో కలిసి పెరిగే సింహంపిల్ల తన స్వరూపాన్ని గుర్తించకుండానే పెరిగి పెద్దదయింది. ఒకనాడు ఇవన్నీ కలసి ఆహారానికి అడవికి వెళ్ళాయి. చనిపోయిన ఏనుగుపై పడి ఇవన్నీ ఆహారాన్ని తింటూ ఉండగా వనరాజైన సింహం వాటి మీదికి ఉరికింది. నక్కపిల్లలు పారిపోగా సింహంపిల్ల మిగిలిపోయింది. దానిని చూసి సింహం "ఎవరు నీవు? వాళ్ళతో కలిసి ఉన్నా వెందుక"ని ప్రశ్నించింది. జవాబు చెప్పలేక భయంతో అయోమయంగా చూస్తున్న సింహంపిల్ల పరిస్థితిని సింహం అర్థం చేసుకొంది. మెల్లగా దానిని నీటివద్దకు తీసుకొనిపోయి నీటిలో దానికి తన ప్రతిబింబాన్ని చూపింది. అలాగే తాను పెద్దగా అరచి సింహం పిల్లను కూడా అరవమంటుంది. రూపం, అరువుకూడా సింహాన్ని పోలి ఉండడం చూసిన సింహం పిల్లకు మరిచిపోయిన ఆత్మస్వరూపం జ్ఞప్తికి వస్తుంది. తరువాత ఇది సింహాలతో కలిసి హాయిగా భీతిలేని జీవితం గడపసాగింది.

ఇలాంటి ప్రజల సంఖ్య సమాజంలో అత్యధిక సంఖ్యలో ఉన్నది.

**కథ -15** : ఒక యువకునికి తాను మహారాజు అయినట్లు తనకు పెద్ద రాజ్యం లభించినట్లు కల వచ్చింది. ఈ ఆకస్మిక రాజ్య ప్రాప్తి అతడిని ఆనంద పరశుడిని చేస్తుంది. కానీ తెల్లవారగానే తండ్రి ఏదో పని చెప్పి త్వరగా చేసి రమ్మంటాడు. తల్లి అడవికి వెళ్ళి కట్టెపుల్లలు తీసుకొని రమ్మంటుంది. భార్య బజారు పని చెబుతుంది. కాని యువకుడు వీరందరి మాటను త్రోసిపుచ్చుతూ, నేను మహారాజుని, ఇలాంటి పనులు చేయను పొమ్మంటాడు.

**విప్లవం లేని జీవితం మృత్యువుతో సమానం.**

ఇంట్లో వారంతా ఈ వింత ధోరణికి ఆందోళన పడ్డారు. ఎలాగో వారే పనులన్నీ పూర్తి చేసుకొని భోజనాలు ముగించారు. ఈ రాజుగారు మాత్రం మిగిలిపోయారు. ఎవరూ భోజనానికి పిలవకపోవటంతో చూచి చివరకు ఆకలిబాధ తాళలేక చెల్లెల్ని పిలిచి భోజనం పెట్టుమంటాడు. ఆమె ముఖం త్రిప్పుతూ "అయ్యో! రాజాధిరాజా! మా ఎండు రొట్టెలు మీ ఒంటికి సరిపడవు. కాస్త ఆగండి. చీకటిపడితే అప్సరసలు పై నుండి దిగివచ్చి మీకు తగిన భోజనం వడ్డిస్తారు" అని చెప్పి వెళ్ళిపోతుంది.

వ్యర్థమైన ఊహాజగత్తులో విహరించే యువకుడు తన తప్పు తెలుసుకొని ఓటమిని అంగీకరిస్తాడు.

**శ్లో॥ సదువ యుంజతే యేతు సౌభాగ్యం ప్రస్తుతం క్రమాత్ ।**
**ఉద్గచ్ఛంతి తథాయాంతి పూర్ణతాం లక్ష్యగాం సదా ॥**

ఎట్టెదుటనున్న కాలం తిరిగి మరలా మరలా రాదు. అలాగే ఈ మానవ జీవితం కూడా మళ్ళీ మళ్ళీ లభించదు. కానీ దురదృష్టం వల్ల చాలామంది అరుదైన ఈ రెండిటినీ కూడా సద్వినియోగం చేసుకోరు. ఈ రెండింటి విలువ గ్రహించి సముచితంగా ఉపయోగించుకోగలవారు క్రమంగా ఎత్తుకు ఎదిగి, చరమ లక్ష్యాన్ని చేరుకొంటారు.

**కథ -16** : ఒక రాజుకు వికృతమైన సంతానం కల్గింది. ప్రజల హేళన, అక్షేపణలవల్ల రాజదంపతులు సంతానాన్ని చూచి చాలా దుఃఖిస్తారు. రాను రాను ఇంట్లో వారి తిరస్కారం, నిర్లక్ష్యం కూడా ఎదురవటంతో కుబేరుడను పేరుగల ఈ వికృత బాలకుడు వ్యథ చెంది, "రూపం ఎలా ఉన్నా, మానవుడు తనకు ప్రాప్తించిన జీవితం అనే సంపదను సద్వినియోగం చేసినపుడే అతడు మహోన్నతుడు కాగలడు అనే సత్యాన్ని మానవ సముదాయానికి తెలియబరుస్తా" నని ప్రతిజ్ఞ చేస్తాడు. శరీరం రూపంలో లభించిన సంపద కాక, మనోరూపమైన సంపద గొప్పది. దాన్ని ఆర్జించాలని నిశ్చయించుకొని కఠోర తపస్సు ప్రారంభిస్తాడు. అతని దీక్ష, పట్టుదల ప్రభావంతో అతడు ఈ సాధనలో అతని తండ్రిని, తాతను కూడా విలీనం చేస్తాడు. దేవతలు అతని దీక్షకు, యోగ్యతకు మెచ్చి అతన్ని వారి సమస్తసంపదకు అధిపతిని చేస్తారు. ఈ విధంగా అతడు అలకాపురిని పాలించనారంభిస్తాడు.

**కథ -17** : **తా**ను ఎక్కిన కొమ్మను తానే నరుక్కొనేంతటి పరమ మూర్ఖుడు **కాళిదాసు**. విదుషీమణి **విద్యోత్తమ** ద్వారా రాజసభలో అవమానించబడిన విద్వాంసులు కురూపి, పరమమూర్ఖుడు అయిన కాళిదాసుతో ఆమె వివాహం జరిపించాలని కుట్ర పన్నుతారు. కుటిలత్వంతో కాళిదాసును మహావిద్వాంసుడుగా నమ్మించి, చివరకు ఆ మూర్ఖుని ముందు విద్యోత్తమ తన ఓటమి అంగీకరించేలాచేసి, వివాహం జరిపిస్తారు. ఆ విషయం తెలుసుకున్న విద్యోత్తమ మోసాన్ని భరించలేక కాళిదాసును ఇంటినుండి వెడలగొట్టింది. ఇల్లు వదిలేముందు ఆమె నోటి నుండి వెలువడిన పరుషవాక్యాలు కాళిదాసు హృదయంలో గుచ్చుకొన్నాయి. తన జ్ఞానాన్ని వృద్ధి చేసుకోవాలని దృఢంగా నిశ్చయించుకొంటాడు. అతని దీక్ష, కృషి కారణంగా కాలాంతరంలో పరమమూర్ఖుడే మహాకవి కాళిదాసుగా సాధన పూర్తిచేసి, విద్యోత్తమను కల్సుకొంటాడు.

**అజ్ఞానాన్ని మించిన కీడు చేసేది నిర్లక్ష్యం.**

**కథ -18** : జీవితం అంటే కాలం. మరేదోకాదు. ఈ కాలాన్ని మించినది మరేదీ లేదు. యుధిష్ఠిరుని జీవితంలో ఒక సంఘటన చూద్దాం.

ఒకరోజు ఒక బ్రాహ్మణుడు యుధిష్ఠిరుని వద్దకు వెళ్ళి ఏదైనా దానం ఇవ్వుమని కోరతాడు. రాచకార్యాలలో నిమగ్నమైన ధర్మరాజు బ్రాహ్మణుని మరునాడు వచ్చి తీసికెళ్లుమంటాడు. ఇది గమనించిన భీమసేనుడు వెంటనే సేవకులను పిలిచి మంగళవాద్యాలు మ్రోగించుమంటాడు. తాను స్వయంగా దుందుభి మ్రోగిస్తాడు. వాద్యాల ధ్వని విని కారణం ఏమిటంటూ ధర్మరాజు స్వయంగా వస్తాడు. భీమసేనుడు అన్నగార్ని చూసి, "అన్నా ! నీవు కాలాన్ని జయించావు. అందుకే ఈ మంగళ వాద్యాలు. బ్రాహ్మణుని రేపు రమ్మన్నావు, అంటే కాలం రేపటి వరకు నీ ఆధీనంలో ఉన్నట్లేగా" అంటూ ఇంకా విశదంగా చెప్పాడు. విషయం అర్థం చేసుకొన్ని ధర్మరాజు భీముణ్ని చూచి చిరునవ్వు నవ్వి, మంచి పనులు వాయిదా వేయటం మంచిదికాదు. నిజమే, బ్రాహ్మణుని వెనక్కి పిలిచి కోరినది ఇచ్చి పంపుమని ఆజ్ఞాపిస్తాడు.

శ్లో॥ **ప్రత్యక్షం దేవతానూనం జీవనం యత్తు దృశ్యతే ।**
**దేవానుగ్రహ రూపంచ యే తథారాథయన్తితు ॥**
**తే ఽధికాః ప్రాప్ను వన్త్యుచ్చా ఉపలబ్దీః శనైః శనైః ।**
**దురుప యుంజతే యే తే నరా నిఘ్నంతి స్వాంగతిమ్ ॥**
**ఆత్మహంతార ఇవచ దుర్గతిం ప్రాప్నువంతి తే ।**
**నహి తాన్ కశ్చిదన్యోపి సముద్ధర్తుం భవేత్ ప్రభుః ॥**

జీవితం అనేది దైవం యొక్క ప్రత్యక్ష స్వరూపం. ఈశ్వరానుగ్రహానికి మరోపేరే జీవితం. ఈ **జీవితాన్ని పరమేశ్వరునిగాను, ఈశ్వరానుగ్రహంగాను గుర్తించి, సద్వినియోగం చేసుకొన్నవారు ఉన్నత స్థాయికి చెందిన సమస్త లాభాలు పొందగల్గుతారు. దుర్వినియోగం చేసుకొన్న వారి ఎట్టెదుట పతనం, పరాభవం, దుర్గతి నాట్యం చేస్తా**యి. వారిని ఎవ్వరూ ఉద్ధరింపజాలరు.

**మానవుడు తాను తవ్వుకొన్న గోతిని పూడ్చుమంటూ, కోరికలు తీర్చుమంటూ ఎక్కడో ఉన్న దేవతల్ని యాచిస్తాడే గానీ, ఎట్టెదుటనున్న ఆత్మదేవత పట్ల ఏ మాత్రం దృష్టిపెట్టడు. జీవితాన్ని దైవంగా గుర్తించి సద్వినియోగం చేసుకోవటం కంటే వేరే దైవారాధన లేనేలేదు.** ఇలాంటి వారు అడుక్కోకుండానే అన్ని లాభాలు, సౌకర్యాలు వారి కాళ్ళ దగ్గరకు వచ్చి పడతాయి. దుర్వినియోగం చేసుకునే వారికి ఇలానే శిక్షకూడా తప్పదు మరి.

**మనుష జన్మ అమోల్ హై, హోయన దూజీబార్ ।**
**పక్కాఫల్ జో గిర్‌పడా, లగేన దూజీబార్ ॥**

**కథ -19** : ఒక వ్యక్తికి ఒక మహాత్ముని ఆశీర్వాదం వల్ల 7 రోజుల పాటు పారసమణిని ఉపయోగించుకోగల అవకాశం లభిస్తుంది. పారసమణితో ఏ లోహాన్ని తాకినా ఆ లోహం బంగారంగా మారుతుంది. కాబట్టి

**డబ్బుకోసం సద్గుణాన్నీ, అధికారం కోసం స్వేచ్ఛను అమ్ముకోవద్దు.**

వీలైనంత చవుకబారు లోహాన్ని కొనితెచ్చి మణితో బంగారంగా మార్చాలనే అన్వేషణలో 7 రోజులు గడిపేస్తాడు. లోహం లభించకుండానే 7 రోజులు గడచిపోయాయి. మహాత్ముడు మణిని తిరిగి తీసుకొంటాడు.

పారసమణిలాంటి జీవితాన్ని మనం కూడా విషయ వాంఛల వెదకులాటతో వ్యర్థంగా గడిపేసి గడువు తీరగానే వదలి వేస్తున్నాం. జీవితాన్ని భౌతిక సంపదగా కాక, ఆత్మ సంపదగా మార్చుకోవాలనుకొనేవాడు, అవకాశాలను వదలుకోడు. ఆత్మావలంబనా జన్యమైన విభూతులే జీవికి సంతోషానిస్తాయి. మిగతా సంపదలు వైభవం అన్నీ అర్థవిహీనమైనవే.

**కథ -20** : **ఒ**క రాజు వేటకు వెళ్ళి, దారితప్పి ఆకలితో, దాహంతో తపిస్తూ ఒక వనవాసి గుడిసెను చేరుతాడు. అవసరానికి లభించిన అతని ఆతిథ్యం రాజుకి తృప్తినిస్తుంది. ఆనందంతో రాజు ఆ వనవాసికి ఒక చందనవనాన్ని కానుకగా ఇస్తాడు.

వనం లభించినా, చందనం గురించిన అవగాహన లేని వనవాసి చెట్లని కొట్టి బొగ్గుగా కాల్చి నగరంలో అమ్మి వచ్చిన దానితో జీవయాత్ర సాగించేవాడు. నెమ్మదిగా వృక్షాలన్నీ పోయి చివరకు ఒక్కచెట్టు మిగిలింది. ఆ రోజు వర్షం పడటం వల్ల బొగ్గుగా మార్చటానికి వీలుపడక కర్రలుగానే అమ్మటానికి నగరానికి తీసికొని వెళ్తాడు. ఆ సుగంధానికి ప్రభావితులైన నగర వాసులు విరివిగా ధనాన్నిచ్చి వాటిని కొనసాగారు. దానికి వనవాసి ఆశ్చర్యంతో నగరవాసులు ఇంత డబ్బులిస్తున్నారేమిటని ప్రశ్నిస్తాడు. ఇవి విలువైన చందనం కర్రలు ఇంకా ఉంటే తీసుకు రమ్మని ప్రజలు కోరతారు. వనవాసి తన అజ్ఞానానికి చింతించి, తాను చేసిన పనికి దుఃఖించసాగాడు. అది చూసి ఒక జ్ఞాని ఈయనను ఓదారుస్తూ – "నాయనా! లోకం అంతా నీలాగ అజ్ఞానంలోనే ఉంది. **జీవితం అనే చందన వనాన్ని కోర్కెలు, సుఖాలు అనే బొగ్గుగా మార్చి చౌక ధరకే అమ్మేస్తున్నారు.** కనీసం ఇప్పుడైనా నీవద్ద మిగిలిన ఒక్క చెట్టును సద్వినియోగం చేసుకో. ఆ మాత్రం చేసినా చాలు. అంతా పోగొట్టుకున్నా, తరువాతనయినా మానవుడు మిగిలిన దానిని కాపాడుకొన్నా చాలునని తెలియజేస్తాడు.

**కథ -21** : **ఒ**కపూలతోట లోనున్న మందిరంలో సుబ్రహ్మణ్యుడి ప్రతిమ, ఒక వీణ పెట్టబడి ఉన్నాయి. దైవదర్శనానికి వచ్చినవారంతా వీణను కూడ దర్శనం చేసుకుంటున్నారే గానీ, వాయించ ప్రయత్నించడం లేదు. ఒకరిద్దరు ప్రయత్నించినా కాపలాదారు అడ్డగించి ఆపివేస్తున్నాడు. ఈ విధంగా మధురమంజుల స్వరాలు పలకగల వీణ వృధాగా అక్కడే పడి ఉన్నది.

ఒక రోజు ఒక వ్యక్తి సాహసించి వీణను తీసుకొంటాడు. అందరూ వెళ్ళిన తరువాత నెమ్మదిగా లయబద్ధంగా మ్రోగించనారంభించాడు. మధురస్వరాలు నాల్గుదిక్కులా వ్యాపించాయి. భక్తులంతా వెనక్కి తిరిగి వచ్చి సంగీత రసాస్వాదనలో మునిగి పరవశిస్తూ ఉండగా గంటలు గడచిపోయాయి. వీణావాదనం ఆగినా ప్రజలు ఈశ్వరీయ ఆనందానుభూతిని పొంది మంత్రముగ్ధులై ఉండిపోతారు. ఆ విధంగా వీణ సార్థకమైంది.

**చదువుకు క్రమశిక్షణ తోడయితే బంగారానికి తావిఅబ్బినట్లు.**

దైవం ప్రసాదించిన దేహం వీణవంటి పరికరమే. అజ్ఞానం వల్ల కొందరు, అహంభావం వల్ల కొందరు దేహరూపంలో ఉన్న వీణను మీటకుండా వదలి వేస్తున్నారు. ఈ రెండు దోషాలను ప్రక్కనపెట్టి ఎవరైనా జీవనవీణ ద్వారా మధుర స్వరాలు పలికించగల్గితే, ఆ ఆనందం వ్యక్తిగతంగా అనుభవించటమే కాక, సంపర్కంలో ఉన్న అనేకమంది వ్యక్తులకు ఈశ్వరీయ ఆనందానుభూతిని కలుగజేయవచ్చు.

**కథ -22** : ఒక మహాత్ముని వద్ద సూర్యకాంత మణి ఉన్నది. అంత్యకాలంలో అతడు ఆ మణిని కుమారున కిచ్చి "ఇది కామధేనువు వంటిది. మనో వాంఛలన్నీ తీరుస్తుంది. జాగ్రత్తగా ఉంచు. ఇది నీ అవసరాలన్నీ తీరుస్తుంది, నీకే లోటు రానీయదని " చెప్పాడు.

కుమారుడు తండ్రి చెప్పినవన్నీ వినికూడా నిర్లక్ష్య భావంతో ఆ మణిని చీకటి వేళలో దీపంగా ఉపయోగిస్తాడు. ఒకరోజు అతని ప్రియురాలు ఆ మణిని తనకు కానుకగా ఇమ్మని కోరుతుంది. ఏమాత్రం సంకోచించకుండా అతడు మణిని ఆ వేశ్యకు ఇచ్చివేస్తాడు. ఆమె ఆ మణిని అమ్మి వచ్చిన డబ్బుతో శృంగార సామగ్రిని కొనుక్కొంటుంది. మణిని కొన్న వర్తకుడు దానిని పరీక్షించి రసాయన ప్రయోగాల ద్వారా ఆ మణితో ఎనలేని బంగారాన్ని తయారు చేసుకొంటాడు. ఆ విధంగా అతడు రాజులు, మహారాజుల కంటే సంపన్నుడుడిగా జీవిస్తూ, ఆ మణితో అనేకులైన దీనులకు దుఃఖితులకు కూడా సహాయం చేసి తరిస్తాడు.

ఈ జీవితం సూర్యకాంతమణి వంటిదే. జీవితం విలువ తెల్సినవారు వజ్రాల వ్యాపారివలె అచ్చెరువైన లాభాలు పొందుతున్నారు. విలువ తెలియనివారు సౌమనసుడు, వేశ్యలవలె జీవితాన్ని చౌకధరకే వినియోగించి వదలి వేస్తున్నారు.

శ్లో॥ **ఆత్మజ్ఞానం నరస్యాస్తి గౌరవం మహదున్ముఖః ।**
**యోదిశాం తాం ప్రతి, ప్రైతిగతిమన్తర్ముఖీం సతు॥**
**భూతం యశ్చ భవిష్యచ్చ విచార్య వర్తతే పుమాన్**
**ఆత్మావలంబీ సయాతి దృతం ప్రగతి వర్ధతౌ ॥**
**నాత్ర కాఠిన్య మాప్నోతి యే త్యజన్త్యవలంబనమ్ ।**
**ఉపేక్షయాత్మహన్తారో దుఃఖ దారిద్ర్య భాగినః॥**
**పదే పదే తిరస్కారం సహంతే యంత్రణా భృశమ్ ।**
**నారక్యః ప్రాప్నువన్త్యేవన యాంతి పరమాం గతిమ్ ॥**

ఆత్మజ్ఞానమే సర్వోత్కృష్టమైనది. గౌరవప్రదమైనది. ఆత్మజ్ఞాన దిశగా ఎవరైతే పయనించగలుగుతారో వారు అంతర్ముఖులై తమ భూత భవిష్యత్ వర్తమానాలను తామే నిర్ధారణ గావించుకొని ఆత్మావలంబులై, ప్రగతి పథంలో ధృతగమనంతో ముందుకు ఉరుకుతారు. మార్గమధ్యంలో వారిని ఏ అడ్డంకులు విపత్తులు దరిచేరవు. ఆత్మావలంబనను ఉపేక్షించినవారు మాత్రమే దుఃఖ, దారిద్ర్యాల పాలై ఆత్మహంతకులుగా అడుగడుగున ఓటమిని, తిరస్కారాన్ని భరిస్తూ, భూమిమీద నరకాన్ని అనుభవిస్తారు.

**అభివృద్ధికి బద్ధ విరోధి అసహనం.**

తమ శాశ్వత స్వరూపమైన ఆత్మతత్వాన్ని తెల్సుకోలేక పోవటం వల్లనే అనేక దుఃఖాలు అనుభవించవలసిన పరిస్థితులు ఎదురవుతాయి. శరీరం అంటే ఏమిటో సరిఅయిన అవగాహన కనీసం లేని వారు ఇంక తమ బౌద్ధికశక్తులను ఏమి ఉపయోగించుకోగలరు? సద్వినియోగం చేయగలరు?

ఆత్మతత్వాన్ని ఆశ్రయించటానికి, తమ లోపలి గుహలోనికి తొంగి చూడ గల్గిన వారికి అపారమైన సంపద, వైభవం యొక్క దివ్యకాంతులు కన్నులు మిరిమిట్లు గొల్పుతూ కన్పిస్తాయి.

**కథ -23** : **ఆ**త్మావలంబన సాఫల్య పథాన్ని ఏ విధంగా ప్రశస్తం చేస్తుందో రామకృష్ణ పరమహంస శిష్యులకు చెప్పిన ఈ కథలో చూద్దాం !

ఒక కట్టెలు కొట్టే వ్యక్తి అడవిలో కట్టెలు కొట్టి తెచ్చి, అమ్మి, వచ్చిన సొమ్ముతో కష్టంగా రోజులు గడుపుతూ ఉండేవాడు. ఒకరోజు ఒక మహాత్ముడు అతన్ని చూచి, నాయనా! "ఇంకా ముందుకు వెళ్ళు" అని చెప్పి వెళ్ళిపోతాడు. ఆ మాట ప్రకారం కట్టెలు కొట్టే వ్యక్తి రోజూ కాస్త ముందుకు పోవనారంభించాడు. రోజు రోజుకూ ఎక్కువ లావైన కట్టెలుగల ప్రదేశం అతనికి కనిపించసాగింది. ఆ విధంగా అతడు ఎక్కువ ధనం సంపాదించి సదుపాయంగా జీవించసాగాడు. ఆగకుండా ముందుకు పోతున్న ఆ కట్టెలు కొట్టే వ్యక్తికి, క్రమంగా టేకు చెట్ల వనం, చందన వృక్షాల వనం కనుపించసాగాయి. ఈ విధంగా అతను కోట్ల సంపదకి అధికారి అవగలిగాడు. ధర్మమార్గం కూడా ఇలాంటిదే. ముందుకు పోయే కొలది లాభాలు అందుతూ ఉంటాయి.

మన లోపలకు తొంగిచూచి ఆత్మావలోకనం, ఆత్మ విశ్లేషణ కావించుకొని ప్రగతి పథంలో స్పష్టమైన దారి కనుపించేవరకు ఆగకుండా ముందుకు పోవాలని పై కథ మనకు తెలియజేస్తోంది. ఏదో కాస్త వెలుగు కనిపించినంత మాత్రాన నీకేదో సిద్ధులు లభించాయని భ్రమ పడవద్దని, ఆ దివ్య ప్రకాశాన్ని దర్శించే వరకు ఆగకుండా, నీ పయనం సాగించుమనీ పై కథ హెచ్చరిస్తోంది.

శరీరభారాన్నంతటిని కాళ్ళు మోస్తున్నాయి. కాళ్ళు బలహీనమైతే నడవలేము సరికదా నిలబడటం కూడా కష్టమవుతుంది. అలాగే ఆహారాన్ని జీర్ణకోశం జీర్ణం చేస్తుంది. జీర్ణశక్తి చెడితే ఇతరుల జీర్ణకోశం ద్వారా మనం తిన్న ఆహారాన్ని జీర్ణం చేసుకోలేం. విద్య సంపాదించాలంటే ఎవరికి వారే కష్టపడి చదవాలి. అలాగే ఎవరి పాపపుణ్యానికి తగినట్లు వారు సుఖదుఃఖాలను అనుభవిస్తూ ఉంటారు. సుఖంగా ఆనందమయ వాతావరణములో జీవించాలని ఎవరు కోరుకొంటారో, వారు దానికి తగిన కర్మను తమ లోపలే ఆరంభించాలి. ఎవరో వచ్చి ఏమీ చేయలేరు. బాహ్య జీవితం ఎలా ఉండాలని కోరుకొంటే దానికి తగినట్లు నిర్మాణ కార్యక్రమం ఎవరికి వారు తమ లోపలే ఆరంభించాలి.

దోహ : కస్తూరి కుండల బసే మృగడూంఢే నమమాహి ।
ఐసే ఘటఘటరామ్‌హై దునియా దేఖేనా హి ॥
తేరా సాయీ తుఝ్మే, పుహుపక్ మే హై వాస్ ।
కస్తూరీకా కిరణ్ జ్యోం, ఫిర్‌ఫిర్ డూంఢత్ ఘాస్ ॥

**విలువలతో, విదులతో, సద్గుణాలతో, సంస్కారాలతో మనిషి తనను తాను సింగారించుకోవాలి.**

ఆత్మ విశ్వాసం కలవారు ఎవరి అనుగ్రహం కోసం, వరదానాల కోసం నిరీక్షించరు. ఎవ్వరినీ ఏదీ యాచించరు. ప్రగతిపథంలో దారులను వారే నిర్మించుకొంటారు. వారికి వారే సహాయం చేసుకొంటారు.

**కథ -24** : **ము**గ్గురు బాటసారులు ఒక ఎత్తైన పర్వత శిఖరము నుండి ఏర్పాటు చేయబడిన సుదీర్ఘమైన బాటవెంట పయనిస్తున్నారు. నడచి నడచి అలసి దాహంతో నీటికోసం నలుదిక్కులా వెదకనారంభించారు. చివరకు ఒక చిన్న సెలయేరు పర్వత శిఖరానికి క్రిందుగా ప్రవహిస్తూ కనిపించింది. ముగ్గురిలో ఒక బాటసారి ఓ భగవంతుడా ! దయచూపి ఎలాగయినా నా దాహం తీర్చు, దప్పికకు తాళలేకున్నానని గొంతెత్తి అరవసాగాడు. రెండవ బాటసారి మేఘాలను సృష్టించి నాపైన నీటి జల్లులను కురిపించుమంటూ దేవేంద్రుని ప్రార్థించటం మొదలు పెట్టాడు. మూడవ బాటసారి ఎవ్వరినీ ఏదీ అడగటానికి ఇచ్ఛగించక తన పురుషార్థముతో శ్రమించి శిఖరం నుండి క్రిందకి దిగి సెలయేరుని సమీపించి కడుపునిండా నీటిని త్రాగుతాడు. మిగిలిన ఇద్దరి పిలుపులతో పర్వతాలు ప్రతిధ్వనిస్తూండగా మూడవ బాటసారి లక్ష్యసాధనకై ముందుకు సాగిపోయాడు. ఆత్మశక్తిని నమ్మినవారి కార్యక్షేత్రం ఈ విధంగా ఉంటుంది.

**కథ -25** : **సుజాత** పాయసాన్ని ఇచ్చింది. దానిని భుజించిన **గౌతమ బుద్ధుడు** పరమానంద భరితుడౌతాడు. అతనికి కలిగిన సమాధి స్థితి నుండి బయటపడిన ఆ రోజు ఏడవ రోజు. ఆరోజే అతనికి ఆత్మ సాక్షాత్కారం కలిగింది. నది ఒడ్డున ప్రసన్న వదనంతో ఆసీనుడైయున్న బుద్ధుని చూడటానికి మళ్ళీ వెళ్ళిన సుజాత అతన్ని చూసి ఆశ్చర్య చకితురాలైంది. ఎందుకని అంటే అతనీ ఏడురోజులుగా ఒకే ఆసనము మీద కూర్చొని ఉన్నాడు. అంతేకాక కొందరు వ్యక్తులు అతని ముందు నుండి ఒక శవాన్ని మోసుకొని పోతూ ఉండగా బుద్ధుడు నిశ్చలంగా చిరునవ్వుతో చూస్తున్నాడు. దర్శనార్థం వెళ్ళిన సుజాత బుద్ధునికి నమస్కరించి "ఓ మహాత్మా! నిన్న మొన్నటి వరకూ శవాన్ని చూసి దుఃఖించిన దుఃఖం ఏమయింది?"అని ప్రశ్నించింది. బుద్ధుడు చిరునవ్వు నవ్వి, "అమ్మా! జడ వస్తువులపట్ల నేను ఏర్పరుచుకున్న ఆసక్తే నన్ను నిన్న మొన్నటివరకు దుఃఖింపచేసింది. కానీ ఈనాడు నాకు ఏవి జడమైనవో వాటి గుణాలు కూడా పరివర్తన చెందేవేననీ, వేటికోసం ఏడుస్తున్నామో అవిమాత్రం నశించవనీ, పరివర్తన చెందవనే సత్యము అవగతమయినది. నీవే చెప్పు సనాతనమయిన, శాశ్వతమయిన వస్తువుని సంపాదించిన వారికి నశించే వాటిపట్ల దుఃఖం, భయం, మమకారం ఉంటాయంటావా?" అని బుద్ధుడు ఎదురు ప్రశ్న వేశాడు. సుజాత బుద్ధుని పాదాలపై శిరస్సు ఉంచి కన్నీటితో అభిషేకించింది.

**కథ -26** : **జ**యవిజయులు విష్ణుమూర్తి యొక్క ద్వారపాలకులు, వారికి వారి పదవి పట్ల హద్దులేని గర్వం ఏర్పడింది. వారి అనుమతి లేకుండ ఎవ్వరూ విష్ణుమూర్తి వద్దకు చేరలేరనే అహంకారంతో ఒకనాడు సాక్షాత్తూ నారాయణుని ఇల్లాలైన లక్ష్మీదేవిని కూడా ద్వారం వద్ద అడ్డగిస్తారు. సహజ సరళ స్వభావురాలైన లక్ష్మీదేవి వారి అహంకారాన్ని మౌనంగా సహించింది. కానీ వారు మితి మీరి సనకసనందనులు, సనాతన సనత్‌కుమారులు వంటి మహాత్ములను గూడ లోనికి పోకుండా అడ్డగించటం వల్ల వారి శాపాలకు గురియై మూడు జన్మలు హిరణ్యాక్షుడు-హిరణ్యకశ్యపుడు, రావణుడు- కుంభకర్ణుడు, శిశుపాలుడు-దంతవక్త్రుడుగా

**ఆనందానికి మార్గం ద్వేష రాహిత్యం.**

రాక్షసజన్మను ఎత్తవలసి వచ్చింది. ఈ విధంగా మహాత్ములు వారికి నిరహంకారులుగా జీవించుమని గుణపాఠం చెప్పారు. స్వర్గంలో వైకుంఠములో ఉన్న ఉన్నత పదాధికారులే అహంకారంవల్ల అసుర యోనులలో జన్మించవలసిన దౌర్భాగ్యానికి గురియైనపుడు, సాధారణ మానవుడు అహంకారంతో ఆత్మని ఉపేక్షిస్తే ప్రగతిపథంలో ఎలా అడుగుమోపగలడు?

శ్లో॥ **భౌతికేహి సువిధాః ప్రాదాన్మనుష్యేభ్యః ప్రభుస్స్వయం ।**
**దివ్యానాంచ విభూతీనాం నిధిం వపుషి దత్తవాన్ ॥**
**కింతు కార్యమిదం తస్యాధీనం చ కృతవాన్ ప్రభుః ॥**
**యద్ వివేకయుతాం బుద్ధిం స్వతంత్రాం పరిదర్శయేత్ ॥**
**ఉపయోగం సాధనానాం దురుపయోగ మథాశ్రయన్ ।**
**సహ భాక్ స్వర్గ్యధారాయ నారక్యాంవాపి సంభవేత్ ॥**

ఈశ్వరుడు మానవునికి భౌతిక సంపదలు, సర్వ సౌకర్యాలు ఇచ్చి, లోపల దివ్యవిభూతుల బండారాన్ని గూడా అమర్చాడు. ఇన్నీ ఇచ్చి నీవు స్వతంత్రుడివి. వివేకంతో బుద్ధిని ఉపయోగించుకొని సాధనాలను సదుపయోగం చేసికొని స్వర్గాన్నే సృష్టించుకొంటావో, దురుపయోగించుకొంటావో నీ ఇష్టమేనని అన్నాడు. ఈ సద్వివేక శక్తి యొక్క జాగరణ ఎవరిలో ఎంత శాతం కల్గితే వారు అంత శాతమే ఆధ్యాత్మిక శక్తి సంపన్నులౌతారు.

**కథ -27** : ఒక యాచకుడొక మహాత్ముని వద్దకు వచ్చి, తాను పేదవాడినని, ఏదైనా కొంత ధన సహాయం చేస్తే, వానితో జీవితం గడుపుకొంటాననీ ప్రాధేయపడతాడు. మహాత్ముని వద్ద వస్త్రాలరూపంలో ఒక లంగోటీ, ఉత్తరీయము తప్ప వేరేమీ లేవని చెబుతూ, ఉత్తరీయం కావాలంటే తీసుకొమ్మంటాడు. ఇంతలో యాచకునికి మహాత్ముని గుడిసె ప్రక్కన ఒక రాయి కనిపిస్తుంది. ప్రత్యేకంగా కనిపించే ఆ రాయి యేమిటని ప్రశ్నిస్తాడు. మహాత్ముడు ఆ రాయి కావలసినచో తీసికొని వెళ్లుమని, దానిని ఏ లోహానికి తగిలించినా బంగారముగా మారుతుందని తెలియజేస్తాడు. అయితే ఇది పారసమణి. దీని నిలా గుడిశె ప్రక్కన పడవేశారేమిటని ఆశ్చర్యంగా ప్రశ్నిస్తాడు. మహాత్ముడు చిరునవ్వు నవ్వి, “నాయనా నా వద్ద ఆత్మ సంతోషం రూపములో అమూల్యమైన నిధి ఉన్నది. ఆ సంపద నన్ను నిరంతరం ఆత్మజ్ఞానాన్ని ఆర్జించుమని ప్రేరేపిస్తూ ఉంటుంది. క్షణిక సుఖాలనిచ్చే ఈ వస్తువుతో నాకేమి పని? నీకేదైనా ఉపయోగపడితే తీసికొని వెళ్ళు” అని అంటూ తిరిగి ధ్యానమగ్నుడౌతాడు. ఆ మణిని తీసి యాచకుడు దూరంగా విసిరివేస్తూ “మహాత్మా! ఏ ఆత్మ సంతోషంతో మునిగి మీరు ఓలలాడుతున్నారో, ఏ కృప మీపై అనవరతమూ వర్షిస్తోందో, వాటి నుండి నేను ఈ మణి కారణంగా వంచించబడలేను. నన్ను కూడా మీ మార్గం వెంబడి పయనించేలా ప్రేరణనిచ్చి ఆశీర్వదించండి”. అంటూ పాదాలపై వ్రాలుతాడు.

వివేకవంతుని సమక్షములో సమస్త సంపదలు వైభవాలు తుచ్ఛమైనవే. వివేకవంతుని చరమ లక్ష్యం పరమపద ప్రాప్తి, అతడు వేసే ప్రతి అడుగూ ఆ దిశగానే పయనింపచేస్తాయి.

**నిజాయితీ పరునికి కాలం అనుకూలించి తీరుతుంది.**

**కథ -28**: శ్రీకృష్ణదేవరాయలు భక్తపురందరదాసు యొక్క నిర్లోభం గురించి విని, ఆశ్చర్య చకితుడై నమ్మజాలక పరీక్షించాలనుకొంటాడు. విద్యాధికుడు, సమస్త భౌతిక సంపదలు అందుబాటులో ఉన్నవాడు అయివుండి కూడా, వాటిని వేటినీ ఉపయోగించుకోకుండా లోకసేవ చేస్తూ, ఆనందంగా గృహస్థజీవితం గడపడం ఎలా సాధ్యమో తెల్సుకోవాలనుకొని, మంత్రిని అతని వద్దకు పంపి అతన్ని భిక్షను స్వయంగా రాజభవనం నుండి తీసికెళ్ళుమని కబురు చేస్తాడు. పురందరదాసు అంగీకరిస్తాడు. ప్రతి నిత్యం పురందరదాసు పాత్రలో బియ్యంతోపాటు వజ్రాలు వైఢూర్యాలు కూడా కలిపి పోయించేవాడు. అయినా ప్రసన్న వదనంతో నిశ్చలముగా భిక్ష స్వీకరించి, ప్రతిరోజూ గుమ్మం ముందు సాక్షాత్కరిస్తున్న పురందరదాసు ధోరణి శ్రీకృష్ణదేవరాయలుని ఆశ్చర్య చకితుణ్ణి చేస్తుంది. ఒక్క రోజు భిక్షా పాత్రలో వేసిన వజ్రాలు, వైఢూర్యాలు అతనికి అతని కుటుంబ పోషణకు సంవత్సరాల వరకు సరిపోతాయి. లోభం లేనివాడైతే ప్రతిరోజూ ఎందుకు వస్తాడు? సంగతి ఏమిటో అతని ఇంటికి వెళ్ళి చూడాలని నిర్ణయించుకొని మారువేషంలో పురందరదాసు ఇంటికి వెళ్ళి చూడగా పురందరదాసు భార్య, భర్త తీసుకొని వచ్చిన బియ్యాన్ని చెరగి, వజ్రాలు వైఢూర్యాలను వేరుచేసి బియ్యాన్ని తీసుకొని మిగిలినవాటిని ప్రక్కన పెంట మీద పారబోస్తోంది. ఇకపైన ఇటువంటి రాళ్ళు రప్పలతో కూడిన బియ్యాన్ని భిక్షగా ఇచ్చేవారి వద్దనుండి తీసుకొని రావద్దని భర్తకి మనవి చేస్తోంది. రాజు ఆ ఆదర్శ దంపతులకు చేతులు జోడించి నమస్కరిస్తాడు. నిశ్చలమైన భక్తి మార్గాన్ని స్వీకరించి, జీవితాలను లోకసేవకు అంకితం చేసిన మహాత్ములకు బాహ్య సంపదలు రాయి, రప్పలతో సమానమనే సత్యాన్ని కళ్ళారా చూచి ఆనంద పరవశుడవుతాడు.

**కథ -29** : స్వర్గం నరకం వ్యక్తి చేసుకొన్న కర్మఫలమేనని గురువు శిష్యునికి నచ్చచెప్పాడు. కానీ శిష్యుడు అంగీకరించడు. మర్నాడు శిష్యుని వెంటబెట్టుకొని గురువు ఒక పిట్టలను వేటాడేవాని ఇంటిముందు ఆగుతాడు. అతడు ఒక పిట్టను వేటాడి తెచ్చి కోయబోతూ వుంటాడు. ఒక పిట్టను కొట్టి తెచ్చి ఎవరి కడుపు నింపుతావంటూ భార్య తిట్టడం మొదలు పెడుతుంది. ఒంటిమీద గుడ్డలయినా లేని పిల్లలు వాటా కోసం కొట్టుకోవటం ప్రారంభిస్తారు. ఇదంతా చూచి శిష్యుడు “త్వరగా ఇక్కడ నుండి బయటకు పోదాం... ఇదో నరకంలా ఉంది” అంటూ గురువుగార్ని తొందరచేస్తాడు. గురువు నవ్వి, “నాయనా! బోయవాడు ఎన్నో జీవాలను వేటాడినా దరిద్రం తీరక ఇక్కడ నరకాన్ని అనుభవించటం చూశావు కదా, అలాగే ఇతని చేత చంపబడిన అనేక జీవాత్మలు ఇతన్ని శపించి, పరలోకంలో కూడా నరకాన్ని దుఃఖాన్ని సృష్టించి ఉంచుతాయి” అని చెప్పి అక్కడ నుండి ఒక సాధువు గుడిసెకు తీసుకొని పోతాడు. ఆ సాధువు దరిదాపులలో ఎక్కడ విలువైన వస్తువులు గానీ పదార్థాలు గానీ లేవు. అయినా అతడు ప్రసన్నంగా పరిపూర్ణమైన ఆనందంతో ప్రకాశిస్తూ కనుపించాడు. గురువు శిష్యునితో, “చూశావా! ఈ సాధువు కఠినమైన తపశ్చర్య చేస్తూ అన్ని సుఖాలకు దూరంగా ఉన్నట్లు పైకి కనిపిస్తున్నా ఇతని మనస్సు ఎంత ఆహ్లాదంగా ఉన్నదో! పారలౌకిక సుఖశాంతులను ఇక్కడే అనుభవిస్తున్నట్లుగా నిశ్చయంగా తెలుస్తోంది” అంటాడు. శిష్యుడు నిజమేనంటూ ఆనందంగా అంగీకరిస్తాడు.

తరువాత శిష్యుణ్ణి ఒక వేశ్య ఇంటి ముందు ఆపి, వ్యక్తి సుఖభోగాల కోసం శరీరాన్ని, శీలాన్ని, చరిత్రను కూడా బజారులో అమ్మి విచ్చలవిడిగా బ్రతుకుతూ ఇదే స్వర్గమని భావిస్తూ ఎలా జీవిస్తారో చూపిస్తాడు.

**శ్రమను గౌరవించని జాతి ఎన్నటికీ పురోగమించదు.**

చివరకు గురువు శిష్యుని ఒక గృహస్థు ఇంటి ముందుకు తీసుకొని వెళ్తాడు. గృహస్థు శ్రమజీవి. నియమ నిగ్రహాలతో నేర్పుగా ఓర్పుగా జీవయాత్ర సాగిస్తూ వుంటాడు. అతనికి లోటుగానీ, వెలితిగానీ ఏమీ లేనట్లు అన్ని విధాలా సమృద్ధిగా ఉన్నట్లు, ఆనందమయ జీవనాన్ని గడుపుతున్నట్లు శిష్యుడు గుర్తిస్తాడు. ఇలాంటివారికి ఇహపరాలు రెండింటిలోను స్వర్గమే. స్వర్గం-నరకం ఎవరికి వారు సృష్టించుకొన్నవేననే సత్యం అతనికి ఆ క్షణంలో అక్కడ అవగతమవుతుంది.

విధాత, ఇతర జీవజంతువులకంటే విశిష్టంగా తన మార్గాన్ని ఎంచుకొని, శ్రేష్ఠపక్షాన్ని స్వీకరించి జీవించుమని, అందరికీ మేలు కల్గించుమని మానవుని భూమిమీదకు పంపటము జరిగింది. కానీ వర్తమాన పరిస్థితులు విధాతను కూడా దుఃఖానికి, నిరాశకు గురిచేసేలా తయారైనాయి.

**కథ -30** : విధాత వృక్షాలను, వనస్పతులను, జీవజంతువులను, పెద్ద పెద్ద జీవధారులను, పశుపక్షులను క్రమంగా సృష్టిస్తూ వచ్చాడు. కానీ తరువాత ఆయన ఆలోచిస్తే, ఇవేవీ కూడా సృష్టిని సక్రమంగా వుంచి రక్షించి ఉద్ధరించటంలో సామర్థ్యం కల్గినవి కావని అర్ధమైంది. ప్రతిజీవి స్వార్థజీవిగా నిర్ధారించబడింది. తరువాత విధాత పరిపూర్ణమైన ప్రతిభా సంపన్నుడైన మానవుణ్ని సృష్టించాడు. తాను సృష్టించిన మానవుని చూసుకొని విధాత మురిసిపోయాడు. సృష్టియొక్క వ్యవస్థను నిశ్చింతగా ఈ ఉత్తరాధికారికి అప్పగించి తన శ్రమను మరచిపోవటానికి విశ్రాంతిగా శయ్యపైన మేను వాల్చాడు.

ఇలా ఒక వేయి సంవత్సరాలు జరిగింది. ద్వారం వద్ద కోలాహలానికి నిద్రాభంగమై విధాత కన్నులు తెరచి చూడగా జీవ జంతువులు గుంపులు గుంపులుగా నిలబడి దుఃఖించటం కనుపించింది. మీ దుఃఖానికి కారణం ఏమిటని విధాత ప్రశ్నించగా జీవజంతువుల ప్రతినిధి రోదిస్తూ, "ప్రభూ! సృష్టి సంతులనానికి, సంరక్షణకు సృష్టించిన మానవులు మమ్ములను అనేక విధాల బాధించడం, హింసించడం, నాశనం చేయటం చేస్తున్నారు" అని మొరపెడుతుంది.

సృష్టియొక్క శాంతి, సౌందర్యాలు నశించటం చూచి బ్రహ్మ ఎంతగానో చింతిస్తాడు. వారిని ఓదారుస్తూ "బిడ్డల్లారా! దుఃఖించకండి. తమ కర్తవ్యాలను మరిచి, నా ద్వారా ప్రసాదించబడిన సంపదలవల్ల గర్వించి స్వార్థంతో తమ సద్బుద్ధిని దుర్బుద్ధిగా మార్చుకొని విర్రవీగే ఈ మానవులు వారి కర్మలకు తగిన ఫలితాన్ని అనుభవిస్తారు. వారు ఆచరించే కర్మలవల్ల మీకంటే వారికి జరిగే కీడు చాలా ఎక్కువ. కాబట్టి కాస్త ఓపికపట్టి సమయం కోసం ఎదురుచూడండి. ఒకనాడు వారి ఈ దుర్బుద్ధే వారిని పాశవిక జీవులుగా మార్చి మీరనుభవించే బాధకు అనేకరెట్లు బాధను అనుభవింప చేస్తుంది. తరువాత వారు మానవ దేహం పొంది ఏమి లాభమని రోదిస్తారు. ఆరోదన, పశ్చాత్తాపమే వారికి తిరిగి సన్మార్గాన్ని చూపిస్తుంది. నేను ప్రసాదించిన జీవితం యొక్క విలువను విస్మరించి వారికి వారే క్రిందకు ఏ విధంగా పడ్డారో, అదే విధంగా వారికి వారే స్వయంగా పైకి లేవాలి. ఈ విషయంలో నేను కూడా నిమిత్త మాత్రుడినే" అంటూ జీవ జంతువులను విధాత ఓదారుస్తాడు.

**శ్లో॥ ప్రగతిర్మానవానాం యా దుర్గతిర్వాపి దృశ్చతే ।**
**తస్య సంరచనాస్వస్యతాత ! జానీహి నిశ్చితమ్ ॥**

**వినయం ఎంత ఎదిగితే జీవితం అంత ఎదుగుతుంది.**

**మానవః స్వస్య భాగ్యస్య విధాతా స్వయమేవహి ।**
**తథ్యమేతద్ విజానంతి యేతేతు నిజ చింతనమ్ ॥**
**ప్రయాసం సాధుభావాయ యోజయంతినతే పునః ।**
**పతనం పరాభవం వాపి సహంతే నచ యంత్రణామ్ ॥**

ఓ పూజ్యుడా ! మానవుని ఎట్టెదుట సాక్షాత్కరించే ప్రగతి, దుర్గతికి కారణం అతని స్వయంకృత కర్మలే. **మానవుడు తన భాగ్యానికి తానే విధాత.** ఈ సత్యాన్ని గుర్తించి తన ఆలోచనలు, ఆచరణలు సదాశయాలతో పెనవేసుకొన్న మానవునికి పతనం పరాభవం అనేవి దరిదాపులకు రానేరావు.

ఆత్మజ్ఞానం ప్రాప్తించటం అంటే సమస్త శక్తుల భాండారము తనలోనే ఉన్నదని, తన భవిష్యత్తు తన చేతిలో మాత్రమే ఉన్నదని వ్యక్తికి అవగత మవ్వటమే. ఈ గొప్ప వరాన్ని భగవంతుడు మానవునికి మాత్రమే ప్రసాదించాడు. ఆత్మశక్తి కలిగిన పురుషార్థ పరాయణుడైన వ్యక్తి తన భాగ్యాన్ని తానే నిర్మించుకొంటాడు, కాని, అదృష్టానికై ఎదురు తెన్నులు చూడడు. భాగ్యవాదాన్ని నమ్మేవారు ఎట్టెదుట సాక్షాత్కరించే అవకాశాలను గుర్తించక పరిస్థితులు కలసి వస్తాయంటూ, అదృష్ట దేవత వరిస్తుందంటూ, ఎదురుతెన్నులతో కాలాన్ని గడిపేస్తారు.

**శాస్త్రాలు ఏమి లిఖించాయంటే :**

**శ్లో॥ కలిః శయానో భవతి సంజిహానస్తు ద్వాపరః ।**
**ఉత్తిష్టం త్రేతా భవతి కృతం సంపద్యతే చరన్ ॥**
**చరై వేతి చరై వేతి॥**

నిద్రపోవడమంటే **కలియుగం.** నిద్రమేల్కొని ఆవలించటమే **ద్వాపరయుగం.** లేచి నిలబడటం **త్రేతాయుగం.** లేచి తన లక్ష్యంవైపు పయనించటం **సత్యయుగం.** కాబట్టి లక్ష్యప్రాప్తికి పయనించు, పయనిస్తూ ఉండు.

**కథ –31** : ప్రగతి, దుర్గతి అనే రెండింటి ఉదాహరణలు మనకు మహాభారతంలో కనిపిస్తాయి. యధిష్ఠిరుడు, దుర్యోధనుడు ఈ ఇద్దరి కర్తృత్వము వారిద్దరి భవిష్యత్తును నిర్ణయించింది. ధర్మరాజు జూదం ఆడటం వల్ల వనవాసాన్ని అనుభవించాడు. అతనికిగల ధర్మనిష్ట కారణంగానే సోదరులతో, భార్యతో సహా అతడు ఆ శిక్షను ఆనందంగా అనుభవించాడు. శ్రీకృష్ణుని భగవత్ స్వరూపునిగా ఎంచి అతని ఆదేశం మేరకే ధర్మయుద్ధం చేశాడు. పరాక్రమవంతులంతా ప్రతిపక్షంలో ఉన్నా, విజయలక్ష్మి మాత్రం ఆదర్శాలనే వరించింది. దుర్యోధనుడు తపో సంపన్నురాలైన గాంధారిని, బ్రహ్మజ్ఞానియైన భీష్ముణ్ణి, గురువైన ద్రోణాచార్యుని కూడా అవహేళన చేసి వారు చెప్పే హితవుని లక్ష్యపెట్టక, ధర్మాన్ని ధిక్కరించి చివరకు పతనమయ్యాడు. తనతోపాటు కురువంశాన్నంతటినీ అఘాతంలో ముంచి వేశాదు. సర్వశక్తులు పుష్కలంగా ఉన్నా, పరిస్థితులు సర్వవిధాల అనుకూలంగా ఉన్నా, సదాశయాలు లోపిస్తే మానవుని కర్తృత్వం అతన్ని దుర్గతివైపే లాక్కుపోతుందని ఋజువైంది.

**పెదవులు మూసుకుని, హృదయాన్ని తెరువు.**

**కథ -32** : ఒకసారి ఐదుగురు అసమర్థులు, అంగవిహీనులు ఒకచోట కలుసుకొన్నారు. నాకు కళ్ళుంటే ఎక్కడ అవినీతి కనిపించినా నాశనం చేసేవాడినని అంటాడు గ్రుడ్డివాడు. ఇంక కుంటివాడు, నాకే కాళ్ళుంటే అవిశ్రాంతంగా పయనించి ప్రజలకు మేలు చేసేవాడిని కదా! అని రోదిస్తాడు. నాకేశక్తి ఉన్నట్లయితే దీనులకు దుఃఖితులకు ఎంతో సేవచేసేవాడి నంటాడు దుర్బలుడు. ఇంక నిర్ధనుడు నాకు డబ్బులేదు గానీ, ఉంటే ఎవ్వరికి ఆకలనేది లేకుండా అన్నదానం చేసేవాడినని అంటాడు. వారిలో మూర్ఖుడు నేనే పండితుణ్ణయితే, ప్రజలకు అసలైన జ్ఞానాన్ని ప్రసాదించేవాడినని వాపోతాడు. వరుణదేవునికి వీరి మాటలు వినిపించి, ఆయనలో అపారమైన దయను కల్గిస్తాయి. వారందరి కోర్కెలు క్షణమాత్రంలో నెరవేర్చేస్తాడు. కోర్కెలు తీరిన వీరందరూ ఆనంద పరవశులై, అంధుడు సౌందర్య దర్శనంలోను, కుంటివాడు విహార యాత్రల్లోను, ధనవంతుడు డబ్బు నిషాలోను మునిగిపోతారు. నిర్బలుడు తనకు లభించిన శక్తితో ఇతరులను బాధించటం మొదలెడతాడు. మూర్ఖుడు తన పాండిత్యంతో బడాయి చెప్పుకోవటం ప్రారంభిస్తాడు. ఇదంతా చూసేసరికి వరుణుడికి అంతులేని దుఃఖం కలిగింది. తాను ప్రసాదించిన శక్తులు తిరిగి లాగేసుకొంటాడు.

ఈ సత్యాన్ని రామాయణ రచయిత ఇలా వ్రాశారు.

**"పరమ ప్రధాన విశ్వకరి రాఖా ।**
**జో జశ కరహి సోతస ఫల చాఖా ॥"**

మానవుడు తన స్థాయికి తగినట్లు ఎల్లప్పుడూ ఔన్నత్యం వైపు పయనించటం లోనే అతనికి గౌరవం లభిస్తుంది. ఇతరులను కూడ ఆవిధంగానే లాక్కొని పోవాలి.

**"ఊర్ధ్వ ఉఠే ఫీర్ నాగిరే యహీమనుజకో కర్మ ।**
**ఔరన్‌లే ఊపర్ ఉఠే ఇన్‌సే బడేన ధర్మ ॥"**

ఈ వాస్తవాన్ని మనుషుడు అర్థం చేసుకొనలేక, తనకి తానే సృష్టించుకొన్న నరకకూపం నుండి దూరంగా పారిపోవటానికి విఫల ప్రయత్నం చేస్తూ పాఠాలు నేర్చుకొంటాడు.

**కథ -33** : మగధ దేశంలో గొప్ప వ్యాపారి చాలా ధనాన్ని ఆర్జిస్తాడు. తాను ఆర్జించిన ధనం పట్ల గర్విస్తూ ఇంట్లో వ్యక్తులను కూడా లక్ష్య పెట్టేవాడు గాదు. తత్ఫలితంగా ఇతని కుమారుడు ఉద్దండుడు కూడా అహంకారిగా మారి, కలహిస్తూ ఇంటిని నరకంలా మార్చాడు. వ్యాపారి కలతచెంది బుద్ధభగవానుని శరణువేడి, "మహాత్మా! నాకు ఈ నరకకూపం నుండి ముక్తిని ప్రసాదించు. నేను బిక్షాటన చేసి జీవయాత్ర సాగిస్తాను." అని ప్రాధేయ పడతాడు. తథాగతుడు కాస్త ఆలోచించి, "ఓ వ్యాపారీ! భిక్షుకుడుగా మారటానికి ఇంకా కాలము ఆసన్నం కాలేదయ్యా. నీవు ఎలాంటి ప్రపంచాన్ని కోరుకొంటావో అలాంటి ఆచరణనే మొదలుపెడితే ఇంట్లోనే స్వర్గం లభిస్తుంది. మనస్సు అశాంతిగా ఉన్నంతవరకూ వనాలలో శాంతి లభించదు. నరకం అనేది నీద్వారా సృష్టించబడినదే" అంటూ బుద్ధ భగవానుడు బదులు పల్కుతాడు. వ్యాపారి తిరిగి ఇంటికి వెళ్ళి తన దృష్టికోణాన్ని, ప్రవర్తనను, ఆచరణను మార్చుకోవటం ఆరంభించగానే క్రమంగా ఇంట్లోని వ్యక్తుల హృదయాలలో మార్పులు

రాసాగాయి. అతనికి ఇల్లు స్వర్గంలా గోచరించసాగింది. **ప్రగతి, దుర్గతి, స్వర్గం, నరకం మనిషి స్వయంగా సృష్టించుకొన్నవే** అనే విషయాన్ని ఈ కథ మనకు తెలియజేస్తుంది.

**కథ -34** : ఒక చెరువులో 3 చేపలు ఉండేవి. వాటి పేర్లు **'యద్భవిష్యతి' 'ప్రత్యుత్పన్నమతి' 'దూరదర్శి'**. ఒకనాడు ఒక జాలరి వచ్చి చెరువును, చెరువునిండా తిరుగాడే చేపలను చూచి మర్నాడు వల పన్నుతానని ప్రక్కనున్న జాలరితో పల్కుతాడు. ఈ మాటలు విన్న దూరదర్శి ఈ రాత్రికే అందరం ఈ చెరువుని వదలి వేరే చోటుకు పోవడం మంచిదని హెచ్చరిస్తుంది. వెంటనే తాను ఆ చెరువుని వదలి వేరే ప్రదేశానికి వెళ్ళిపోతుంది. 'ప్రత్యుత్పన్నమతి' దూరదర్శి మాటను లక్ష్య పెట్టక రేపు జాలరి వచ్చిన తరువాత పరిస్థితిని బట్టి ఎలా వీలైతే అలా చేయవచ్చులే అని నిర్ణయించుకొంటుంది. "యద్భవిష్యతి" నిశ్చితంగా తిరుగుతూ, జాలరి వస్తానన్నాడు గానీ, చెప్పిన ప్రకారం వస్తాడనీ, వల పన్నుతాడనీ భరోసా ఏముంది? ఇక్కడ మనకేమీ ఇబ్బంది రాదులే! హాయిగా ఉండవచ్చునని భావిస్తుంది. కానీ జాలరి మాత్రం చెప్పిన ప్రకారం వస్తాడు. వల కూడా పన్నుతాడు. యద్భవిష్యతి, ప్రత్యుత్పన్నమతి అతని వలలో చిక్కుకొంటాయి. చనిపోయి ఉంటాయని భావించి జాలరి వల నుండి చేపలను బయటకు తీస్తాడు. ప్రత్యుత్పన్నమతి ఆ అవకాశాన్ని జారవిడవకుండా చివాలున అతని చేతినుండి జారి మరల నీటిలోనికి గెంతి లోతుగా మునిగిపోతుంది. "యద్భవిష్యతి" జాలరి చేతచిక్కి తన దురదృష్టాన్ని నిందించుకొంటూ ఏడుస్తుంది.

మనుష్యులు కూడా ఈ విధంగానే 3 రకాల నిర్ణయాలు తీసుకొనేవాళ్ళు ఉంటారు. వారి నిర్ణయాలను బట్టి వారి పరిస్థితులు పరిసరాలు ఏర్పడతాయి. **మనిషి తన భాగ్యానికి తానే విధాత. అతని భాగ్యానికి దౌర్భాగ్యానికి కూడా దైవంకానీ, వేరెవ్వరు కానీ కారకులు కాదు.**

**శ్లో॥ వయం యద్బ్రహ్మ తత్వస్య మునే కుర్మోవగాహనమ్ ।**
**న వివేచ్యో విరాట్ తత్ర పరమేతదవేహియత్ ॥**
**మానవానా మంతరాలే సత్తాయా విద్యతే ప్రభోః ।**
**తస్యా మహామహత్తాం తు కథం జ్ఞాతుం క్షమావయమ్ ॥**
**కథం పశ్యామ ఏవంచ కథం కుర్మస్తథాత్మసాత్ ।**
**ప్రయోజనమిదం సర్వం బ్రహ్మ విద్యా ప్రచక్షతే ॥**

**ఓ** ఋషిశ్రేష్ఠుడా! మనం అవగతం చేసుకొంటున్న బ్రహ్మతత్వం కేవలం మానవ అంతఃకరణలో విరాజమానుడై యున్న ఈశ్వరుని యొక్క శక్తి మాత్రమే గానీ, విరాట్ పురుషుని యొక్క విశ్లేషణ కాదు. ఈ మహత్తర శక్తిని ఏ విధంగా దర్శించి, అర్థం చేసుకొని, జాగృతం చేసి సొంతం చేసుకోవాలో తెలియ జేయబడే పరిపూర్ణ ప్రయత్నము, ప్రయత్న ఫలము బ్రహ్మ విద్యగా చెప్పబడుతోంది. అంటూ పిప్పలాద మహర్షి విషయం యొక్క విశిష్టతను లోతుగా పరిశీలించి, బ్రహ్మ విద్య, విశ్వపురుషుడైన **విరాట్ బ్రహ్మల** విశ్లేషణను ఈ రెండింటి మధ్య అంతరాన్ని ఇంకా ఇలా తెలియజేస్తున్నాడు.

**ఆలస్యంగా అయినా, దురలోచనలు దుష్ఫలితాలను ఇస్తాయి.**

మంచుచే కప్పబడిన సమస్తమైన పర్వతాలు, నదులు, వనాలు ఇవి అన్నీ ఎవ్వరి గుణాలనైతే అనవరతం గానం చేస్తున్నాయో అతడు విరాట్ పురుషుడు. అంతేకాదు, అతడు దిక్కులను భుజాలుగా కల్గినవాడు. సూర్యచంద్రులు అతని నేత్రాలు. ఇటువంటి విరాట్ పురుషుని మనము మరువరాదని ఋగ్వేదం గానము చేస్తోంది.

ఇంక బ్రహ్మజ్ఞానమంటే, పరమేశ్వరుని అంశరూపంగా **తనలో విరాజిల్లుతున్న సమస్త శక్తులను గుర్తించటానికి, అర్థం చేసుకోవటానికి వికసింప చేసుకోవటానికి ఉపయోగించబడే జ్ఞానం మాత్రమే. బ్రహ్మజ్ఞానానికి అసలైన నిర్వచనం ఇదే.**

పరబ్రహ్మ అగోచరుడు. మన ఆలోచనలకు అందనివాడు. కానీ అతని క్రియకలాపాలను జడ చైతన్య జగత్తు యొక్క గతి విధులలోను, సృష్టి విజ్ఞానం యొక్క స్వరూపాలలోను దర్శించవచ్చు. ఏ భగవానుడు వివిధ రూపాలతో వివిధ నామాలతో, సాధన ఆరాధన ఉపాసన పద్ధతులద్వారా పూజించబడి చర్చించబడుతూ ఉన్నాడో ఆ పరమాత్ముడే ప్రతి మానవునిలోనూ బీజరూపుడై విరాజిల్లుతున్నాడు. ఆ పరమేశ్వరుని గుర్తించి, కప్పివేయబడిన మాయతెరలను తొలగించి వికసింప చేసుకొన్నవారు ఋషులు, దేవదూతలు మహామానవులుగా పరిణతి చెందుతూ ఉంటారు. వృద్ధి, సిద్ధికూడా ఈ ఆత్మతత్వం యొక్క అనుగ్రహస్థాయిని బట్టే లభిస్తూ ఉంటాయి. ఎక్కడో బయటనుండి పొందగల్గేవి ఎంత మాత్రం కాదు.

ఈ కృష్ణభగవానుడు మోక్ష సన్యాస యోగంలో ఈ గుహ్యజ్ఞానం గురించి చాలా చక్కగా సెలవిచ్చాడు. **ఈశ్వరః సర్వభూతానాం...** అని అర్జునునికి బోధపరుస్తూ, 'ఓ అర్జునా! సమస్త జీవులను తన శక్తితో ఆడిస్తూ ఈశ్వరుడు ప్రతి జీవధారిలోను నివసించి ఉంటాడు. ఓ భరతపుత్రా! అటువంటి ఈశ్వరునికి నిన్ను నీవు సమర్పణ కావించుకో. అప్పుడే నీకు అతని ప్రసాద రూపంగా పరమశాంతి, శాశ్వతానందం లభిస్తాయి. నా ద్వారా విన్న ఈ గూఢాతి గూఢమైన జ్ఞానాన్ని గురించి నీలోనీవు బాగా ఆలోచన చేయి" అని తెలియజేస్తాడు.

**భక్తమీరా, చైతన్య మహాప్రభువు, రైదాస్, కబీరు** మొదలైనవారంతా తమలోని ఈ ఈశ్వరునే గుర్తించి పూజించి తరించారు. వారి సాధన, పూజలు సమస్తం తమ అంతరంగంలోని ఈశ్వరునికి చేయబడినవేగాని ఎక్కడో ఆచరించినవి కాదు.

బ్రహ్మవిద్య ఏవ్యక్తిని ఎంత ఉచ్ఛస్థితికి చేర్చినప్పటికీ, అది వారు వారి అంతరంగంలోని ఆత్మశక్తిని అర్థం చేసుకొని వికసింప చేసుకోవటానికి చేసిన ప్రయత్నాల స్థాయి మీదనే ఆధారపడి ఉంటుంది.

భౌతిక జగత్తులో సాధానాలు, సౌకర్యాలు, సామగ్రులు మొదలైన అనేక సంపదలు ఏ విధంగా ఉన్నాయో, అదే విధంగా ఆత్మ జగత్తులో చైతన్య ప్రవాహరూపంలో తృప్తి, శాంతి, మొదలైన అనేక సంపదలు నిండి ఉన్నాయి. సాధన సామగ్రులు చూసుకొని మురిసే వ్యక్తికి, ఆటబొమ్మలతో ఆడుకొనే బాలునికీ తేడాలేదు. ఆత్మజగత్తులోని స్వర్గీయ సంపదలు పొందాలనే ఆసక్తి కల్గిన వారి మానవ జీవితం ధన్యమైనది, చరితార్థమైనది.

**ప్రేమించే వ్యక్తికి దండించే అధికారం ఉంటుంది.**

మానవుడు ధనం, వైభవం, కీర్తి, ఐశ్వర్యం, పదవి, ప్రతిష్ఠ, శరీరబలం, బుద్ధి మొదలైన అన్ని రంగాలలోను హిమాలయాల అంత ఎత్తుకి, సాగరమంత లోతుకి పెరిగినప్పటికి, ఆత్మసంపద లోపిస్తే నిమ్నస్థాయికి చెందిన జీవితం జీవించక తప్పదు. వారికి సుఖం ఉంటే ఉండవచ్చు, కానీ శాంతి మాత్రం ఉండదు. ఇంక తృప్తి అనేది కనుచూపు మేరలో కనుపించదు. శరీర నిర్వహణకు కావలసినంతవరకే భౌతిక సంపదలు పనికి వస్తాయి. కానీ ఆత్మ సంపదను ఆర్జించుకొన్న ధన్యులు శరీరపరంగా తృప్తి, జ్ఞానపరంగా తుష్టి, ఆత్మపరంగా శాంతి సమృద్ధిగా పొందగల్గుతారు.

**కథ -35** : **యా**జ్ఞవల్క్య మహర్షి తన సంపదను ఇద్దరు భార్యలకు సమంగా పంచి ఇచ్చి గృహస్థాశ్రమాన్ని వదలి తపోవనానికి ప్రయాణమవుతాడు. కానీ మైత్రేయికి ఈ పని తృప్తి నివ్వలేదు. ఆమె భర్తకి నమస్కరించి “ఓ మహాత్మా! నేను ఈ సంపదతో జీవన్ముక్తి పొందగలనా?” అని ప్రశ్నించింది. “ఇతర సంసారులవలెనే నీ జీవితం కూడా సుఖంగా సాగటానికి ఈ సంపద నీకు సహాయం చేస్తుంది. నేను లేకపోయినా నీకే ఇబ్బందీ రాకుండా ఈ సంపద నీకు తోడుంటుంద”ని యాజ్ఞ్యవల్క్యుడు బదులు పల్కుతాడు. ఆ పలుకులు ఆమెలోని అంతర్యుద్ధాన్ని శాంతిప చేయలేదు. ఆమె భర్తతో ఏమన్నదంటే – **“యే నాహం నామృతాస్యామ్ కిమహం తేనకుర్యామ్”** దేనివలన అయితే నాకు అమృతం లభించదో దానిని స్వీకరించి నేనేమి చేస్తాను? అని సంపద తిరస్కరించే మైత్రేయిని మహర్షి అయితే నీకేమి కావాలో కోరుకోమంటాడు. ఆమె భర్త పాదాలపై వ్రాలి “అసతోమాసద్గమయ, తమసోమా జ్యోతిర్గమయ, మృత్యోర్మా అమృతంగమయ. ఓ ప్రభూ! రుద్రుడివై నా అంతరంగంలోని అంధకారాన్ని నశింపజేయి. నన్ను కూడా నీ ఆత్మిక పురుషార్థపు భాగస్వామిగా స్వీకరించు” అని ప్రార్థిస్తుంది.

ప్రసన్న చిత్తుడైన మహర్షి, మైత్రేయికి బ్రహ్మజ్ఞానాన్ని బోధిస్తాడు. ఆమె భర్తతో సమానాధికారాన్ని, ఉన్నతమైన పదవినీ పొంది, ఋషిపత్నులలో చిరస్థాయిగా మిగిలిపోయింది.

మనం కూడా జీవితం అంతా అనేక రకాల ఐశ్వర్యాలను ప్రోగుచేస్తాం . కానీ ఏకాంతంలో కూర్చొని మనల్ని మనం నిజాయితీగా ప్రశ్నించుకొంటే ఇవేవీ జీవితాన్ని అమృతమయం కావించలేవనే సత్యం బోధ పడుతుంది. సంపద నంతటినీ కాత్యాయనికి ఇచ్చివేసి ఆత్మ ప్రగతివైపు పయనించిన మైత్రేయిలా మనం కూడా పయనించ గల్గినపుడే మనకు నిజమైన ఆనందం కల్గుతుంది.

**కథ -36** : ప్రహ్లాదునికి తండ్రి అసుర సంస్కృతికి తగినట్లుగా సమస్త వైభవాన్ని కలుగజేస్తాడు. సమస్త సౌకర్యాలు అందజేస్తాడు. అయినా ప్రహ్లాదుడు దైవభక్తి ఒక్కటే తన పరమ లక్ష్యంగా భావించి, ప్రతికూల వాతావరణంలో కూడా ఆత్మ సంపదను ఆర్జించటమే పురుషార్థంగా ఎంచుకొంటాడు. తన పుత్రుడు విషయాసక్తికి విరుద్ధంగా, భగవంతుని ఆదర్శాలను స్తుతించడం గమనించిన తండ్రి పుత్రసంహారానికి ఉద్యుక్తుడవుతాడు. ప్రహ్లాదుని రక్షణకై చివరకు దైవం నృసింహమూర్తిగా అవతారం దాల్చి దిగివచ్చి అసురుణ్ణి సంహరించవలసి వస్తుంది. ఆత్మ సంపద యొక్క శక్తి, గొప్పతనం దైవాన్ని అవతారం దాల్చి దిగిరప్పించగల్గినంత అమోఘమైనవి.

**కథ -37** : విక్రమాదిత్యుని రాజ్యంలో ఒక సదాచార సంపన్నుడైన బ్రాహ్మణుడు నిత్య సంతుష్టుడై జీవిస్తూ ఉండేవాడు. నిర్ధనుడైన ఆ బ్రాహ్మణుడు భార్య ఒత్తిడివల్ల ధనార్జనకై ఇల్లు వదలి బయలుదేరుతాడు. మార్గమధ్యంలో

**అన్యాయంతో రాజీపడడం ఘోరమైన నేరం.**

బ్రాహ్మణునికి ఒక మహాత్ముని దర్శనం లభించింది. చింతాక్రాంతుడై ఉన్న బ్రాహ్మణుని చూసి మహాత్ముడు కారణం అడిగి తెల్సుకొంటాడు. ఆ తరువాత మహాత్ముడు విక్రమాదిత్యునకు ఒక ఉత్తరం వ్రాసి దానిలో "నీ కోరిక తీరే సమయం వచ్చింది. నీ రాజ్యాన్ని ఈ బ్రాహ్మణునకిచ్చి నీవు తపోవనానికి రమ్మ"ని కబురు చేస్తారు.

ఆ ఉత్తరం చదివి విక్రమాదిత్యుడు అపరిమిత ఆనంద భరితుడవుతాడు. బ్రాహ్మణునకు రాజ్యపట్టాభిషేకం చేయటానికి సన్నాహాలు మొదలవుతాయి. కానీ బ్రాహ్మణుడు, విక్రమాదిత్య మహారాజు రాజ్య సుఖాలను వదలి యోగి వద్దకు వెళ్ళటంపట్ల చూపుతున్న ఆనందాన్ని ఉత్సాహాన్ని చూసి ఆశ్చర్య చకితుడవుతాడు. విధిగా యోగివద్ద రాజ్యసుఖాలను మించిన ఆనందం ఏదో ఉండి తీరాలని ఆలోచించి, వెంటనే యోగి వద్దకు తిరుగు ప్రయాణమవుతాడు. యోగికి నమస్కరించి "ఓ మహాత్మా ! విక్రమాదిత్య మహారాజు రాజ్యాన్ని వదలి నీ వద్దకు రావటం పట్ల చూపుతున్న ఆనందం చూస్తే, నీ వద్ద రాజ్య సుఖాలను మించిన ఆనందం ఏదో ఉన్నట్లు అర్థమవుతోంది. అదే నాకు ప్రసాదించు" అని వేడుకొంటాడు.

ఆ బ్రాహ్మణ దేవతకు యోగి ఆత్మ విద్యాసారాన్ని అందిస్తాడు. అలాగే మోక్షప్రాప్తికి కారణమైన వైభవాన్ని కూడా బ్రాహ్మణునకు ప్రసాదిస్తాడు.

**శ్లో॥ బహిర్ముఖాః జనాః సర్వే భ్రమజాలేషు పాతితాః ।**
**అంతర్ముఖాశ్చ తధ్యజ్ఞా సత్యం శ్రేయః శ్రయంత్యలమ్ ॥**

భౌతిక జగత్తు, అంతర్ జగత్తు రెండు క్షేత్రాలలోను సముచిత సమన్వయాన్ని స్థాపించ గల్గినపుడు మానవుడు ఆత్మోన్నతికి మార్గాన్ని చక్కపరచుకోగల్గుతాడు. బాహ్యాకర్షణల పట్ల విరక్తులై, తమను తాము ఆత్మిక పురుషార్థానికై వినియోగించ గల్గినవారు అతి స్వల్ప సంఖ్యలో ఉంటారు. ఈ ఆధారంతోనే జన సముదాయాన్ని బహిర్ముఖులు, అంతర్ముఖులు అని 2 వర్గాలుగా విభజించటం జరిగింది. మొదటి వర్గానికి చెందినవారు దిక్కుతోచక తిరుగుతూ ఉంటాడు. రెండవ వర్గానికి చెందినవారు దారి వెదుకుతూ తిరుగుతూ ఉంటారు. వీరికి అనేకులు అనేక విధాలుగా దారి చూపిస్తూ ఉంటారు.

**కథ -38** : ఒక మహాత్ముని వ్యాఖ్య ఏమంటే :

ప్రపంచంలో రెండు రకాల స్వభావాలు కల వ్యక్తులుంటారు. కొందరు చేట వంటి స్వభావులు. కొందరు జల్లెడ వంటి స్వభావులు. చేట చెత్తా చెదారం వంటి సారహీనమైన వస్తువులను త్యజించి, సారవంతపు ధాన్యపు గింజలను గ్రహించినట్లుగా కొందరు మనుష్యులు ప్రపంచంలోని సారహీనమైన వస్తువులను, విషయాలను త్యజించి, సారవంతమైన బ్రహ్మ విద్యను, బ్రహ్మజ్ఞానాన్ని స్వీకరిస్తారు. జల్లెడ వంటి వ్యక్తులు సారయుక్తమైన ఈశ్వర చింతనను వదలివేసి, సారహీనమైన విషయ సుఖాలను, కామినీ-కాంచనాదులను పట్టుకొని ప్రాకులాడతారు.

**వివేకి ఆలోచించి మాట్లాడతాడు. అవివేకి ఆలోచిస్తాడు.**

**బహిర్ముఖీ వ్యక్తిత్వం కల వ్యక్తుల యొక్క ఆలోచనలు చేతలు ప్రతి వస్తువుపట్ల, వారి యొక్క జీవిత విధానం పట్ల కూడా ఏక పక్షానికే చెంది, మొండిగా ఉంటాయి. అతడు ఆత్మ పరిశోధన కంటె కూడా బాహ్య నడివడికకే ప్రాధాన్యత నిస్తాడు.**

**కథ -39** : మహాభారత యుద్ధం సమాప్తమైన తరువాత ధర్మరాజు భార్య, సోదరులతో సహా తీర్థ యాత్రలకు బయలుదేర నిశ్చయించుకొని, శ్రీకృష్ణ పరమాత్మను కూడా తీర్థయాత్రలకు రమ్మని ఆహ్వానిస్తాడు. కృష్ణుడు కొన్ని తప్పనిసరి పనులున్న కారణంగా తమ వెంట రాలేనని చెప్పి, సుఖంగా యాత్ర ముగించి రమ్మని ఆశీర్వదిస్తాడు. అంతేకాకుండా, కృష్ణుడు తన కమండలాన్ని ధర్మరాజుకిచ్చి, వారు మునిగిన ప్రతి పుణ్యనదిలోనూ దానిని కూడా ముంచుమనీ, తాము దర్శించిన ప్రతి దైవమందిరంలోనూ పుణ్య దర్శనం చేయించుమని ఆదేశిస్తాడు. ఆయన ఆదేశం మేరకు ధర్మరాజు తు.చ.తప్పకుండా ఆచరించి, కొంతకాలం తరువాత ద్రౌపది, సోదరులతో పాటు కమండలాన్ని కూడా వెంటబెట్టుకొని తీర్థయాత్రలనుండి తిరిగివస్తాడు. ధర్మరాజు చేతుల మీదుగా కృష్ణపరమాత్మ కమండలాన్ని అందుకొని, నేలకేసి కొట్టి ముక్కలు ముక్కలుగా చేసి, ఆ ముక్కలను అందరికీ ప్రసాదంగా పంచి పెడతాడు. ఆ ముక్కలను తిన్న ప్రతివారి నోరు పాడైంది. ప్రసాదం తిన్న భక్తులు నోళ్ళను నీటితో కడుక్కోవటం చూసిన శ్రీకృష్ణుడు ధర్మరాజు వైపు చూచి, "ఏమయ్యా ధర్మరాజా! ఈ కమండలం ఇన్ని పుణ్య తీర్థాలు దర్శించినా, ఇన్ని పుణ్య నదులలో మునిగినా దీని చేదు స్వభావం కాస్తయినా పోలేదేమ"ని ప్రశ్నించాడు. దానికి బదులుగా ధర్మరాజు, "ప్రభూ! మీరు కూడా ఇలా వింతగా మాట్లాడుతున్నారేమి? పవిత్ర జలాల్లో మునిగినంత మాత్రాన కమండలం స్వభావం మారుతుందా ఎక్కడైనా?" అని విస్మయంగా పల్కుతాడు. "అయితే దీనిని బట్టి తీర్థస్నానాలు, బాహ్య ఉపచారాలు అంతరంగాన్ని పరిశుద్ధం చేయలేవని అర్థమవుతోంది. అవునా ధర్మరాజా!" అంటూ కృష్ణపరమాత్మ చిరునవ్వు నవ్వుతాడు. ధర్మరాజు తన పొరపాటుని గుర్తించి, ఆత్మశోధనకు అంతర్ముఖుడై పర్యవేక్షణ యొక్క స్థాయిని అవగతం చేసుకొంటాడు.

ఆత్మ విభూతుల స్థాయిని గుర్తించకపోవటం వల్ల గొప్ప వ్యక్తులు కూడా అప్పుడప్పుడు బహిర్ముఖులై తిరుగాడటం సంభవిస్తూ ఉంటుంది.

**కథ -40** : 12 సం॥ల తపస్సుచేసి ఇంటికి తిరిగి వచ్చిన ఒక సాధకుని చూడటానికి వచ్చిన జిజ్ఞాసువుల సమూహానికి, అతనికి లభించిన సిద్ధుల గురించి తెల్సుకోవాలనే కుతూహలం కలిగింది. వారిలో ఉప్పొంగే ఉత్సాహాన్ని చూచి సాధకుడు చిరునవ్వు నవ్వి చేతిలోనికి జలాన్ని తీసుకొంటాడు. మంత్రం చదివి ఆ జలాన్ని ఒక ఏనుగుపై చల్లుతాడు. క్షణంలో ఏనుగు మరణించింది. సాధకుడు మరలా నీటిని తీసుకొని చనిపోయిన ఏనుగుపైన చల్లగా ఏనుగు తిరిగి జీవించింది. ఈ సిద్ధులను చూచి ప్రజలు కరతాళధ్వనులు చేస్తూ జేజేలు పలికారు.

అక్కడే ఆసీనుడై ఉన్న సాధకుని తండ్రి పుత్రుని వంక చూచి, "నాయనా! ఈ సిద్ధుల వల్ల నీకేమి లభించిందని" ప్రశ్నించగా అతడు జవాబు చెప్పజాలక తికమక పడతాడు. బాధగా తండ్రి తిరిగి ఇలా అన్నాడు–"నాయనా! ఈ చమత్కారాల వలయములో పడి నీవు తిరిగిన కాలంలో, సగంకాలం అయినా నీ

**శాంతి లోపలనుండి జనిస్తుంది; దానికోసం బయట వెదకవద్దు.**

ఇంటికి, నీ కుటుంబానికి సేవచేసి ఉంటే నీకు, లోకానికి శుభం చేకూరేది. **ఆత్మ సంపదను సదుపయోగం చేసినపుడు మాత్రమే సాధన సార్థకమవుతుంది."** అని పల్కుతాడు. తండ్రి మాటలు సాధకుని హృదయాన్ని స్పృశించాయి. మర్మాన్ని గుర్తించిన సాధకుడు అంతర్ముఖుడై తన శక్తులను సమాజ కల్యాణానికి వినియోగించ నారంభించాడు.

**కథ -41** : ఒక యువకునిపై ఒక గొప్ప ధనవంతుని ప్రభావం పడింది. చాలా కాలాన్ని ధనార్జనకై వెచ్చించి కోటీశ్వరుడవుతాడు. ఇంతలో ఒక విద్వాంసుడు కనుపించి, యువకుని హృదయాన్ని ఆకర్షిస్తాడు. ధనార్జన వెంటనే ఆపివేసి విద్యాధ్యయనంలో మునిగిపోతాడు. ఇంతలో ఒక గాయకుని గానం ఆ యువకుని అత్యంత ప్రభావితుణ్ణి చేస్తుంది. విద్యాధ్యయనం ఆపి, సంగీత సాధనలో మునిగి పరవశిస్తాడు. ఈ విధంగా 3 వంతుల జీవితం గడచిపోతుంది. కానీ సాధించినది ఏదీ లేదు. అపరిమితమైన దుఃఖం కలుగుతుంది. తన దుఃఖాన్ని ఒక మహాత్ముని ముందు ప్రకటించి ఏదైనా దారి చూపుమంటాడు. మహాత్ముడు సానుభూతితో "నాయనా! ప్రపంచం చాలా విచిత్రమైనది. ఎటువెళితే అటు ఏదో ఒక ఆకర్షణ నిన్ను లాగి వేస్తుంది. ఎటుపడితే అటు పరుగుపెట్టక నీ లక్ష్యాన్ని గుర్తించి ఆ లక్ష్య సాధనకై జీవితాన్ని వెచ్చించాలి. అప్పుడే నీకు తృప్తి, శాంతి లభిస్తాయి. పదేపదే ఇష్టాలు, అభిప్రాయాలు మార్చుకోవటం వల్ల అనుకొన్నది సాధించలేకపోగా అశాంతికి గురికావలసి వస్తుంది" అని తెలియజేస్తాడు. మహాత్ముని మాటల ద్వారా యువకుడు వాస్తవాన్ని గుర్తిస్తాడు. ఒక లక్ష్యాన్ని ఏర్పరచుకొంటాడు. లక్ష్యసాధనలో లగ్నమవుతాడు.

**శ్లో॥ అంతర్జగతోత్థానం పర్యవేక్షణమేవచ ।**
**ఆత్మ విజ్ఞాన మస్త్యస్మిన్నుపలబిర్యథా - యధా ॥**
**యస్య తత్క్రమతోగృహ్ణన్నృషీణాం భూమికామపి ।**
**దేవదూతావ తారాణాం మహా మానవ రూపిణామ్ ॥**
**సఫలం మానవం జన్మస్వం కరోతి తథాచ సః ।**
**కల్యాణ మార్గం జగతః ప్రశస్తించ మహామునే ॥**

**అంతర్ జగత్తు యొక్క పర్యవేక్షణ, అభ్యున్నతి వీటినే ఆత్మజ్ఞానం అంటారు.** ఈ ఆత్మజ్ఞాన ఉపలబ్ధి ఎవరికి ఎంత స్థాయిలో లభిస్తే అంతస్థాయికి తగిన మహామానవులుగాను, ఋషులుగాను, దేవదూతలుగాను, అవతారాలుగాను వారి పాత్రలను పోషిస్తూ జన్మను సార్థకం చేసుకొంటారు. జగత్ కళ్యాణ మార్గాన్ని సుగమం చేస్తారు.

ఆత్మ విశ్లేషణ ఋషి ప్రణీత విద్య. తనలోనికి తొంగిచూచి, ఆత్మావలోకనం, ఆత్మవిమర్శల ద్వారా ఆత్మవికాసానికి మార్గాన్ని అన్వేషించటమే అన్నిటికంటే ఉత్కృష్టమైన పురుషార్థంగా పేర్కొనబడింది. కేవలం ఆత్మను గుర్తిస్తే సరిపోదు. ఆత్మిక క్షేత్రంలో ముందుకు ఎలా పోవాలి? అనే ప్రశ్న మహత్వ పూర్ణమైనది. మనలో చాలా మంది పైపైన చూచి బ్రతికే వారేగానీ, ఎన్నడూ లోపలకు తొంగి చూచి ఎరుగరు.

**జ్ఞానం వివేకిని వినయవంతుణ్ణి చేస్తుంది, అవివేకిని గర్వితుణ్ణి చేస్తుంది.**

**కథ -42** : ఒకసారి శరీరం, ఆత్మ పరస్పరం వాదించుకోవటం ప్రారంభిస్తాయి. తనను తాను చూసుకొని గర్విస్తూ, "నేనెంతో ఆకర్షణీయంగా దృఢంగా ఉంటాను" అంటుంది శరీరం. ఆ మాటలకు ఆత్మ నవ్వి "నీవు గొప్పదానివే కానీ, ఆత్మ సౌందర్యం లేనపుడు శరీర సౌందర్యం, శారీరక శక్తి ఇవన్నీ వృధా. క్షణ భంగురమైన నీ అందం ఆకర్షణ, నా గురించి నీవు శ్రద్ధ తీసుకొంటేనే చిరస్థాయిగా నిలుస్తాయి. నన్ను ఉపేక్షిస్తే నీకు అస్తిత్వమే లేదు" అంటుంది ఆత్మ. ఆ మాటలు శరీరం నమ్మక ఉపేక్షాభావంతో ఆత్మవంక చూస్తుంది. తన అందం, ఆకర్షణ, శక్తి యొక్క గొప్పతనాన్ని చూసుకొని మురిసిపోతూ కాలం గడిపి, జీవితం యొక్క చివరి ఘడియలకు చేరుకొంటుంది. శరీరాన్ని ఆత్మ వదలివేసే సమయము ఆసన్నమైనది.

అపుడు శరీరానికి విషయం అవగతమౌతుంది. "అయ్యో! ఆత్మోన్నతి గురించి ప్రయత్నించి ఆత్మ శక్తి గురించే కృషిచేసి ఉన్నట్లయితే నా స్వరూపం కూడా పరిశుద్ధమై ఉండేది కదా. నేను చనిపోయాక కూడా నా గురించి గుర్తుచేసుకొనే  స్థితి నాకు ఉండేది." అని చింతిస్తూ ఉండగా వెళ్ళిపోబోతున్న ఆత్మ వెనుతిరిగి, శరీరం వంక చూచి "చూడమ్మా! నేను వెళ్తున్నాను. నీవు ఎంత చెప్పినా నీకు లభించిన అధికారాలను సద్వినియోగం చేసికొని, అంతరంగంలో సౌందర్యాన్ని నింపుకోలేక పోయావు. అమరత్వాన్ని పొంది మహామానవుడుగా శ్లాఘించబడవలసిన నీవు పశ్చాత్తాపంతో తల బాదుకొంటున్నావు. ఇప్పుడింక నేనేం చేయగలను? కొత్త శరీరాన్ని పొందటానికి నీవద్ద సెలవు తీసికొనే సమయం ఆసన్నమయింది." అంటూ నిష్క్రమించింది.

**కథ -43** : **వా**సవదత్త ఆకాలంలో శ్రావస్తీ రాజ్యంలో గొప్ప సౌందర్యరాశి. ఎందరో తుమ్మెదల్లా ఆమె చుట్టూ తిరిగేవారు. భిక్షుకుడైన ఉపగుప్తుడు ఆ రోజుల్లో మహాతపస్వి, సౌందర్యమూర్తి గూడ, వాసవదత్త తన చుట్టూ ఎందరు తిరిగినా, ఉపగుప్తుని మాత్రమే పొందాలని ఆరాటపడేది. ఆత్మోపాసకుడైన ఉపగుప్తునిపై ఆమె ప్రభావం ఏ మాత్రం పడలేదు. చివరకు రోగగ్రస్థురాలై జీవిత చరమాంకంలో నున్న వాసవదత్త ఇంటికి ఉపగుప్తుడు వెళ్ళటం జరిగింది. అతన్ని చూచి వాసవదత్త "స్వామి! ఇప్పుడొచ్చావా? నీ కోసం నాదగ్గర ఏమి మిగిలింది?" అంటూ రోదించ సాగింది. ఆత్మజ్ఞాన స్వరూపుడైన ఉపగుప్తుడు అత్యంత ప్రేమానురాగాలతో ఆమె వంక చూస్తూ "ఓ పూజ్యురాలా! సౌందర్యం అనేది ఆత్మది. అది నాశరహితమైన" దంటూ ఓదార్చి, ఆమెకు ఆదరంతో సేవలు చేస్తాడు.

**కథ -44** : **మొ**దట్లో భక్త కవి తులసీదాస్ యొక్క పేరు తుకారాం. భార్య పట్ల అనురక్తుడై పుట్టింట ఉన్న భార్యను కలవాలని రహస్యంగా అక్కడికి చేరుకొంటాడు. వివేకాన్ని మరచి ఆ విధంగా తనను చేరవచ్చిన భర్తను చూచి రత్నావళి తిరస్కార భావంతో యేమన్నదంటే – **"హాడ్ మాంస్ కే దేహ్ మమతాపర్ జితనీ ప్రీతి! తిసు ఆధో జో రామప్రతి అరసి మిటిహి భవ భీతి"**

**భావం** : "ఎముకలు మాంసముతో నిర్మించిన ఈ నా దేహం పట్ల నీకున్న ఆసక్తి కనీసం సగమైనా రామచంద్రుని పట్ల ఉన్నట్లయితే, భవ బంధనాలు తొలగేవి కదా!" అంటూ పల్కిన ఈ మాటలు అతని అంతః కరణను కుదిపివేశాయి. వెంటనే అక్కడ నుండి వెళ్ళి జీవిత గమనాన్ని కాస్తమలుపు త్రిప్పుతాడు. ఆ చిన్న

**ఓర్పు లేని మనిషి నూనె లేని దీపం.**

మలుపు **తుకారాం**ని **"తులసీదాస్"**గా మార్చివేసింది. అతని లేఖినిద్వారా వెలువడిన రామచరిత్ర సమూలంగా **విచారక్రాంతిని** తీసుకొని రావటమే గాక, వ్యక్తి వ్యక్తిని కదిలించి వేసింది. రామావతారం ఆధారంతో విశ్వానికంతకీ ఆయన ఆధ్యాత్మ శిక్షణను ఇవ్వగల్గేడు. రామచరిత్ర ఆయనను అజరుణ్ణి, అమరుణ్ణి చేసింది.

**కథ -45** : తన అంతరంగంలోనికి తొంగిచూచి తనను తాను సమీక్షించుకోనంత వరకు బ్రహ్మ జ్ఞానాన్ని గూర్చిన చర్చ వినోదంగానూ, తమాషాగానూ మాత్రమే మిగిలిపోతుంది. మహిషపుర నగరంలో రవిదత్తుడనే వ్యక్తి గృహస్థ జీవనం గడుపుతూ పశువులను మేపుకొంటూ తృప్తిగా ఆనందంగా జీవించేవాడు. ఒకనాడు విద్వాంసుల సమూహం ఒకటి తీర్థయాత్ర చేస్తూ అక్కడకు రావటం, వారి సామూహిక సందేశంలో జీవితాలను వ్యర్థం చేసికొన వద్దని హెచ్చరించటం, పరలోకానికి కావలసిన ఏర్పాటులు చేసుకొమ్మని సలహా ఇవ్వటం జరిగింది. వారి సందేశం సగం వరకు విన్న రవిదత్త, బ్రహ్మజ్ఞాన ప్రాప్తికై ఇంటిని, ఆలుబిడ్డలను వదలి పారిపోయి ఘోరారణ్యాలు, నదులు, పర్వతాలు, దాటి ఒక మహాత్ముని వద్దకు చేరుకొంటాడు. పక్షులకు మేత మేపుతున్న ఆ మహాత్ముడు పని పూర్తి అయ్యేంతవరకు ఇతన్ని పట్టించుకోడు. ఇతడేమి మహాత్ముడని మనసులో విసుక్కొంటున్నా రవిదత్త మహాత్ముని చూచి బ్రహ్మజ్ఞానాన్ని ప్రసాదించుమని వేడుకొంటాడు. మహాత్ముడు చిన్న గింజల మూటను రవిదత్తుకు ఇచ్చి నీవుకూడ పక్షులకు మేత మేపి ఆ ఆనందానుభూతిని అనుభవించి చూడుమని చెపుతాడు. రవిదత్త మంచీ చెడూ మరచి మహాత్ముని నిందిస్తాడు. ఇదేనా బ్రహ్మజ్ఞానమంటూ తిట్టి పోస్తాడు. ఆ తిట్లకు మహత్ముడే మాత్రము చలించక, రవిదత్తుని హృదయానికి హత్తుకుంటూ, "సోదరుడా! నీవు, వెదకుతున్న ఆ బ్రహ్మజ్ఞానం శాస్త్రాలలోను, ఉపదేశాలలోను లేదయ్యా, నీలోనే ఉంది. నీవు నీ ఉనికిని, నిజస్థితిని మరచిపోవటం వల్ల ఆ బ్రహ్మజ్ఞానాన్ని మరిచిపోతున్నావే కాని, పువ్వులలో సుగంధం, అగ్నిలో తేజస్సు యే విధంగా ఉన్నాయో అదే విధంగా బ్రహ్మజ్ఞానం జీవబ్రహ్మలో బంధించబడి యున్నది. దానిని నీవు బంధవిముక్తురాలిని చేయి, వికసింప చేసి, ఆ సౌరభాన్ని అందరకూ పంచిపెట్టు. నీలో పేరుకొన్న పనికిరాని విషయాలను పారద్రోలి, శూన్యస్థితికి రా. ఆపుడు నీలోపలనే ఆనంద సముద్ర కెరటాలు ఉప్పొంగటం నీవు గమనించగలవని" తెలియజేస్తాడు.

**కథ -46** : **ఉ**దావర్తుడనే రాజు అమూల్యమైన రత్నరాసులను తీసుకొని కణ్వమహర్షి ఆశ్రమంలోకి ప్రవేశించి వాటిని ఆయనకు సమర్పిస్తూ తనకు బ్రహ్మ విద్యను ఉపదేశింపుమని ప్రార్థిస్తాడు. మహర్షి ధనరాశులను తిరస్కరిస్తూ ఒక సంవత్సరం తర్వాత వచ్చినట్లయితే ఉపదేశం లభించగలదని, ఈలోగా వృత్తులపట్ల విముఖుడవై అంతర్ముఖుడు కావటానికి సాధన చేయుమని ఆదేశిస్తాడు. ఈ మాటలు రాజుకు బాధ కల్గించాయి. వ్యధిత హృదయంతో వెనక్కి తిరిగి వెళ్ళిన రాజుని చూచి మంత్రి "రాజా! ఆకలిగొన్నవానికే తిన్న తిండి జీర్ణమైనట్లు, జిజ్ఞాసువుకే జ్ఞానప్రాప్తి కలుగుతుంది. సంవత్సరకాలం వ్యవధినిచ్చి, మహర్షి మీ జిజ్ఞాసను పరిశీలిస్తున్నాడు. పాత్రత లేనివానికి జ్ఞానాన్ని జీర్ణించుకొనే శక్తి ఉండదు. మనోరంజనానికి ఏదో ఒకటి చెప్పి, కాలాన్ని దుర్వినియోగం చేయటం ఇష్టంలేని మహర్షి మిమ్ములను వెనక్కి పంపించి ఉంటాడు. చెడుగా తలంచ వలదని" అనునయ వాక్యాలు పల్కుతాడు ఆ వాక్యాలవల్ల రాజుకి ఊరట లభించింది. సంవత్సర కాలం బ్రహచర్యాన్ని,

**మనిషిని ఆశ గొప్పవాణ్ణి చేస్తుంది. దురాశ నీచుణ్ణి చేస్తుంది.**

నిగ్రహాన్ని పాటించి ఆత్మజ్ఞానాన్ని పొందటానికి తగిన అర్హతను సంపాదించి మరల మహర్షి ఆశ్రమాన్ని చేరుకొంటాడు. మహర్షి రాజుని ఆనందంతో కౌగలించుకొని, రాజా! నీ వంటి శ్రద్ధ, ధైర్యం గల వ్యక్తి మాత్రమే బ్రహ్మవిద్యను పొందగల్గుతాడంటూ ఆశీర్వదించి, అప్పుడే బ్రహ్మ విద్యను ఉపదేశిస్తాడు.

**శ్లో॥ జిజ్ఞాసాయాః సమాధానం త్వేకమే వాస్తి తాత ! యత్ ।**
**స్వతంత్రో మానవః స్వస్యాం ప్రగతౌ దుర్గతౌ భృశమ్ ॥**

పిప్పలాద మహర్షి జిజ్ఞాసువులను వీక్షిస్తూ, "ఓ ఋషి పుంగవులారా! మీ జిజ్ఞాసకు సమాధానం ఒక్కటే. మనుజునకు అతని ప్రగతి, దుర్గతికి తగిన మినహాయింపు మాత్రమే లభిస్తుంది. అనౌచిత్యాన్ని ఆశ్రయించి మానవుడు స్వయంగా తనకు తానే విషవృక్షాలను నాటుకొంటాడు. అలాగాక ఆత్మనిర్మాణమే పురుషార్థంగా తెల్సిన వానికి, సన్మార్గంలో పయనించే సాహసం కలవానికి పతనం, పరాభవం అనేవి ఏనాడూ దరిచేరవు. ఆత్మగరిమ యొక్క శ్రేయాధికారి ఏ పరిస్థితులలోను తన అంతరంగ సామర్థ్యాన్ని మరచిపోడు. ఆ ప్రవాహం అతనిని సహజంగానే ఉత్కృష్ట మార్గం గుండా లాక్కొనిపోతుంది.

**కథ -47** : ధర్మరాజు ఒక చిన్న అబద్ధం చెప్పటం వలన అతి స్వల్ప సమయం నరకాన్ని అనుభవించ వలసి వస్తుంది. నరకంలోనికి ప్రవేశించిన ధర్మరాజునకు అక్కడ కష్టాలు అనుభవిస్తున్న సోదరులు, స్వజనులు అనేకమైన ఇతర ప్రాణుల ఆర్తనాదాలు వినిపించాయి. వారందరూ ఆర్తితో "ఓ ధర్మరాజా ! మరి కొంతసేపు నీవు ఈ ప్రదేశంలో ఆగు, నిన్ను స్పృశించిన వాయువు మమ్ములను తాకి మా శిథిల దేహాలకు శీతలత్వాన్ని లభింపచేస్తోంది." అంటూ ప్రార్థించగానే ధర్మరాజు దేవతలతో ఇలా అన్నాడు. "అయ్యా! స్వల్పకాలమే నరకం అనుభవించవలసిన నేను వీరికి శాంతికల్గే పక్షంలో, శాశ్వతంగా స్వర్గాన్ని వదలి నరకం లోనే ఉండటానికి సిద్ధంగా ఉన్నాను. నేను ఆర్జించుకొన్న పుణ్యఫలం ఇక్కడ వీరికి మేలు కల్గించే పక్షంలో, అంత కంటె నాకు కోరదగినది యేమీలేదని, ఇక్కడే ఉండటానికి అనుమతినిమ్మని" ప్రార్థిస్తాడు. దేవ దుందుభులు మారు మ్రోగుతాయి. స్వజనులు, సోదరులతో సహా ధర్మరాజుకి స్వర్గద్వారాలు తెరువబడతాయి. ధర్మరాజుకి నరకంలో గడపవలసిన స్వల్ప వ్యవధికూడ తొలగించి వేయబడుతుంది.

**కథ -48** : ఒక రాయి చెక్కబడటానికి, అరగబడటానికి ఇష్టపడక నీటిలో అట్టడుగున పడి ఉండి పోతుంది. రెండవ రాయి అరిగి, అరిగి, ఉలిదెబ్బలు తిని శివలింగంగా రూపు దాలుస్తుంది. మందిరంలో ప్రతిష్ఠించబడి, పూజలు హారతులు అందుకొంటుంది. పైకిచూస్తే ఈ రెండు రాళ్ళు ఒక జాతికి చెందినవే. భేదమేమీ లేదు. కానీ ఒకటి సత్కర్మకి తనను తాను సమర్పించుకో గల్గింది. రెండవది సమర్పించుకో లేకపోయింది. తేడా కాస్త ఇక్కడే ఉంది.

ఒక ధాతువులోని ముక్క తన అస్థిత్వాన్ని నిలబెట్టుకోడానికి వేటిలోనూ కలవనని, వేటినీ తనలో కలుపుకొనని మొండికేస్తుంది. ఫలితంగా నిరుపయోగంగా మిగిలిపోతుంది. తిరస్కరించబడి వెలివేయబడుతుంది. రెండవ లోహపుముక్క ఇతర విజాతీయ లోహాలను కూడా తనలో కలుపుకొని సమ్మెట దెబ్బలుతిని, కరిగి పరివర్తన చెంది అందమైన ఆభరణంగా రూపు ధరిస్తుంది. ఈ విధంగా గౌరవాన్ని, విలువనుకూడ పెంచుకొంటుంది.

**మెదడుకు శిక్షణ ఇస్తే చాలదు హృదయాన్ని సున్నితం చేయాలి.**

**కథ -49** : పూర్ణుడనే భిక్షువు సమాజంలో ధర్మోపదేశం చేయటానికి బుద్ధుని అనుమతి కోరతాడు. బుద్ధుడు చిరునవ్వు నవ్వి, "వత్సా! సమాజంలోని ప్రజలు చాలా కఠోరులు, నిర్లక్ష్య స్వభావం కలవారు. నీ ఉపదేశాలు వినక తిరస్కరించటమే గాక, నిన్ను తిట్టడం, రాళ్ళతో కొట్టడం కూడ చేస్తారు. ఆలోచించుకో" మంటాడు. "తిడితే నేమిలే స్వామీ! చంపరుకదా" అంటాడు శిష్యుడు నవ్వుతూ. "ఒకవేళ చంపినా చంపవచ్చు. చంపరని చెప్పలేము. తయారుగా ఉండాలి" అంటాడు బుద్ధుడు. దానికి పూర్ణుడు నిర్వికార భావంతో, "ఇతరుల మేలు కోసం ఈ దేహం నశించినంత మాత్రాన సార్థకమైనందుకు ఆనందించాలేగాని, చింతదేనికి స్వామీ! అనుమతి నీయు"మని చేతులు జోడిస్తాడు. బుద్ధుడు అతి ప్రసన్నుడై "వత్సా! ఉపదేశకుల స్థాయిని నీకు గుర్తు చేయటానికి నీతో ఇలా అన్నానే గాని, నీ ధర్మం నిన్ను తప్పక రక్షిస్తుంది. వెళ్ళిరమ్మని" ఆశీర్వదిస్తాడు. **ఉపదేశకులు, లోకసేవకులు ఇటువంటి సాహసాన్ని కలిగి ఉండాలి.**

**కథ -50** : రావణుని నిండు సభలో అంగదుడు తనకాళ్ళను రాతిస్తంభాలవలె చాపి నిలబడతాడు. ఎందరో యోధులు ఆ కాళ్ళను కదలించడానికి ప్రయత్నించి విఫలమైన తర్వాత రావణుడు ఆ ప్రయత్నంలోనే అంగదుని కాళ్ళు పట్టుకోబోతాడు. అంగదుడు వారిస్తూ, రావణా, సర్వసమర్థుడైన రాముని పాదాలు కదలించు. ఆయన నీకు శుభం కల్గిస్తాడు. నాపాదాలు పట్టుకొంటే ప్రయోజన మేముంటుంది. అని హెచ్చరిస్తాడు.

ప్రహ్లాదుడు తాను ఎంచుకొన్న సన్మార్గం వెంబడి పయనించటానికి కన్న తండ్రితో కూడా పోరాడవలసి వస్తుంది. "నీవు నాలాగే ధనాన్ని, వైభవాన్ని ఆర్జించాలి, నేను నీ తండ్రిని, నా ఆజ్ఞను శిరసావహించి తీరాలి" అంటూ హిరణ్య కశ్యపుడు ప్రహ్లాదుని హెచ్చరించినా, ఆజ్ఞాపించినా ప్రహ్లాదుడు తండ్రి యొక్క అనుచిత ఆజ్ఞలను పాలించ లేనన్నాడు. తండ్రి పెట్టిన భరించరాని కష్టాలను భరించాడే గానీ, సన్మార్గం వెంబడి పయనాన్ని ఆపలేదు. ఒక్క అడుగు ప్రక్కకు వేయలేదు. **"అవినీతిని తిరస్కరించటం అనే మహత్తర బాధ్యత, కుటుంబ మర్యాదలు, బాంధవ్యాల కంటే కూడా మహత్వపూర్ణమైనదని ప్రహ్లాదుని కథ తెలుపుతోంది.**

**శ్లో॥ సామాన్యాస్తు జనాః సర్వే గృహ్ణన్తో దూరదర్శితామ్ ।**
**వివేకం సంత్యజన్తశ్చాకర్షణేషు భ్రమంతిహి ॥**
**కుమార్గ గామినో భూత్వా దురూహం దుఃఖ సంతతిమ్ ।**
**సహన్తే, మౌఢ్యమాయాయ యది మోక్తుం సమేతుతే ॥**

సామాన్య జనులు దూరదృష్టి లేక వివేకాన్ని కోల్పోయి, ఆకర్షణలో పడి తిరుగుతారు. చెడు మార్గాన్ని అవలంబించి భరించరాని దుఃఖాలను భరిస్తారు. ఆత్మావలంబులు, వివేకవంతులవలె వారు కూడా ఆ మూఢత్వం అనే మాయనుండి బయటపడటానికి సాహసం అనే మార్గాన్ని ఆశ్రయించినట్లయితే కష్టాలు విపత్తులు అనేవి కనుచూపు మేరలో కనుపించవు. వివేకం యొక్క ఆశ్రయాన్ని వదలుకోవటం అనేది అన్నింటికంటే పెద్ద పొరపాటు. బుద్ధి పరంగా పరాధీనులైన వ్యక్తులు కాలానుగుణమైన ఆకర్షణల రసాస్వాదనలోనే ఆనందాన్ని వెదకటములో వివశులవుతారు. వారు రాబోవు పరిణామాల గురించి కనీసం ఆలోచన కూడా చేయలేరు.

దూరదృష్టి కల ఆలోచనా మార్గం, దూరదృష్టిలేని ఆలోచనా మార్గం–అని రెండు ఆలోచనా మార్గాలున్నాయి. మొదటి మార్గాన్ననుసరించిన వారు రాబోయే సత్పరిణామాలను దృష్టిలో ఉంచుకొని నిర్ణయాలు చేస్తారు. **భవిష్యత్‌లో ఏ ప్రతి క్రియలు దుఃఖకరంగా ఉంటాయో వాటిని వదలివేస్తూ ఉంటారు.** దూరం అంటే మైళ్ళు, కిలోమీటర్లలో కొలిచే దూరం ఎంతమాత్రం కాదు. సమయం యొక్క అంతరాన్నే "దూరం" అని అంటారు. గమ్యం చేరేసరికి లభించే సౌఖ్యకరమైన పరిణామాల గురించి ఆలోచించే వ్యక్తిని **దూరదర్శి** అని అంటారు. అలాగే సమయానుకూలంగా ఉత్పన్నమయ్యే మంచీ,చెడు పరిణామాలను దృష్టి యందుంచుకొని, నేటి కార్య పద్ధతి నిర్ధారణ చేసే వ్యక్తులను కూడా దూరదృష్టి కలవారని అంటారు.

**కథ -51** : ఒక దట్టమైన అడవి మధ్యలో ఒక కాలిబాట వెంబడి కొందరు బాటసారులు గమ్యం చేరాలనే ఆతృతతో పెద్ద పెద్ద అంగలు వేస్తూ ప్రయాణం చేస్తున్నారు. ఇంతలో ఒక ఏనుగు వచ్చి, బాటసారి మీదకి ఉరికింది. బాటసారి ప్రాణభయంతో పరుగుపెట్టి, ఒక నూతిలో పడిపోయాడు.

నూతిలో గోడ వెంబడి మొలిచిన రావిచెట్టు కొమ్మ బాటసారి చేతికి చిక్కింది. ఎలాగో ఏనుగు బాధ తప్పి గండం గడిచిందని బాటసారి నిశ్చితంగా ఊపిరి పీల్చి లోపలకు తొంగి చూస్తాడు. మృత్యురూపంలో ఒక మొసలి నోరు తెరచి తన వంకే చూస్తూ కనిపించింది. బాటసారి గుండె ఝల్లు మన్నది. భయంతో మెల్లగా దృష్టిని పైకి మరల్చాడు. ఒక పెద్ద తేనె పట్టునుండి తేనె బొట్లు కారుతూ కనిపించింది. బాటసారికి వెంటనే ఆనందము కలిగింది. క్రింది మృత్యురూపంలో పొంచి ఉన్న మొసలి మాట మరచి, తేనె మాధుర్యాన్ని ఆస్వాదించ సాగాడు. ఇంతలో తాను పట్టుకొన్న కొమ్మ మొదట్లో ఏదో అలికిడి వినిపించింది. పరిశీలనగా చూసాడు. రెండు ఎలుకలు కొమ్మ మొదలు కొరికి వేస్తున్నాయి. ఒకటి తెల్ల ఎలుక, మరొకటి నల్ల ఎలుక.

ఈ పరిస్థితులన్నీ "జీవిత స్వరూపాన్ని ప్రకటిస్తున్నాయి." ఏనుగు అంటే కాలం, మొసలి మృత్యువు, జీవితానందం తేనె పట్టు, చెట్టు కొమ్మను కొరకివేస్తున్న రెండు ఎలుకలు రాత్రింబవళ్ళు. అజ్ఞాని అయిన బాటసారి ఇన్ని పరిస్థితులలోను అంధకారం నుండి బయటపడే ఉపాయాన్ని ఆలోచింపక, తేనెబొట్ల కోసం నోరుచాపి తన్మయత్వం పొందుతున్నట్లు జీవుడు జీవిత సుఖాలనే పట్టుకొని తన్మయత్వం చెందుతూ ఉంటాడు.

దూరదృష్టిని ఆశ్రయించటం కోసం ఎల్లవేళలా అంతఃకరణ నుండి సాహసం ఉప్పొంగి ప్రవహించాలి. ఇది ఆత్మపరమైన పురుషార్థం వల్లనే సంభవిస్తుంది. **పతనం సహజంగానే సంభవిస్తుంది.** కానీ **ఎదగటానికి మాత్రం పురుష ప్రయత్నం కావాలి.** ప్రవాహంలో కొట్టుకు పోవటానికి, ప్రయత్నం ఏమీ అవసరము లేదు. ప్రవాహానికి ఎదురీదటానికే సాహసం కావాలి. దీనికి ఎక్కడి నుండో అనుగ్రహం కలగాలని ఆశించటం, యాచించటం మూర్ఖత్వం.

**కథ -52** : **మూఢత్వం** అనే మాయనుండి మానవుడు ఎప్పుడు బయటపడతాడో చెప్పలేము. కానీ మహామానవుల సత్సంగ, ఉపదేశ, శ్రవణాలు–పతనోన్ముఖ దిశాధారలను దారిమళ్ళించి, సన్మార్గంలో నడిపించటంలో వ్యక్తిని వివశుణ్ణిని చేస్తాయి.

**సృష్టికర్త నిరర్థకమైన ఏ వస్తువునూ సృష్టించలేదు.**

అవంతి రాజ్యంలో కోటికర్ణుడనే భిక్షువు తన అనంత వైభవాన్ని వదలి, పరివ్రాజకుడై తిరుగుతూ ప్రజలకు అమృతోపదేశాలను వినిపించసాగాడు. చెవికి కోటిరూపాయల విలువచేసే ఆభూషణాన్ని ధరించే కోటికర్ణుడు, భిక్షుక వృత్తిని చేపట్టి, తన్మయత్వంతో ఉపదేశాలను ఇవ్వటం చూచి, ప్రజలు ఆనంద పరవశులై, అతని ఉపదేశాలను శ్రద్ధా భక్తులతో వినసాగేరు.

శ్రోతలలో కూర్చొని నిత్యం శ్రద్ధా భక్తులతో ఉపదేశాలను వింటున్న "కీర్తియాని" అనే ఒక శ్రీమంతురాలి ఇంట ఒక రోజు దొంగలుపడి సమస్త సంపదను దోచుకోసాగారు. దాసి ద్వారా ఈ విషయము విన్న కీర్తియాని, ఏ మాత్రం చలించక నిశ్చలంగా కోటికర్ణుని ఉపదేశం వినసాగింది.

దాసి ఆశ్చర్యంతో చూస్తూ యజమానురాలికి విషయాన్ని మరలా వినిపించసాగింది. కీర్తియాని నిర్వికార భావంతో దాసి వంక చూసి, "దొంగలు దోచుకోబోతున్న ఆ నకిలీ సంపద గురించి నాకెందుకు చింత? ఇక్కడ నేను కోటికర్ణుడందించే వాస్తవమైన సంపదను రెండు చేతులా ఆర్జిస్తున్నాను. తన సమస్త సంపదను, రాజ్య వైభవాలను వదలివేసి ఏ సంపదనైతే కోటికర్ణుడు ఆర్జించాడో, ఆ సంపదను ఇక్కడ మనందరకూ మోయగలిగినంత పంచి పెడుతున్నారు. నాకిది చాలు. నా ఇంటిలో సంపద ఎలాగైనా పోనీయ్ – నాకు చింతలేదు" అంటుంది. ప్రక్కనే పొంచి వున్న దొంగలు కూడా ఆ మాటలు విని, సంపదను అక్కడే వదలివేసి కోటికర్ణుడికి నమస్కరిస్తారు. ఉపదేశాలు విని వివేకవంతులైతే తమ జీవిత గమనాన్ని దారి మళ్ళిస్తారు.

**శ్లో॥ మహా మనీషిణ స్తత్వజ్ఞానిన ఏత దేవహి ।**
**ఆత్మతత్వంతు విజ్ఞాతు ముద్భోద్భుంచాస్య మూర్ఛనామ్ ॥**
**ప్రౌఢం పరిష్కృతం కర్తుం భజంతే యోగసాధనామ్ ॥**
**తపస్యాయాం రతిశ్చాపి పరిష్కార ఇవాస్తియత్ ॥**

జనసముదాయం మూఢత్వం అనే మాయనుండి బయటపడలేక ప్రసుప్తావస్థలో జీవిత శకటాన్ని ఈడుస్తూ జీవితాన్ని గడిపేటప్పుడు తత్వజ్ఞానాన్ని ఎరిగిన మహాత్ములు వారికి ఆత్మతత్వం యొక్క స్థాయిని అవగతం చేసి నిద్రలేపాలి. నిద్రలేస్తే సరిపోదు. నిద్రలేచిన జనసముదాయం సాధన, పురుషార్థాలను ఆశ్రయించి తీరాలి. సాధనకోసం తపోచర్యను కూడా అవలంబించటం చాలా అవసరం, ఈ మాత్రమైనా ఆచరించకుండా ఆత్మతత్వంమీద పరచుకొని ఉన్న కుసంస్కారాల నుండి ముక్తి లభించటమనేది సాధ్యంకాని పని.

**కథ -53** : చిత్రకేతుడనే మహారాజుకు మహర్షి అంగీరసుని కృపవలన చాలా కాలానికి సంతానం కల్గుతుంది. కానీ బిడ్డ కిశోరావస్థలోనే మృతుడవటం వల్ల రాజు పుత్రవియోగంతో వ్యాకులత చెంది రాజ్యభారాన్ని బాధ్యతలను వదిలివేస్తాడు. మహర్షి వచ్చి, దివంగతుడైన ఆత్మను ఆవాహన చేసి రాజుతో మాట్లాడిస్తాడు. రాజు యొక్క వాత్సల్యాన్ని, ఆ వ్యాకులతను చూసి కూడా బిడ్డ చిరునవ్వు నవ్వి! "ఓ జీవుడా! **మనమంతా కర్మను అనుసరించి ఇలా తిరుగుతూ ఉండటమే గానీ నేను నీకు పుత్రుడనుకాను. నీవునాకు తండ్రివీకాదు, బాంధవ్యాన్ని కాక ఆత్మ తత్వాన్ని తెల్సుకో! దానివలన మాత్రమే నీవు ఈ సంసార బంధనాల నుండి ముక్తిని పొందగలవు**" అని

పల్కుతాడు. రాజుకు ఆ మాటలు ఓదార్పునిస్తాయి. శేష జీవితాన్ని అతడు ఆత్మకల్యాణ సాధనలో లీనంచేసి, ఆత్మజ్ఞానాన్ని పొంది, జీవన్ముక్తుడవుతాడు.

వాస్తవమైన పురుషార్థం ఏమిటంటే ఆత్మజ్ఞాన ప్రాప్తియోగం, తపోసాధనలు. ఇవన్నీ ఈ ఆత్మజ్ఞానాన్ని పొందటానికే చేస్తూ ఉంటారు.

పిండము 9 నెలలు వరకు మాతృగర్భంలో పరిపక్వమవుతుంది. గర్భంలోని బిడ్డకు తల్లి ఆహారాన్ని, ఉష్ణోగ్రతను మొదలైన ఏర్పాట్లను తన శరీరత్యాగం ద్వారా ప్రసాదిస్తుంది. ఇది ఒక విధమైన కాయకల్ప చికిత్స. అలాగే యోగి వన ప్రదేశాలలో ఉంటూ ఏకాంతం, తపోసాధన, ఆత్మ పరిష్కారం ఇవన్నీ తనకు తాను ఒక క్రొత్త బాటలోనికి మలుపు త్రిప్పటానికే చేస్తూ ఉంటాడు. గురుకుల అరణ్యకాలంలో తపోబల సంపన్నమైన వాతావరణాన్ని, కొత్త రీతిని, నీతిని స్వీకరించడానికి పరిపక్వస్థితిని తీసుకొని రావటానికే నిర్మిస్తారు.

కొలిమిలో పడి కాలి, తపించి, శోధన చేయబడకుండా బంగారం మేలిమిగా మారలేదు. బంగారాన్ని శుద్ధి చేయటం కంసాలియొక్క సాధన. ఉక్కు పనిముట్లు కూడా తపించకుండా రూపాలు ధరించటం సాధ్యం కాదు.

**తపస్సు అంటే సంచిత కుసంస్కారాలను వదలించుకొని తనను తాను పరిష్కరించుకోవటమే :**

సామాన్య వస్తువుని అసామాన్యమైనదిగా తయారు చేయగల గౌరవం ఎప్పుడు లభిస్తుందంటే దాని లోపల ఉన్న కషాయ, కల్మషాలను దగ్ధం చేసే అవకాశం కల్గించినపుడు మాత్రమే లభిస్తుంది.

భగీరథుని తపస్సు గంగను భూమిపైకి తీసుకొని రాగల్గింది. పార్వతి తపస్సు ద్వారానే పరమేశ్వరుని భర్తగా పొందింది. తపస్సుతోనే ధృవుడు బ్రహ్మాండానికి కేంద్రమైనాడు. తపస్సే దధీచి ఎముకలను వజ్రాయుధంగా మార్చి అసురనాశనం చేసింది. విశ్వామిత్రుని నూతన సృష్టి మొదలైన అద్భుతాలన్నీ తపస్సు యొక్క అసాధారణ సామర్థ్యం వల్లనే సంభవించాయి. ఆత్మతత్వం యొక్క పరిపక్వస్థితికి తపస్సు అనివార్యమైనదిగా నిర్ధారణ గావించబడింది.

తపోబలంతోనే బ్రహ్మ సృష్టి నిర్మాణం కావించాడు. ఆదిశేషుడు తన తపోబలంతోనే ఈ భూభారాన్ని అంతనీ మోయగల్గుతున్నాడు.

సాధారణ వ్యక్తులు ఎందరో తపస్సు ఆధారంతోనే మహాత్ములు, ఋషులుగా పరివర్తిన చెంది విశ్వ రక్షణ యొక్క బాధ్యతలను స్వీకరించగలిగారు. దేవతలు ఆత్మబలాన్ని, రాక్షసులు భౌతిక శక్తులను కూడా తపో సాధనను ఆశ్రయించి పొందగలిగారు. భగవంతుడైన శ్రీరామచంద్రుడు తన ముగ్గురు సోదరులతో సహా హిమాలయ గుహలలోనికి వెళ్ళి తపస్సు చేస్తాడు. భగవంతుడైన శ్రీకృష్ణుడు సుసంతాన ప్రాప్తికి రుక్మిణీ సమేతంగా బదరికాశ్రమంలో చాలా కాలం తపస్సు చేయవలసి వచ్చింది. స్వయంభూ మనువు, శతరూప దంపతుల తపోశక్తే వారికి శ్రీరామచంద్రుని వంటి జగన్నాయకుని పుత్రునిగా ప్రసాదించింది. **కశ్యపుడు, అదితి చేసిన తపస్సుకి ప్రసన్నుడై కృష్ణ భగవానుడు వారి ఒడిలో ఆటలాడటానికి ఆనందంగా దిగివచ్చేడు. దీని వలన మనకు అర్థమవుతున్నది ఏమంటే, తపస్సు ద్వారా మానవుడు భగవంతునికి తండ్రి కాగలడు.**

**వ్యతిరేకాత్మకమైన ఆలోచన మనిషి శక్తిని తగ్గిస్తుంది.**

తపస్సు వల్లనే నిద్రాస్థితి నుండి మేల్కోనే పరిస్థితులు ఏర్పడతాయి. బుద్ధుడు ఆత్మశాంతిని వెదకుతూ ఇల్లు వదలి వెళ్ళినపుడు, ఆత్మప్రాప్తికి ఏదైనా దారి చూపుమని అనేక మంది గురువులను అడుగుతాడు. చివరకు ఆయన అంతరంగం నుండి "తపస్సు" ద్వారా నీలోపల ప్రకాశాన్ని ఉద్భవింప చేయుమని పిలుపు వినిపిస్తుంది. తపస్సు ద్వారా ఆత్మతత్వాన్ని తెల్సుకోవాలనే సంకల్పం తీసుకొంటాడు. ఈ విధంగా ఆయన బుద్ధత్వాన్ని పొందుతాడు.

**కథ -54** : విశ్వామిత్రుడు ఒకరాజు. వశిష్ఠ ఆశ్రమానికి ఒకసారి సేనా సమేతముగా చేరుకొంటాడు. కామధేనువు శక్తి ద్వారా మహర్షి అతన్ని యధోచితంగా సత్కరిస్తాడు. కామధేనువు శక్తిని, ప్రభావాన్ని చూచి విశ్వామిత్రుడు ఆ గోవును కావాలంటాడు. ఇష్టపూర్వకంగా మహర్షి గోవుని ఇవ్వక పోవడం వల్ల విశ్వామిత్రుడు గోవును బలవంతాన లాక్కొని పోవాలనుకొంటాడు. మహర్షి ఆజ్ఞను పొంది కామధేనువు తన శరీరం నుండి లక్షల సైన్యాన్ని ఉద్భవింపచేసి విశ్వామిత్రుని పరాజితుణ్ణి చేస్తుంది. బ్రహ్మ తేజస్సు యొక్క ఈ శక్తిని చూచి విశ్వామిత్రుడు క్షాత్ర ధర్మాన్ని వదలి బ్రాహ్మణత్వ ప్రాప్తికై తపస్సు చేస్తాడు. తన జీవిత దిశాధారలనే మార్చి వేసుకొంటాడు.

## "ధిక్ బలం క్షత్రియ బలం యత్ బ్రహ్మ తేజో బలం బలమ్"

అంటూ విశ్వామిత్రుడు చేసిన ఘోర తపస్సు, అడుగడుగునా భంగమైనా నిరాశచెందక, అతడు చేసిన తపస్సు యొక్క శక్తి, క్రొత్త సృష్టిని సృష్టించింది. బ్రహ్మ అతనిని సృష్టినిర్మాణ కార్యాన్ని ఆపుమని, అతనికి బ్రాహ్మణ పదవిని ప్రదానం చేస్తాడు. అలాగే వశిష్ఠ మహర్షి అతడిని బ్రహ్మర్షిగా అంగీకరిస్తాడు.

**శ్లో॥ పాత్రతాయాం వికాసోయం హ్యనేకానేక సంపదామ్ ।**
**ఉపలబ్ధేర్విభూ తీనాం పంథాశ్చ కేవలః స్మృతః ॥**

పాత్రత యొక్క వికాసమే అనేకమైన సంపదలు, విభూతులు ప్రాప్తించటానికి ఏకైక మార్గం. ఈ మార్గంలో కాలు మోపకుండా ఆత్మసంపద ప్రాప్తించదు. చౌకబారు లోహాన్ని కూడా బంగారంగా మార్చగల పారసమణి వంటిది పాత్రత.

భౌతిక క్షేత్రంతో పోలిస్తే ఆధ్యాత్మ క్షేత్రంలోని ప్రతిఫలం అనేకరెట్లు మహత్వపూర్ణమైనది. సమర్థవంతమైనది, చమత్కారమైనది కూడా. ఏ, ఏ మహా పురుషులలో ఈ విశేషతలు, చమత్కారాలు చూసి, విని, ప్రతి వ్యక్తి పరవశిస్తాడో, వాటిని పొందాలని ఆశిస్తాడో అవన్నీ కూడా ఆ, యా స్థాయికి చెందిన పురుష ప్రయత్నం లేకుండా లభించవు. పాత్రత లేకపోవటం వల్లనే అధికశాతం వ్యక్తులు ఆధ్యాత్మిక విభూతులనుండి వంచించబడుతూ ఉంటారు. పాత్రత పెరిగే కొలదీ వ్యక్తికి దేవతలు ఏ అభ్యర్థనలు, ప్రార్థనలు లేకుండానే, వారిపై అనుగ్రహాన్ని అపారంగా కురిపిస్తారు.

**కథ -55** : చెట్టు తన ఆకర్షణ శక్తి ద్వారా మేఘాలను వివశుల్ని చేసి వర్షింప చేస్తుంది. గనులు తమ సజాతీయ కణాలను దూరతీరాల వరకు ఆహ్వానాన్ని పంపి, వాటిని తమ దగ్గరగా రమ్మని పిలుస్తూ ఉంటాయి.

**నేర్చుకోవాలనే తపన కలిగినవాడు ప్రతి వ్యక్తినుండీ, ప్రతి సంఘటననుండీ నేర్చుకుంటాడు.**

ఇది ఒక ఆకర్షణ. ఇది ఎక్కడ ఎంత అధికంగా ఉంటే, అంత స్థాయికి చెందిన ఆహ్వానాలు, పిలుపులు సజాతీయులకు లభిస్తూ ఉంటాయి. వికసించే పూవులు, పండ్ల యొక్క సౌరభం తేనెటీగలను, సీతాకోక చిలుకలను, తుమ్మెదలను ఎంతో సుతారంగా ఆహ్వానిస్తూ ఉంటాయి. ఇలాగే ప్రతిభను అనేకులైన ప్రశంసకులు అనుయాయులే సృష్టిస్తారు. ఇది పురుషార్థం ద్వారా వికసించబడిన, ఆత్మ పరిమళము యొక్క పరిణామమే. **సరిగా ఇదే విధంగా సాధకుని యొక్క సౌరభం దైవశక్తులను అదృశ్య రూపంలో ఆహ్వానిస్తూ ఉంటుంది. వారిని తనపై అనుగ్రహాన్ని కురిపించటంలో వివశుల్ని చేస్తుంది.**

రాతిబండ మీద వర్షం కురవవచ్చు. కానీ దానిమీద యేమీ మొలకెత్తలేవు. లోపల తడి ఉన్నట్లయితే ఆ నీటిని సేకరించి తనలో ఇంకించుకోగల పురుష ప్రయత్నం రాతిబండ ద్వారా జరిగి, బండరాయి గూడ పచ్చదనంతో కళకళలాడుతుంది. తమ తలుపులు బంధించుకొని ఉండి, సూర్యభగవానునికి మేమంటే గిట్టదు, మాకు వేడిని ప్రసాదించడు అనటం మూర్ఖత్వమే. యెదపై ఏర్పడిన బూడిదను తొలగించడమే ఆలస్యంగానీ, దానిని తొలగించిన మరుక్షణం  ప్రజ్వలిస్తూ అగ్ని దేదీప్యమానంగా వెలిగిపోతుంది. తమను తాము మరచి బెజ్జం పడిన కుండలా జీవించే వారిపై ఎంతటి అనుగ్రహవర్షం కురిసినా వ్యర్థమేగానీ ఫలితం యేముంటుంది? **మహత్ములంతా తమ పాత్రతను పెంచుకోవటం వలన మాత్రమే దైవ కృపకు పాత్రులయ్యారు. ఈ అనుగ్రహాన్ని పొందటం కోసం వారు సంకల్ప బలాన్ని, వ్రత నిష్ఠను పాటించి ఆదర్శాల పట్ల పూర్తి సమర్పణను గావించుకొన్నారు.**

**కథ -56** : అర్జునదేవుడనే ఆయనకు ఆశ్రమంలో ప్రవేశించి దీక్ష తీసికొన్న తక్షణమే గురువు ద్వారా పాత్రలు శుభ్రంచేసే పని అప్పగించబడింది. ఆయన ఉదయం నుండి సాయంత్రం వరకు ఇతర శిష్యులు ధర్మచర్చ, గురుపూజ మొ။గు కార్యక్రమాలలో లగ్నమై ఉన్నప్పుడు కూడా పాత్రలనే శుభ్రం చేస్తూ ఉండేవాడు. అన్య చింతనను దరి చేరనిచ్చేవాడు కాదు.

కొంతకాలానికి గురువుకు అవసానకాలం సమీపించింది. గురువు వీలునామా వ్రాసి తన మృత్యువు తర్వాత దాన్ని తెరచి చూడుమని ఆజ్ఞాపించాడు. శిష్యులందరూ తమ విశిష్ట యోగ్యతల కారణంగా ఎవరికి వారే ఉత్తరాధికారం లభిస్తుందని భావిస్తూ గురువు దేహాన్ని చాలించిన తర్వాత వీలునామా విప్పి చూశారు. దానిలో అర్జునదేవుడు ఉత్తరాధికారిగా లిఖించబడి ఉన్నాది. పనిపట్ల అతనికి గల శ్రద్ధ, క్రమశిక్షణ ఈ రెండు యోగ్యతలు అర్జునదేవుకి ఆ పదవిని సంపాదించి పెట్టాయి. ఈ అర్జునదేవే శిక్కు ధర్మంలో ఐదవ గురువు. ఈ పాత్రతనే మాటల్లో చెప్పాలంటే ఆత్మబలం అని చెప్పవచ్చు. ఈ ఆత్మబలమే మహామానవులను కూడా భయంకరమైన విపత్తులలోను, ప్రతికూల పరిస్థితులలోను కూడ తమ ఆదర్శాలు, సిద్ధాంతాల పట్ల స్థిరంగా చెక్కు చెదరకుండ ఉంచగలుగుతుంది. ఈ సామర్థ్యమే సిద్ధార్థుని బుద్ధునిగాను, ఒక రాజకుమారుని మహా వీరునిగాను, సాధారణ సాధువుని సమర్థ గురురామదాసుగాను, ఒక పూజారిని రామకృష్ణ పరమహంసగాను, ఒక సాధారణ ఉపాధ్యాయుని స్వామి రామతీర్థునిగాను, చెప్పకుండా ఇంటినుండి పారిపోయిన ఒక సాధారణ యువకుని దయానందునిగాను, విషయ వాంఛలలో లీనమైన తుకారామ్‌ను

**సిద్ధాంతరీత్యా పొరపాటయిన విషయం వ్యవహారణలో ఎన్నడూ సముచితం కాదు.**

తులసీదాస్‌గాను మార్చి వేసింది. **ఇది యే దేవత యొక్క అనుగ్రమో, చమత్కారమో** కానీ ఆ దేవత మాత్రం ప్రతి హృదయంలోను విరాజిల్లుతూనే ఉంది.

గురువైన విరజానందుని ద్వారా దయానందునకు శక్తి వితరణ, మహర్షి ధౌమ్యుని ద్వారా ఆరుణికి ఋషి పదవి, రామకృష్ణ పరమహంస ద్వారా వివేకానందునకు విశ్వవిఖ్యాతి, ఇవేవి కూడ వ్యక్తిగత పాత్రత లేకుండా అందివ్వటం సాధ్యంకాదు. ఆధ్యాత్మికత యొక్క చమత్కారం ఈ పాత్రత యొక్క అభివర్ధనమే. ఈ పాత్రత దివ్య విభూతులను వర్షింపచేయటం తప్పనిసరి గావిస్తూ ఉంటుంది.

**శ్లో॥ ఆత్మ నిరీక్షణం చాత్మ నిర్మాణః సర్వతో మహాన్ ।**
**పురుషార్థ మతోనాస్తి సాధనాయచసర్వధా ॥**
**పరావలంబనం నైవ విద్యతే విద్ధితామతః ।**
**ఆత్మనస్తు పరిష్కారః సుకరః సునియోజితః ॥**

ఆత్మ నిరీక్షణ, ఆత్మ నిర్మాణమే అన్నిటినీ మించిన పురుషార్థము. సాధన అనేది ఆత్మ పరిష్కారం యొక్క సునిశ్చితమైన ఆధారం మాత్రమే.

జీవితం అనేది అసంఖ్యాకమైన సత్పరిణామాలతో కూడిన కల్పవృక్ష మనటంలో ఏ మాత్రము సందేహం లేదు. **జీవితాన్ని సరియైన మార్గంలో పెట్టడానికి చేసేటటువంటి పురుష ప్రయత్నాన్నే సాధనంగా పేర్కొన్నారు. సాధన అంటే వ్యక్తిని అజ్ఞానం నుండి జ్ఞానం వైపుగా దారి మళ్ళించటమే. కాని దురదృష్టమేమంటే అధిక సంఖ్యలో ప్రజలు పురుష ప్రయత్నాన్ని లెక్కపెట్టక యాచించటం, దైవానికి లంచాలిచ్చి ఆశించినవి పొందాలని చూడటం, ప్రార్థనలు, స్తుతులు చేయటం ఇవే సాధన యొక్క పర్యాయ పదంగా భావిస్తున్నారు. వీటివల్ల కాలం, శ్రమ, ధనం, దండగ తప్ప ప్రయోజన మేమీ ఉండదు.**

**కథ -57** : ఒక శిల్పి అనేకమైన శిల్పాలు అందంగా తయారు చేశాడు. వాటిని తన్మయంగా చూచుకొని వెక్కి వెక్కి ఏడ్వసాగేడు. ఏడ్వటానికి కారణం ఏమిటని ప్రజలు శిల్పిని ప్రశ్నించగా, ఈ శిల్పాల్లో ఎంత వెదికినా లోట్లు, పొరపాట్లు కనిపించటంలేదు. నా సూక్ష్మ దృష్టి ఇంత మందంగా తయారైనట్లయితే ముందు ముందు నేను ఇంతకంటే అందమైన శిల్పాలు తయారు చేయటానికి ఆస్కారం ఉండదు. నా శక్తి ద్వారాలన్నీ మూతబడిపోతాయి. అంటూ వెక్కి వెక్కి ఏడ్వసాగేడు.

ఈ భావన వ్యక్తిని మరింత ప్రతిభావంతుణ్ణి చేసి ప్రకాశంవైపు లాక్కొని పోతుంది. ఏదో కొంతచేసి తృప్తిపడిపోవటం, మిగిలినది అదృష్టానికి, దైవానికి వదలి వేయటం గాక, ఈ విధమైన భావాలు కలిగి ఉన్నవారు అసాధారణమైన ప్రతిభావంతులు కాగల్గుతారు.

**కథ -58** : చాలా మంది గారడీలనే సిద్ధులు, సాధనలు అని భావిస్తూ ఉంటారు. అక్కడ పురుష ప్రయత్నం లేకుండా చమాత్కారమే ప్రదర్శించ బడుతూండటం వల్ల సహజంగా ప్రజలు ప్రభావితులవుతూ ఉంటారు.

**మంచి పనికి ధనంకన్న మంచి ఆలోచన, దృఢ సంకల్పం మరింత అవసరం.**

కానీ వస్తుస్థితి, వాస్తవిక స్థితి అవగాహన అయ్యేసరికి ఆత్మ పరిష్కారం యొక్క గొప్పతనం ఈ మోసగాళ్ళ యొక్క స్వరూపం రెండూ కూడా వ్యక్తికి దృష్టిగోచరమౌతాయి.

ఒక నటుడు గారడీ చూపించి తిరిగి వెళుతూ ఉండగా, అతని వెనుక ఒక సాధువుకూడా శిష్య సమేతంగా వస్తున్నాడు. దారిలో నది ఒకటి అడ్డు వచ్చింది. నటుడు ఒడ్డున కూర్చొని నావికుణ్ణి పిలవసాగేడు. మహాత్ముడు చిరునవ్వు నవ్వి "ఇన్ని రకాల నైపుణ్యాలు చూపించావు కదా! ఈ మాత్రం చిన్న నదిని దాటలేవా? దీనికి నావికుడు రావాలా?" అని ప్రశ్నించాడు. నటుడు సిగ్గుపడుతూ "మహాత్మా! మీకు తెలియని దేముంది? పొట్టకూటికి గారడి చేసేవాడు నావికుడు లేకుండ నది దాటగలడా?" అంటూ తల వంచుకొన్నాడు.

మహాత్ముడు శిష్యులవంక తిరిగి, "నాయనలారా ! ఆధ్యాత్మిక ఔన్నత్యాన్ని సంపాదించటం లౌకిక దృష్టిలో చాతుర్యాన్ని సంపాదించటం. ఈ రెండిటి మధ్య ఎంత వ్యత్యాసముందో గమనించారా! ఆధ్యాత్మిక ఔన్నత్యానికి సాధన కావాలి, ఆత్మశుద్ధి కావాలి. ఇవి లేకుండా ఆచరించే మొత్తం కర్మ కాండలన్నీ కూడా నటుని క్రియా కలాపాల వంటివే"నని తెలియజేసి శిష్య సమేతంగా ముందుకు సాగిపోతాడు.

**కథ -59** : ఆత్మ నిర్మాణానికి ఉద్యుక్తుడైన సాధకుని యొక్క బాహ్య రూపాన్ని దర్శించాల్సిన పని ఉండదు. ఒకసారి ఒక సాధువు ఆకలితో, దప్పికతో సతమత మౌతూ మనస్సుని పిల్చి ఇలా అన్నాడు. "ఓ మనస్సా! శరీరాన్నెందుకు కష్టపెడ తావు? ఎక్కడయినా కాస్త యాచించి తెచ్చి దానిని తృప్తి పరచవచ్చు గదా! అంటూ నచ్చజెప్పి, యాచించే నిమిత్తం ఒక గుమ్మం ముందు నిలబడతాడు. ఇంతలో ఆత్మ అతన్ని వారిస్తూ, "అయ్యా! నీవు ఎవరినైతే యాచించ బోతున్నావో వాళ్ళూ నీలాంటివారే గదా! నీలాంటి వాళ్ళనే నీవు అడుక్కోవటానికి బదులు నీకు నీవే సంపాదించుకోవటం శ్రేయస్కరం" అంటూ వారిస్తుంది. మనస్సు మళ్ళీ అడ్డు తగిలి, "ఓ తపస్వీ! నీవు ఆర్జించటం తప్పు. భిక్షాటన నీకు తప్పులే" దంటూ ప్రోత్సహిస్తుంది. ఆత్మ మనస్సుని వెనక్కి లాగుతూ **"యే అపరిగ్రహి పరిగ్రహానికి దాసుడో, ఆ దాంపత్యం కంటే ఒకరి వద్ద చేయి జాచని పరిగ్రహమే ఉత్తమమైంది"** అని ఆత్మ తెలియజేయగానే సాధువు ఆత్మముందు శిరస్సు వంచి నమస్కరిస్తూ వెనక్కి తిరిగి వచ్చేస్తాడు.

**కథ -60** : ఒకసారి ఒక శిష్యుడు గురువుతో, "గురుదేవా! భగవంతుడు వ్యక్తులందరిపైనా తన అనుగ్రహాన్ని కురిపిస్తూ వారికి కష్టాలు, బాధలనుండి తానే రక్షించటానికి బదులు పురుష ప్రయత్నం చేసుకొమ్మంటూ ఎందుకు వేధించుకు తింటాడు" అని ప్రశ్నించాడు. మహాత్ముడు గంభీర స్వరముతో, "వత్సా! ఈ లోకం ఒక క్రమబద్ధమైన విధి విధానాల ద్వారా నడుస్తోంది. విధాత పాత్రతలేని వాళ్ళందరకూ తన అనుగ్రహాన్ని పంచడం మొదలిడితే కర్మ, స్వావలంబన యొక్క ఆవశ్యకత, విలువ సమూలంగా నశించిపోయి, యాచకులు, బిచ్చగాళ్ళతో విశ్వమంతా నిండిపోతుంది. ఒక కథ చెపుతాను విను" అని అంటాడు.

ఒకసారి శ్రీ మహాలక్ష్మి సహజ కరుణతో తమ బిడ్డల కష్టాలు తీర్చాలని భూమిపైకి దిగి వచ్చింది. భూమాత లక్ష్మిని వారిస్తూ, "అమ్మా! నా బిడ్డలను నీ అనుగ్రహంతో సోమరులుగాను, పనికిరానివారుగానూ

తయారుచేయకు. వృథాగా నీవు వరాలనీయటం వల్ల నా సంతానం ఎందుకు పనికిరాని వారుగా తయారవుతా" రంటూ బ్రతిమాలుతుంది. కానీ లక్ష్మి పృథ్వీదేవి పల్కులను నిరాకరిస్తూ, "నాపట్ల నీకున్న ఈర్ష్యవల్ల నా దారికి అడ్డువస్తున్నావేగాని, నీ బిడ్డలను సుఖపెట్టాలని వచ్చిన దానిని నీవు మూర్ఖంగా తిరస్కరించటం నే నంగీకరించను. నా కృపకోసం ప్రతి వ్యక్తి పరితపిస్తూ ఉంటాడంటూ భూమాతని దాటుకొని ముందుకుపోయి ప్రతి ఇంటిని వెండి బంగారాలతో నింపివేసింది. ప్రజలు తమ సౌభాగ్యానికి, అదృష్టానికి పొంగిపోతూ పరిశ్రమవైపు కన్నెత్తి చూడటం మానివేశారు. మామూలుగా వర్షాకాలం వచ్చినా ఎవరూ విత్తనాలు జల్లలేదు. ఆ కారణంగా పంటలు పండటం మాని వేశాయి. పంటపొలాలు పిచ్చిచెట్లు, ముళ్ళచెట్లతో నిండిపోయాయి. నిలువ ఉంచుకొన్న ధాన్యాలన్నీ క్రమంగా సమాప్తమయ్యేసరికి నలువైపులా హాహాకారాలు చుట్టుముట్టాయి. గుండెలమీద బంగారు ఇటికలు పెట్టుకొన్నా, గోరంత ఆకలి తీరక జనులు ఆకలిబాధతో మరణించసాగేరు. పుత్రశోకంతో భూమాత విలపిస్తూ, శవాలుగా మారిన తన బిడ్డలను విధాతకు చూపించి వెక్కి వెక్కి ఏడ్వసాగింది. ఆకస్మిక ధనలాభం ఏవిధంగా శాపంగా మారిందో గమనించిన విధాత, భూమాతను ఓదారుస్తూ, కర్మనిష్ఠులు, పురుషార్థ పరాయణులు అయిన వ్యక్తులను నలువైపులా భూమిపైకి పంపించాడు. వారు వైభవాన్నంతటినీ క్షణంలో ప్రక్కకి తొలగించి, నాగలి చేతపట్టి నూతన సృష్టి ప్రారంభించారు.

**శ్లో॥ ఆత్మవస్తు వికాసం యః కర్తుం శక్తః సయేవహి ।**
**సు సంస్కృతస్య సఫల స్తథ్య స్యాస్య మహామునే ॥**

"ఓ మహామునీ! ఎవరైతే ఆత్మవికాసాన్ని పొందగల్గుతారో, అతనే సంస్కరించబడి సాఫల్యాలను పొందగల్గుతాడు. ఈ తథ్యంయొక్క ప్రత్యక్ష అనుభూతికొరకు సాధనాత్మకమైన పరాక్రమాన్ని చూపవలసి ఉంది. ఓ ఋషి శ్రేష్ఠులారా! మనమంతా ఆ ఆధ్యాత్మ అమృతపానాన్ని గ్రోలుతూ కూర్చోవటం కాదు. మనం పొందిన ఈ లాభాన్ని వ్యక్తి వ్యక్తికీ అందించగల్గిననాడే, మన ఆధ్మాత్య విద్య సార్థకమవుతుంది. **సాధన అనేది ఒక పరాక్రమం. తన దుష్ప్రవృత్తులకు, తనకు మధ్య ఒక గొప్ప సంఘర్షణే సాధన.** ఈ సంగ్రామంలో ఎవరు ఎంత స్థాయిలో విజయాన్ని సాధించగల్గుతారో, వారు అంత స్థాయిలోనే బాహ్యదృష్టిలో సంస్కారవంతుడుగానూ, అంతరంగ దృష్టిలో మహాత్ముడుగానూ మారగల్గుతాడు. **సాధన అనేది సంస్కృతి-సభ్యతల మధ్య సమన్వయం.** దీనిలో సంస్కృతిని ఉద్భవస్థానంగానూ, సభ్యతను ప్రవాహ రూపంగానూ పేర్కొనటం జరిగింది. **ఆలోచనలు, విలువలు, విశ్వాసాలు మొ॥వాటి సమావేశాన్నే "సంస్కృతిగా" చెప్పటం జరిగింది.** ఈ పృష్ఠభూమి యొక్క ప్రేరణతోనే గతి విధులు నిర్ధారించబడతాయి. అలాగే మర్యాదా పక్షానికి చెందిన జీవన చర్యను "సభ్యత" అంటారు. సంస్కరించబడిన వ్యక్తికే సభ్యతను గూర్చి తెలుస్తుంది. శిక్షణ ఇవ్వబడిన అడవి జంతువులు ప్రదర్శనలో యే విధంగా అయితే నైపుణ్యాన్ని చూపగల్గు తున్నాయో, అదే విధంగా సాధనాపరమైన క్రమశిక్షణలో మూర్ఖుడైన వ్యక్తి వివేకవంతుడుగానూ, సంస్కారవంతుడుగానూ మారగల్గుతున్నాడు. దీనినే "సభ్యతా సంవర్ధనము" అంటారు అంటూ మహర్షి జిజ్ఞాసువుల వంక ప్రసన్న దృక్కులతో వీక్షించాడు.

**దారి ఎప్పుడూ మూసి ఉండదు. తరచు జనమే ధైర్యాన్ని కోల్పోతారు.**

వ్యక్తిలో అనేకమైన నిధులు నిక్షిప్తమై ఉన్నాయి. ఆత్మ నిర్మాణ సాధనద్వారా ఆ నిధులను బయటకు తీసుకోగల్గితే, వ్యక్తి తనకు తానే కుబేరుడంత సంపన్నుడు కాగల్గుతాడు. తనలోనే ఎన్నో నిధులుండగా బయట వారి నెవరినో దైన్యంగా యాచించటం, అసమర్థుడుగాను, పరాధీనుడుగాను జీవించటం ఆత్మగౌరవాన్ని నాశనం చేసుకోవటం ఎందుకు? సాధనయొక్క సఫల పరిణామాలను మనం నలువైపులా చూడవచ్చు.

సాధనవల్ల సామాన్య స్థాయికి చెందిన ప్రాణులుకూడా అత్యంత ఆశ్చర్యకరమైన పనులు చేసి చూపించగలవు. అడవిగోవులు మనిషిని దగ్గరకు చేరనీయవు. కానీ వాటిని నెమ్మదిగా పెంపుడు జంతువులుగా మార్చినపుడు పాలను ఇస్తాయి, పిల్లలనూ ఇస్తాయి. పేడ మొదలైన ఉపయుక్త పదార్థాలను ఇచ్చి, పెంచేవాడిని లాభాన్వితుణ్ణి చేస్తాయి. అలాగే అడవి గుర్రాలు, కుక్కలు, ఏనుగులు మొదలైనవి ఆకలితో మరణిస్తాయి. కష్టాలను భరిస్తూ అనిశ్చితమైన జీవితాన్ని గడుపుతాయి. పెంపుడు జంతువులుగా మారినపుడు మాత్రమే అవి నిశ్చింతగా జీవిస్తూ, పెంచేవారికి కూడా అనేక లాభాలను కలుగచేస్తాయి.

ఇలాగే శరీరం, మనస్సు యొక్క శక్తి ధారలు మనలో వన్యమృగాలవలెనే నిరుద్దేశ్యంగాను, నిగ్రహం లేకుండాను ప్రవహిస్తూ ఉంటాయి. అనుపయుక్తంగా ఉండిపోయిన ఈ శక్తిధారలు వికృతి చెంది, పరిసరాలన్నిటినీ విషతుల్యం చేస్తున్నాయి. నిప్పు ఎక్కడుంటే అక్కడ మండించినట్లు, క్షారపదార్థాలు ఎక్కడుంటే అక్కడ మెల్లగా కరిగించివేసినట్లు, వికృత ప్రవృత్తికూడా వినాశనాన్నే సృష్టిస్తుంది. వీటిని సక్రమంగా ఉంచగల్గితే సాధారణ స్థితిలో ఉన్న మనుజుడు అడుగడుగునా అసాధారణ స్థితిని వ్యక్తీకరించగలడు.

**జీవితం యొక్క బహిరంగ, అంతరంగ క్షేత్రాలలో సుసంస్కారాల సువ్యవస్థను ఉత్పన్నం చేసే దానినే "సాధన"** అని అంటారంటూ, ఈ విధంగా పిప్పలాద మహర్షి ఆత్మతత్వం గురించి వ్యాఖ్యానించి. దీనిని మేల్కొల్పి వికసింపచేసే విద్యకు సంబంధించిన జ్ఞానాన్ని అందజేసి, జిజ్ఞాసువులైన ఋషులతో ఇంకా ఇలా అన్నారు –"ఓ ఋషి శ్రేష్ఠులారా! **జ్ఞాని యొక్క జ్ఞానార్జన సంకుచిత పరిధిలో తనకు తానే ఉపయోగించుకోవటంకాక, నలువైపులా వెదజల్లగలిగినపుడు మాత్రమే సార్థకమవుతుంది. 'ఉపదేశ శ్రవణం' సార్థకమవాలంటే, తాను విన్నది తనవద్దనే దాచుకోక, అందరకూ అందజేయగలగాలి.** తమ బుద్ధి చాతుర్యానికి, మనోల్లాసానికే ఈ సత్సంగాలు, జ్ఞాన శిబిరాలు ఏర్పాటు చేసినట్లైతే ఇవి నిరర్థకమే. వీటిద్వారా జరిగిన చర్చ, సందేశాలను జన సామాన్యానికి అందించి, వారిని పతనం నుండి ఉత్కృష్టదిశగా మరల్చగలగాలి. **మేఘాలు, వాయువువలె నలుదిశలా వ్యాపించి, జ్ఞానవర్షాన్ని కురిపించి** వ్యక్తి వ్యక్తిని కృతార్థుణ్ణి చేయాలి"

**కథ -61** : ఒక శిష్యుడు ఆత్మజ్ఞానానికి సంబంధించిన శిక్షణ పొంది గురువుతో "గురుదేవా! ఏకాంతంలో హాయిగా కూర్చొని ఆత్మచింతన చేసుకోవటంలో ఉన్న ఆనందం మరెక్కడాలేదు. కాబట్టి నేను ఉన్నతస్థాయికి చెందిన సాధన నిమిత్తం పర్వాతాల వంటి శాంతిని, పరమార్థాన్ని కోరుకొంటున్నాను" అన్నాడు. ఆ మాటలకు గురువు నవ్వి, "వత్సా! పర్వతాల పరమార్థం అనిశ్చితమైనది, కానీ నీ పరమార్థం అదికాదు. నీవు అజ్ఞానమనే చీకటి ఎక్కడ వ్యాపించి ఉంటే అక్కడకు, ఎంతటి దూర తీరాలకైనా సరే వెళ్ళు. వ్యక్తులు దీనులుగా, హీనులుగా

**నిజాయితీయే ప్రతిష్ఠకు పునాదిరాయి.**

జీవితాలు ఎక్కడ ఈడుస్తూ ఉంటే అక్కడకు తక్షణం బయలుదేరు. అలాగే వ్యక్తికి, వ్యక్తికి మధ్య భేదభావాలు, మోసం, కపటం, అసూయ, అహంకారం వంటి విషబీజాలు ఎక్కడ వెదజల్లబడి ఉంటే అక్కడ నీ అవసరం ఎంతైనా ఉందని గుర్తుంచుకో" అని తెలియజేస్తాడు. కాని శిష్యుడు విచలిత మనస్కుడై "గురుదేవా ! నేను హిమాలయాలను వదలి ఎక్కడకూ వెళ్ళలేను. నేను అజ్ఞాన తిమిరాంధకారాలు, వ్యక్తులు వ్యక్తుల మధ్య సంఘర్షణలు, యాతనలు చూడలేను. అక్కడి కోలాహలాలు ఏడుపులు భరించలేను" అంటాడు. ఆ మాటలకు గురువుగారి నేత్రాలు తీక్షణంగా మారాయి. శిష్యుని వంక తీక్షణంగా చూస్తూ, "వత్సా! **ఏ రాష్ట్రంలో పౌరులు అజ్ఞానులు, చేతకానివారుగా తిరుగుతూ ఉంటారో, ఆ రాష్ట్రంలో ఎవరైనా ఒక ప్రబుద్ధుడు జ్ఞాని అయి ఉండి కూడా, ఆత్మకల్యాణానికే పరిమితమైన స్వార్థచింతనలు చేస్తూ కూర్చోవటం అవినీతి క్రింద, క్షమించరాని నేరం క్రిందే లెక్కించవలసి వస్తుంది.** ఈశ్వరుని పొందాలంటే ప్రకాశాన్ని సాధన చేయక తప్పదు. "ప్రకాశాన్ని సాధన చేయటం" అంటే అంధకారంలో తిరుగుతున్న వారివద్ద జ్ఞాన జ్యోతులు వెలిగించటం, వారిని వెలుగులోనికి లాక్కొని రావటం అని అర్థం. నీవు ఆర్జించిన జ్ఞాన సంపదను నలువైపులా వెదజల్లు. లేచి కర్తవ్య రథాన్ని అధిరోహించు! లే". అని గురువు గర్జిస్తాడు. ఆ సింహగర్జనతో అతనిలోని మోహం వదిలింది. మానవత్వమనే దేవదూతగా రూపాన్ని ధరించి అగ్రగాముల సమూహంలో కలిసిపోతాడు.

**కథ -62** : స్వామి దయానంద విరజానందుని ఆదేశం మేరకు తపోబలాన్ని ఆర్జించటానికి ధరాసుశిఖరాలను చేరుకొంటాడు. అక్కడ పరుశురామ శిలపైన కూర్చొని ఘోరతపస్సు చేస్తాడు. 6 సం॥లు గడిచాయి. అతడు బ్రహ్మ తేజస్సుతో వెలిగి పోసాగాడు. "సాధనపట్ల మోహాన్ని వీడకు. సాధనా మార్గంలో పయనించ వలసిన దూరం ఇంకా చాలా ఉంది". అంటూ లోపల నుండి ఆదేశం వచ్చింది. ఇంతలో గురుదేవుని గొంతు వినిపించింది. "వత్సా! సాధనచేసి ముక్తి పొందటానికా! నిన్ను వనాలకి పంపినది? లే, లేచి పయనాన్ని సాగించు. సమాజంలో వ్యాపించిన అవినీతి, అంధ విశ్వాసాలలను రూపుమాపు, ధర్మమనే శాలువాను మలినం చేస్తున్న పండితుల ధోరణిని ఖండించు" అంటూ ఆదేశం వినించగానే దయానంద పరుశురామ శిల మీదనుండి లేచాడు. వ్యక్తిగత సాధనకు స్వస్తి చెప్పేడు. ధర్మాంధుల మధ్యకు ఉరికాడు. జన మానసాలలో వ్యాపించిన భ్రాంతులను ఖండించి అజ్ఞానాన్ని రూపుమాపటమే తన జీవిత సాధనగా మార్చుకొన్నాడు.

**కథ -63** : అంబాపాలి యొక్క ఆతిథ్యాన్ని స్వీకరించి, ఆమెను బౌద్ధ భిక్షువుగా మార్చి సమాజ సేవలో విలీనం కావించి బుద్ధ భగవానుడు తీర్థాటనకు ముందుకు సాగుతూ ఉండగా, వెంటనున్న ఆనందుడు తన జిజ్ఞాసను వ్యక్తం చేస్తూ ఇలా అన్నాడు. "ఓ భగవానుడా! ఈనాడు మీరు ఒక పతితురాలిని సాగరం దాటించేశారు బాగుంది. కానీ ఈ బాపతు మానవ సమాజాన్ని అంతటినీ ఒంటరిగా మీరేమి చేయగలరు? ఎక్కడెక్కడ తిరిగి ఎందర్ని ఉద్ధరించగలరు" అని ప్రశ్నించాడు. బుద్ధుడు నవ్వి, "ఏమి నాయనా! ఈ ప్రశ్నకు జవాబు నేనే ఇవ్వాలంటావా? అయితే విను – బౌద్ధ ధర్మం "సంఘం శరణం గచ్ఛామి" అనటంలో తాత్పర్యం, కేవలం ఒక్కవ్యక్తి, ఒకే బుద్ధుడు సంఘం శరణం గచ్ఛామి అనటం ఎంత మాత్రం కాదు. వివేకానికి బుద్ధికి ప్రతీకలుగా అనేక శిష్యగణాలు రాబోయే కాలంలో **"విచారక్రాంతి"** అనే విస్తృతమైన జ్వాలను సమాజమంతా ప్రజ్వలింపజేసి,

**ఓటమి గురించి కాక - ఆశ, విశ్వాసం, విజయాల గురించి మాట్లాడు.**

ఈ అవాంఛనీయ పరిస్థితులను రూపుమాపుతారు. బుద్ధుడు అనే అవతారం కేవలం ఒక వ్యక్తిగా, కేవలం ఈ కాలానికే పరిమితమై దిగి రాలేదు. భవిష్యత్తులో ఉద్ధారకుల అవసరం ఎప్పుడు ఏర్పడినా **ప్రజ్ఞారూపంలోను, వివేకం రూపంలోను అనేక బుద్ధావతారాలు** దిగివస్తాయి. ప్రజ్ఞావంతులైన మీరంతా ఇంటింటికి వెళ్ళి, **వివేకం నీతి సదాశయాలను శరణు వేదుమని** ప్రజలకు శిక్షణ నీయండి" అంటూ బుద్ధుడు తెలియజేయగానే ఆనందుడికి భ్రమ తొలగింది. వాస్తవమేమిటో అతనికి అవగతమైంది.

**శ్లో॥ యదార్థ సంయుక్తం శృత్వాతు ప్రతిపాదనమ్ ।**
**ఆరణ్య కాః స్థితాః సర్వే తుష్టాస్తేతు మహర్షయః ॥**

యదార్థంతో కూడిన ఈ ప్రతిపాదనలు విన్న మహర్షులందరికీ అపరిమితమైన ఆనందం కల్గింది. వారి సందేహాలు చాలావరకు నివారించబడ్డాయి. ఇంకా క్రొత్త విషయాలను తెల్సుకోవాలనే ఉత్కంఠ వారిలో ప్రచండ వేగంతో ఉద్భవించసాగింది. కానీ గాయత్రీ సంధ్యావందనానికి సమయం కావటం వల్ల శిబిరం ఆ రోజుకి ముగించి వేయవలసి వచ్చింది. మహాప్రజ్ఞ పిప్పలాదుడు జిజ్ఞాసువులకు నమస్కరించి, "ఓ పూజ్యులారా, మీ జిజ్ఞాస నాకర్థమైంది. కానీ నిత్య నియమిత సమయానికి అందరం సంధ్యావందనానికి హాజరు కావల్సి ఉండడంవల్ల, ఈ జ్ఞాన శిబిరాన్ని తిరిగి రేపు ప్రారంభిద్దాం". అని చెప్పగానే ఇటు జిజ్ఞాస, అటు ఆధ్యాత్మ జ్ఞానం యొక్క అనివార్యతను దృష్టియందుంచుకొని, ఋషిగణాలు ఉల్లాస పూరిత వాతావరణంలో పరస్పరం అభివాదన చేసుకొని సెలవు తీసుకున్నారు.

**ఇతి శ్రీమత్ ప్రజ్ఞాపురాణే "ఆధ్యాత్మ దర్శన" ఇతి ప్రకరణోనామ ద్వితీయోధ్యాయః**

